
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061694

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నవభావన

ఉపన్యాస వ్యాస సంపుటి



లోకాయుక్త

**ఆవుల సాంబశివరావు**

సంపాదకులు

**వెలువోలు బసవపున్నయ్య**

# ఇదీనామాట

ఇది లోకాయుక్త ఆవుల సాంబశివరావుగారి అప్రకటిత ప్రకటిత పుపన్యాస వ్యాస సంపుటి. ఎందరో ప్రాజ్ఞులున్నప్పటికి దీనికి సంపాదకుడుగా వుండు భాగ్యమును నావంటి సామాన్య పత్రికా రచయితకు కలిగించిన సాంబశివరావుగారికి కృతజ్ఞుడను.

ఏనాడో శ్రీ ఆవుల శేముషీ వైభవ దీపికలుగా రూపొందిన ఈ రచనలు నేడుకూడ ఆంధ్రుల ఆత్మాభిమాన కాంతులను విరజిమ్ముచు వారిలో చైతన్య స్ఫూర్తిని కలిగించుటకు దోహదకారులగునని నా ప్రగాఢ విశ్వాసం.

ఎప్పుడో తమ పత్రికలలో ప్రకటించిన కొన్ని వ్యాసములను తిరిగి ముద్రించుకొనుటకు అనుమతించిన ఆయా పత్రికాధిపతులకు కృతజ్ఞుడను.

ఈ అమూల్య రచన లన్నిటిని భద్రపరిచి నాకందించిన శ్రీమతి ఆవుల జయప్రదగారికి, ఈ సంపుటి వెలుగు చూచుటకు తోడ్పడిన ఆంధ్రజ్యోతి సంపాదకులు నండూరి రామమోహనరావుగారికి, ప్రఖ్యాత పత్రికా రచయిత తుర్లపాటి కుటుంబరావుగారికి. ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్య శర్మగారికి, ప్రఖ్యాత సాహిత్య విమర్శకులు నాగళ్ళ గురుప్రసాదరావుగారికి, అహర్నిశలు నన్ను తరిమి తరిమి అనుక్షణం జవసత్వములు కలిగించిన యం. వి. వి. యస్. మూర్తి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞాంజలులు.

మీ

వెలువోలు బసవపున్నయ్య

# ఇదీవరస...

ఇందులోనివి, చాలావరకు ఈనాటివి కావు చాలాకాలం నాటివి, ఎక్కువ వ్యాసాలు, ఉపన్యాసాలు నేను న్యాయమూర్తిని కాకపూర్వం రాసినవి. పరిణతి చెందుతున్న ఆనాటి నా ఆలోచనలకు అద్దం పడతాయి ఇవీ, మరికొన్నీను. ఆ రోజులలో ఉండే ప్రజాజీవితానికి సమస్యలకు నేను స్పందించిన రీతిని సూచిస్తాయి. ఆ అభిప్రాయాలన్నీ మారకుండా నాలో అలాగే గూడుకట్టుకొని లేవు. నా పరిణతిని అనుసరించి నాలోని ఆలోచనా వీచికలు కూడా మారుతూ వచ్చాయి, మారుతున్నాయి.

అయితే సుమారు రెండు దశాబ్దాలకు పూర్వం ఉన్న దేశ పరిస్థితిని జిజ్ఞాసగల ఒక పౌరుడు ఎలా ఆలోకనం చేశాడో చెబుతుంది ఈ చిన్న వ్యాస సంకలనం.

ఎవరో అడిగి బలవంతపెడితే తప్ప కాగితం మీద కలంపెట్టే అలవాటు లేదు నాకు. అలా ఎందరో మిత్రులు నా చేత రాయించినవీ, మాట్లాడించినవీ ఈ వ్యాసాలు, ఉపన్యాసాలు.

అట్లాగే నా రాతలు అచ్చువేయించాలని నాకు ఎన్నడూ కోరిక కలగ లేదు. అందుకు పనివత్తిడితో, తీరుబాటు కూడా దొరకలేదు. మిత్రుడు వెలువోలు బసవపున్నయ్య పట్టుబట్టాడు. కట్టలు గట్టి, బూజుపట్టి, ఏ మూలనోవున్న వాటిల్లోనుంచి తనే ఏరాడు వీటిని. తనే కూర్చాడు కూడా. ఈ కాసిని మాటలు రాయడం తప్ప ఈ పుస్తకం బాధ్యత యావత్తూ బసవపున్నయ్యగారిదే. వీటికి ఆవిష్కర్త ఆయనే. అవ్యాజమైన అభిమానం ఆయనిది.

తరవాత కాలంలోని నా రచనలు, సమయం దొరికితే, మరికొన్ని సంపుటాలలో ప్రచురిద్దామని ఆలోచన ఉంది. అది సంభవమైతే అప్పుడు కలుద్దాం మళ్ళీ.

అప్పటిదాకా సెలవు.

మీ

ఆవుల సాంబశివరావు

# పొరుగింటి పుల్లకూర

ఒకనాడు సంస్కృతాన్ని, తదుపరి ఆంగ్లాన్ని, ఆ తరువాత హిందీ భాషను మనం గౌరవించాం. స్వభాషను చిన్నచూపు చూశాం.

హాల్డేన్ వంటి పాశ్చాత్యులెందరో మన భాషను ప్రశంసించేవరకు స్వభాషపై మనకు విశ్వాసం కలుగలేదు.

ఇతర భాషలనుంచి తెలుగులోకి తర్జుమాలు జరిగినంతగా తెలుగునుంచి ఇతర భాషలలోనికి తర్జుమాలు జరగలేదు. మన సాహిత్య ప్రతిభను ఇతరులకు తెలియజేయడంలో విఫలమయ్యాం.

తెలుగువారికి తమ భాషయెడల మమకారము, అభిమానమేకాని దురహంకారము, దురభిమానము ఉన్నట్లు కానరాదు. తమ సంస్కృతికి ప్రతిబింబంగా, ఒక వాహనంగా మాత్రమే వారు తమ మాతృభాషను పెంచుకొన్నారు. మన్నించుకొన్నారు. చరిత్ర గతిలో వచ్చిన అనేక ప్రభావాలచే తమ భావాలు ప్రభావితమైనట్లే, తమ భాషకూడా క్రొత్త రీతులను సంతరించుకోవడం వారు గ్రహించారు

తెలుగు దేశంమీద, తెలుగు భాషమీద ఇతర పలుకుబడులు పని చెయ్యడం సహజం. భౌగోళికంగా తెలుగునాడు ఉత్తర, దక్షిణాల కూడలిగా ఉంది. అందుచేత ఔత్తరాహమైన భావవాహినికి, భాషా సంప్రదాయానికి తెలుగువారితో ముందుగా సంపర్కం కలగడానికి అవకాశం ఏర్పడ్డది. ద్రావిడభాష అయినప్పటికీ, తెలుగు సంస్కృత నుడికారాన్ని సంపాదించుకున్నది. ప్రధాన రచన సంస్కృతానువాదంగానే ఆరంభమైంది. సంస్కృత భూయిష్ఠంగానే నడిచింది. ఈ సంస్కృత ప్రభావం ఎంతగా ముదిరిందంటే– తెలుగు సంస్కృతంనుంచి పుట్టిన భాష· స్వతంత్ర భాషకాదు, అనే అపవాదు ప్రజ్వరిల్లేంత బలంగా సంస్కృతం తెలుగుతో ముడివడిపోయింది. రాను రాను తెలుగువారికి సంస్కృత పాండిత్యంమీదనే గౌరవం కుదిరి, తమ భాషను చిన్నచూపు చూచుకొనేవరకు ఈ జాడ్యం పెరిగింది.

## "నవ్యత విలసిల్లే భాష"

ఇంగ్లీషు భాషా సాంగత్యం తెలుగు భాషయెడల ఉన్న ఉదాసీనతను తగ్గించలేదు సరికదా పెంచిందికూడా. ఇంగ్లీషుపాలన తూర్పుతీరంలోనే ఆరంభం కావడంతో, ఆ భాష కూడా ముందుగా అక్కడే స్థావరం ఏర్పరచుకొన్నది. పరిపాలకుల భాష కావడం, దాన్ని అభ్యసిస్తే ఉద్యోగాలు దొరకడం ఇంగ్లీషు ఔద్ధత్యం హెచ్చడానికి కారణాలైనాయి. అదిన్నీ కాక ఇంగ్లీషు సాహిత్యం విస్తృతమైంది; వైవిధ్యం కలది; అనేక సాహిత్య ప్రక్రియలతో కూడుకొన్నది. అన్నిటినీ మించి నవ్యతను

వెల్లార్చింది. ప్రగతి సూచకమైన అనేక నూతన భావాలను ప్రచారం చేసింది. అభ్యుదయాన్ని సాధించిన ప్రజల భాష గనుక దానికి ఈ లక్షణాలు ఉండటం సహజం. వీటికితోడు దానికి ప్రపంచ వ్యాప్తత ఉంది. దానితో సంపర్కం కలిగివున్న మనిషికి, విశ్వవ్యాప్తమైన పరిజ్ఞానం సంపాదించుకోవడానికి అవకాశం ఏర్పడింది. తెలుగు దేశంలోని చదువుకొన్న వారినందరినీ ఇంగ్లీషులోని ఈ లక్షణాలు ఆకర్షించినాయి. ఆ కారణంగా తెలుగుదేశం నాలుగు చెరగులా ఇంగ్లీషు బహుళంగా వ్యాపించింది. దానికి 'మరిగి' తెలుగువారు తెలుగును కించపరిచారు.




''మన్నోక పిచి ''

స్వాతంత్ర్యోద్యమం నడవడం, స్వాతంత్ర్యం రావడంతో హిందీకి ప్రముఖ స్థానం వచ్చింది. ఇంగ్లీషు బదులుగా దేశ వ్యాప్తంగా వ్యవహారానికి పనికివచ్చే దేశభాష ఒకటి ఉండాలనే ఆశయంతో హిందీని గౌరవించడం జరిగింది. అయితే, తెలుగుతో పెద్ద పరిచయం లేనివారు సైతము హిందీని అభ్యసించడం మొదలుపెట్టారు. అందులో కొంతమంది పండితులైనారు. దానియెడల వ్యామోహం క్రమంగా పెరిగింది.

వీటి ఫలితంగా అనువాద, అనుకరణ సాహిత్యం తెలుగులో పెద్ద మోతాదులో తయారయింది. ఆంధ్ర మహాభారతంతో ప్రారంభమై పెరిగిన ఈ సాహిత్యం, ఈనాటికీ అనంత ప్రవాహంగా సాగుతూనే ఉంది. ఈ

అనువాదం, అనుకరణ సంస్కృత,ఆంగ్ల, హిందీభాషలకే పరిమితం కాలేదు. వంగ, తమిళ, మరాఠీ,మొదలైన దేశభాషలకు: ఫ్రెంచ్, రష్యన్ మొదలైన విదేశీ భాషలకు కూడా విస్తరించింది.

ఇతర భాషల నుంచి మన భాషకు తర్జుమా చేసుకోవడం మంచి పనికాదని ఎవరూ అనరు. ఆ భాషలలోని విజ్ఞానం, నాగరికత, నవ్యత, ఇంపుసొంపులు మనం కూడా అవగాహన చేసుకోవడానికి, వాటివల్ల మనం ప్రయోజనం పొందడానికి వీలు ఏర్పడుతుంది. ఆ సాహిత్యపు రీతులతో మన సాహిత్య వీధులను కూడా అలంకరించుకోవడానికి అవకాశం దొరుకుతుంది.




"తెలుగు భాషకు అవమానం"

మన సాహిత్య సృష్టి కొంగ్రొత్త సొంపులను సంతరించుకోవడానికి మార్గం ఏర్పడుతుంది, బాగానే ఉంది. కాని దానివల్ల దుష్ఫలితాలు కొన్ని వచ్చినాయి. స్వతంత్ర రచన సన్నగిలింది. స్వంత ఆలోచన మందగించింది. సృజనాత్మకమైన భావుకత, సాహిత్యం పెద్దగా పెరగలేదు. తెలుగువారికి ఆత్మవిశ్వాసం దెబ్బతిన్నది. ఎంతసేపూ ఇతర భాషలనుంచి తెలుగులోకి అనువాదం చెయ్యడమే కాని, తెలుగునుంచి ఇతర భాషలలోకి తర్జుమాచెయ్యడం మృగ్యమైపోయింది. మన భాషనుంచి ఇతరులకు అందించవలసిన విలువైన భావాలు, కావ్యాలు ఉన్నవనే అభిప్రాయం, ఆత్మవిశ్వాసం తెలుగువారికి కుదరలేదు. ఆ కారణంగా తెలుగుభాష,

తెలుగు సాహిత్యం సంగతి మిగతా ప్రపంచానికి తెలియదు సరికదా, భారత భూమిలోనే మిగతా ప్రాంతాలకు కూడా ఏమీ అవగాహన కాని విచారకర పరిస్థితి ఏర్పడ్డది. పరాధీనతతో తెలుగువారం ఈ అవమానకర మైన పరిస్థితిని తెచ్చిపెట్టుకున్నాం.

## "హాల్డేన్ ప్రశంస"

వాస్తవానికి తెలుగు భాషకు కొంత మర్యాదను, గౌరవాన్ని సంపా దించిపెట్టిన వారు పాశ్చాత్యులు. భాషలో పరిశోధన జరిపి, దేశంలో ఉన్న శాసనాలను పరిశోధించి, తెలుగు భాషకు ఒక స్థితిని, చరిత్రను కల్పించారు వారు నిఘంటువులు ఇంగ్లీషు మొదలైన భాషలలోకి తర్జుమాలు, భాషా




శాస్త్రం నిర్మించినది వారే. భవిష్యత్తుకు అభ్యుదయానికి నాందీవచనం పాడి, తెలుగు భాషకు నూతనాధ్యాయాన్ని ఆరంభించినవారు ఇంగ్లీషువారే. దేశానికంతటికీ పనికివచ్చే వ్యవహార భాషగా తెలుగును జె. బి. యస్. హాల్డేన్ ప్రశంసించేవరకు తమ భాషయెడల తెలుగువారికి పూర్తి విశ్వాసం కుదురుకోలేదు. తెలుగుభాష ఇంగ్లీషు వారికృషికి ఎంతైనా ఋణపడి ఉంది.

ఆ పంథనే చాలా ప్రయత్నం జరగవలసి ఉంది. మనం ఇతర భాషలనుంచి తర్జుమాలు చేసుకొన్నట్లు, మన భాషనుంచి ఇతరులు అను వాదం చేసుకొన్నవి ఇంతవరకు చాలా తక్కువ. ఆ లోపానికి ఇతరులను

నిందించడం న్యాయం కాదు. మన భాష, సంస్కృతి, వాటి అందచందాలు వైశిష్ట్యం వారు అవగాహన చేసుకోలేదు. వారి దృష్టిలోకి వాటిని మనం తీసుకువెళ్ళలేదు. ఆ ప్రయత్నమైనా సరిగా జరగలేదు ఇంతవరకు. ఈ సొగసుల రుచి చూచిన తరువాతనే కదా ఈ కోరిక కలిగేది. వారిలో అటువంటి అభిలాషను కలిగించడం తెలుగువారి కర్తవ్యం.

దాన్ని సాధించడానికి ముందుగా మన సాహిత్యంలోని ఆణిపూసలలాంటి రచనలు ఇతర భాషలలోకి, ముఖ్యంగా హిందీ, ఇంగ్లీషు భాషలలోకి తర్జుమా కావాలి. మన భాషలోని ప్రత్యేకతలు, సాహిత్యంలోని విలువలు వివరించే రచనలు ఇతర భాషలలో రావాలి. మన రచయితలను గురించి, మన చరిత్ర, సంస్కృతిని గురించి, మన ప్రముఖులను గురించి




ఇతర భాషలలో వ్రాయాలి. అట్లా వ్రాయగలిగినవారు, వ్రాయనిచ్ఛగించేవారు చాలామంది ఉన్నారు. అయితే అందుకు అనువైన అవకాశం, ప్రోత్సాహం లభించని కారణాన ఈ ఉద్యమం పెద్దగా పుంజుకోలేదు. కేంద్ర ప్రభుత్వం, కేంద్ర సాహిత్య అకాడెమీ ఈ కృషిలో సహకరిస్తున్నవి. అయితే ఆంధ్ర సంస్కృతికి భారత విజ్ఞానరంగంలో సముచితమైన స్థానము, గుర్తింపు రావడానికి బృహత్తర ప్రయత్నం కొనసాగవలసి ఉంది. అందుకు ప్రధానంగా తెలుగు ప్రజలు, వారి రాష్ట్ర ప్రభుత్వం, వారి సంస్థలే సంకల్పించాలి.

ఒకరి సంస్కృతిని మరొకరు అవగాహన చేసుకొన్ననాడు పరస్పర గౌరవం ఏర్పడుతుంది. సుహృద్భావం నెలకొంటుంది. దేశ సమైక్యతకు పటుగడకు పుష్టిని ప్రసాదిస్తుంది.

"భాష జిగి బిగి సడలని అనువాదాలు"

సంస్కృతి ప్రసారం ఈ రీతిలో జరగడానికి కేవలం అనువాదం బాగా ఉంటే చాలదు. మూలం మంచిదై ఉండాలి. అది సృజనాత్మకంగా ఉండాలి. లేకపోతే అనువాదాలు చదువుకొనేవారికి తెలుగు భాష పట్ల అలసభావం ఏర్పడుతుంది. ఆ తరువాత అభిరుచి తరిగిపోయే ప్రమాదం ఉంది అందుచేత అనువదింపబడే రచనలు జాగ్రత్తగా ఎంపిక చేయడం



అవసరం. కేవలం ఏ ప్రముఖ రచయిత వ్రాసినదో అని దానిని తర్జుమా చెయ్యడం కూడని పని. రచనలోని శక్తినిబట్టి మాత్రమే అనువాదానికి దాని వరణం జరగాలి.

అందుకు సృజనాత్మకమైన సాహిత్యసృష్టి తెలుగులో ఉండడం అవసరం. దాని అవసరం కేవలం అనువాదానికి మాత్రమే పరిమితమై లేదు. తెలుగు ప్రజలలో క్రొత్తతేజస్సు ప్రజ్వరిల్లాలంటే, ప్రతిభావ్యుత్పత్తులతో కూడిన రచన పుట్టుకురావాలి

తెలుగుభాష అధ్యయనానికి మన విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను, సంస్థలలోను ఇతర భాషల వారికి కొన్నిస్థానాలు కేటాయిస్తే ఈ ప్రయత్నంలో కొంత ఉపకరిస్తుంది ......... .

విజ్ఞాన వీచికలు దేశమంతటా స్వేచ్ఛగా వీచే మ హావకాశాన్ని మనం కల్పించుకోవాలి. అందుకు భాషను ఒక సాధనంగా వాడుకోవాలి గాని అడ్డంకుగా, అంతరాయంగా మార్చుకోకూడదు. అందుకు వి జ్ఞతతోకూడిన ప్రయత్నం అవసరం.

(ఆగస్టు 1971)

# సాంస్కృతిక పునరుజ్జీవనం

దురాచారాల చక్రబంధం నుంచి సామాన్య జనులు విముక్తులైనపుడే ప్రజలకు నిజమైన స్వేచ్ఛ లభిస్తుందని విశ్వసించి దేశస్థాయిలో యం. యన్. రాయ్, రాష్ట్రస్థాయిలో వీరేశలింగం వంటి ఎందరో సంఘ సంస్కర్తలు వికాసోద్యమాన్ని తలపెట్టారు.

మేధావులు ప్రజలలో రగిలిన ఈ చైతన్యానికి మరింత మేల్కొలుపు కలిగించి, సంస్కృతికి పునరుజ్జీవనం కలిగించాలి.

మన దేశ ప్రజలకు అభ్యుదయాన్ని సాధించడానికి ప్రయత్నం రాజకీయ స్వాతంత్ర్య సమరంతోనే ప్రారంభం కాలేదు. మొగలాయీ సామ్రాజ్యం అంతరించి, బ్రిటిషు పాలన ఆరంభమైనపుడు దేశం దాదాపు నిద్రావస్థలో వున్నది. ప్రజలలో చైతన్యం, నిర్భయము, ఆత్మ శక్తి సన్నగిల్లి జాతి యావత్తు నిస్తేజంగా వుండిపోయింది. అయితే పాశ్చాత్యదేశాల సంపర్కంతో ఆ సంస్కృతితో కొంత పరిచయమేర్పడింది. ఆ పరిచయం మన దేశానికి వలస విధానాన్ని, తెచ్చిపెట్టినా, కొంత మేలుకొలుపును కూడా కలిగించింది. పాశ్చాత్య దేశాలలో అప్పటికే విజృంభించిన స్వేచ్ఛా వాయువులు, స్వేచ్ఛాభావన భారత భూమిలో కూడా ప్రసరించడం ఆరంభించినాయి. శ్రీమంతులైన భారతీయులు, ఇంగ్లండు మొదలైన దేశాలకు చదువులకు, రాజకార్యాలకు వెళ్ళడం మొదలు పెట్టారు. ఇలా కలిగిన సంపర్కంలో భారత ప్రజలలో క్రొత్త ఆలోచనలు, క్రొంగ్రొత్త ఆశయాలు పుట్టుకువచ్చాయి. అవి ప్రధానంగా మేధావుల మేధస్సులో జనించినవే. దానితో ఒక కదలిక, ఒక చైతన్యం ఒక వికాసం, మేధావుల వర్గంలో మెల్ల మెల్లగా కలగ సాగినాయి. ఈ వికాసానికి వైతాళికంగా ఆలోచించిన ప్రముఖుడు రాజారామమోహన్ రాయ్. భారత ప్రజలు నిర్వీర్యులు కావడం ఆయన చూశాడు తరతరాలనుంచి పీడిస్తున్న దురాచారాలకు వారు బానిసలై, బందీలై బ్రతకడం చూశాడు. నిరక్షరాస్యులై కుమిలిపోవడం చూశాడు. ఏది చెయ్యడానికి సాహసించలేక పిరికివారై పోయిన సంగతి గమనించాడు. ప్రజలలో మానసిక స్వేచ్ఛ ఉంటేతప్ప వారికి పురోగమనం, ప్రగతిలేదు, అని రాయ్ గుర్తించాడు. అట్టి స్వేచ్ఛ, భయంనుంచి దురాచారాల చక్రబంధం నుంచి సామాన్య జనులు విముక్తులైనపుడే సాధ్యమవుతుందని ఆయన గ్రహించాడు. ఆ గ్రహింపు నుంచి ఉద్భవించినదే నేటి భారతీయ వికాసోద్యమం.

### "పునర్ వికాసోద్యమం"

రాజారామమోహన్ రాయ్ మేధా సంపన్నుడు. విశాలహృదయుడు. ఆయన ఆరంభించిన ఉద్యమంలో ఆనాటి మేధావులు ఎందరెందరో భాగ

స్వాములైనారు. ప్రజలను పీడిస్తున్న అనేక సంప్రదాయాలమీద దాడి ప్రారంభమైంది. ప్రజలలో చదువు సంధ్యలు పెరగాలని, ఆలోచన, విచక్షణ వికసించాలని, ఆ పెద్దలు కృషిచేయడం ప్రారంభించారు. వార్తా పత్రికలు, అనేక రకాలైన రచనలు, గోష్ఠులు, ఉపన్యాసాలు, శరపరంపరలుగా పుట్టినవి. వాటికి వ్యవస్థారూపం కల్పించడానికి ప్రయత్నాలు జరిగాయి. వికాసోద్యమం బలం పుంజుకున్నది. ఈ ఉద్యమం రాజకీయ స్వాతంత్ర్యాన్ని అభిలషించలేదు. ఆర్థిక సమానతను ఆశయంగా స్వీకరించలేదు. సమాజంలో వున్న చెడును కడిగివెయ్యడానికి, తనకు సబబుగా తోచిన రీతిలో మనిషి ప్రవర్తించడానికి అవకాశాన్ని కలిగించింది. విద్య యెడల ప్రజలలో మక్కువ ఎక్కువైంది.




దీని ప్రభావం దేశమంతటా ప్రబలింది. ప్రజలలో కదలిక ప్రారంభమైంది. ఈ చైతన్యం వుండి వుండక పోతే 1857 నాటికి తిరుగుబాటు వుండేది కాదు. 1885లో భారతీయ కాంగ్రెస్ ఏర్పడి వుండేది కాదు. దూర దేశాలలో సైతం భారతదేశ పరిస్థితిని బాహాటంగా, నిర్భయంగా చాటగల వివేకానందులవంటి ప్రముఖులు వచ్చి వుండేవారు కారు. వివేకానందుల అద్వైతానికి మానవ వ్యక్తిత్వపు విలువలు జోడించి ప్రవచించారంటే ఈ వికాసోద్యమపు ప్రభావమే.

## "వీరేశలింగం శక్తి"

తెలుగు దేశంలో ఈ ఉద్యమానికి పునాదులు వేసినవాడు కందుకూరి వీరేశలింగంగారు. యాభై ఏండ్ల పాటు సంఘ దురాచారాల మీద నిరంతర పోరాటాన్ని నిర్వహించినవాడు ఈ మహా పురుషుడు. ఈ మహోద్యమంలో గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తిగారు, ఆ పిమ్మట త్రిపురనేని రామస్వామిగారు భాగస్వాములైనారు. భాషలో, భావాల్లో విప్లవాన్ని తెచ్చిపెట్టినవారు ఈ వీరులు.

ప్రజలలో రగిలిన ఈ జ్వాలనుంచి రేగిన ఈ చైతన్యం నుంచి రాజకీయ స్వాతంత్ర్య పిపాస పుట్టుకు వచ్చింది. స్వేచ్ఛను కోరే మానవ




హృదయం రాజకీయ బానిసత్వాన్ని భరిస్తుందా? సహిస్తుందా? గోఖలే, తిలక్ మహాశయులు పొంగించిన స్వాతంత్ర్య పిపాసను, గాంధీ మహాత్ములు ప్రజాస్వామ్యానికి పాకించారు. వారి నాయకత్వం క్రింద స్వాతంత్ర్యోద్యమం ప్రజా ఉద్యమమైంది. దీని కంతకు మూలకందము, ప్రాతిపదిక అంతకుముందు సాగిన వికాసోద్యమమే.

రాజకీయ స్వాతంత్ర్యోద్యమం జరిగి 31 ఏండ్లు గడిచింది. అప్పటికే పెరిగివున్న నూతన జీవితాన్ని సృష్టించుకోవాలన్న ఆకాంక్ష ఆనాటి నుంచి విజృంభించింది. అది సహజం. పరాయి పాలన పోవడం ఇతరుల క్రింద బానిసలుగా బ్రతికే దౌర్భాగ్యం తొలగిపోవడం, జాతి తన బ్రతుకు

తెరువును తానే నిర్మించుకోవడానికి ఒక మార్గం, ఒక సాధనం మాత్రమే. తమ ప్రభుత్వాన్ని తమ జీవిత సరళిని తామే తీర్చిదిద్దుకొనే అవకాశం, అధికారం ప్రజలకు లభించింది. భారత ప్రజల ఆశలను, ఆశయాలను ప్రతిబింబించే మౌలిక చట్టాన్ని- అనగా రాజ్యాంగాన్ని - రాజ్యాంగ పరిషత్తు నిర్మించింది. దాని ద్వారా ప్రజాస్వామ్యానికి గట్టిపునాదులు, రూప కల్పన ఏర్పడినవి

## "వ్యక్తి స్వాతంత్ర్యం"

అయితే ఎవరూ మరిచిపోరానిదీ, అందరూ అన్ని వేళలా అప్ర మత్తులై వుండవలసిందీ ఒక విషయం వుంది. ఎటువంటి వ్యవస్థగాని, దాని సక్రమ నిర్వహణ ప్రజల విజ్ఞత మీద ఆధారపడి వుంటుంది. ప్రజలలో విజ్ఞానం, వివేకం, విచక్షణ లేకపోతే, ఎంతటి ఆదర్శప్రాయమైన ప్రజా స్వామ్యాన్నైనా చిందర వందర చేయవచ్చును. అంతకు మించి ప్రజా స్వామ్యపు ప్రయోజనాలు ప్రజలకు అందకుండా చేయవచ్చును. స్వేచ్ఛా యుతమైన సమాజంలో రెండు ముఖ్య లక్షణాలు వుండాలి. అవి వ్యక్తి స్వాతంత్ర్యము, ప్రతి మనిషి సుఖజీవనానికి కావలసిన వనరులు ఏర్పడి ఉండడమూను. ఒకటి లేనిదే రెండవది సాధ్యంకాదు. ఈ విషయమై కొంత మందిలో కొన్ని భ్రమలు ఉన్నాయి. వ్యక్తి స్వాతంత్ర్యం, ఆర్థిక సౌలభ్య సాధనకు అడ్డంకి అనే అపోహ కొంత ప్రబలి వున్నది. వ్యక్తిగా మనలేని మనిషి ఆర్థిక సౌలభ్యాన్ని కోరనూ లేడు. సాధించనూ లేడు. ఈ రెంటి అవసరాల పరస్పర సంబంధాన్ని ప్రజలకు వివరించే బాధ్యత నేడు మేధావుల మీద మెండుగా వున్నది.

## "ద్వితీయ శ్రేణి పౌరులుగా"

స్వయం పరిపాలనాధికారం మనకు వచ్చి మూడు దశాబ్దాలు గడచినా సామాన్య ప్రజల కడగండ్లు సమసి పోలేదు. సరికదా తగ్గలేదు

కూడా. బహు జనులు ద్వితీయ శ్రేణి పౌరులుగా దిగజారి వున్నారు. స్వతంత్ర భారతంలో కూడా ఈ విచారకరమైన పరిస్థితి సాగుతూ వుండడం శోచనీయం.

విజ్ఞులైన వారు ఇందుకు నిజమైన కారణాలను వెతకాలి. వాటిని నిర్ధారించాలి.

అడగందే అమ్మైనా పెట్టదనే నానుడి తెలుగు వారందరికీ తెలుసు. అందులో గొప్ప సత్యం వున్నది. తమకు కొత్త అవకాశాలు




వుండాలి అర్హతలు వుండాలి, హక్కులు వుండాలి. అవి కోరగల శక్తి ప్రజలలో పెరగనిదే, వారి జీవిత వికాసం సాధ్యం కాదు. కొత్తజీవితాన్ని ఊహించుకొని, దాన్ని నిర్మించుకొనే శక్తి ప్రజా సామాన్యానికి కలగాలి.

అయితే వాటికి ఎన్ని అడ్డంకులు, ఎన్ని అవరోధాలు. తరతరాల నుంచి ప్రజలు మతమనీ, కులమనీ, ప్రాంతీయ తత్వమనీ, భాష అన్న వాటి పేర్లతో తమ మధ్య తామే కంచుకోటలు కట్టుకొన్నారు. చదువు లేక, అజ్ఞానం ముదిరి అనేక మూఢ నమ్మకాలకు బద్ధులై పాతజీవితంలో నుంచి బయట పడలేకుండా వున్నారు. ఈ ప్రలోభాల బందిఖానా నుంచి తమను తాము విముక్తి చేసుకుంటే తప్ప ప్రజలకు విముక్తి లేదు.

## "సాంస్కృతిక పునరుజ్జీవనం"

రాజారామమోహన్‌రాయ్ నుంచి సాగిన వికాసోద్యమ ఫలితంగా ప్రజలలో కొంత చైతన్యం వుంది. కాని శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానాన్ని సంతరించుకొని, తమ సమాజాన్ని నవ సమాజంగా పరిణతిని పొందించు కునే విజ్ఞానం ప్రజలలో బాగా పెరగలేదు.

ఇందుకు వారిలో సాంస్కృతిక పునరుజ్జీవనం కావాలి. యుగాల తరబడి తమను పీడించి, భరిస్తున్న వ్యవస్థను పునఃపరిశీలించుకునే




వివేకం వారిలో అభివృద్ధిచెందాలి. పాత అంతా మంచి కొత్త అంతా చెడు, అంతా కొత్తే కావాలి అనే భ్రమ కాని మనుషులను బాధించకూడదు. మతం పేరుతో, కులం పేరుతో ఆర్థిక వ్యవస్థ పేరుతో తమ వ్యక్తిత్వాన్ని కించపరుస్తున్న శక్తులన్నిటినీ అవతలకు నెట్టే వివేకం ప్రజలలో పెరగాలి. ఆ పని చేసేందుకు ప్రజలలో విద్య, విజ్ఞత పెంపొందాలి.

దేశానికి మూలాధారమైన ప్రజలలో ఇట్టి భావ చైతన్యం లేకపోతే కొన్ని రాజ్యాంగాలు నిర్మించినా, ఎన్ని వాగ్దానాలు చేసినా, ఎన్ని ప్రభుత్వాలు వచ్చినా ఒకటే. మార్పు మానవ సహజమనే సత్యాన్ని మనం ఎన్నడూ మరువరాదు. ఆ మార్పు ప్రగతి పథంలో వుండాలంటే ప్రజలలో

శాస్త్రీయ దృక్పథం, తమకు తాముగా ఆలోచించుకోగల వివేకం అవసరం. మానవ జీవిత విధానమే సంస్కృతి. ఆ సంస్కృతికి పునరుజ్జీవనం కలిగించాలంటే అందుకు ప్రజలే పూనుకోవాలి. ప్రజలలోనే నవచైతన్యం పుట్టుకు రావాలి. ఆ చైతన్యాన్ని మేల్కొల్పగల అవకాశం మేధావులకు వున్నది. ఆ పాత్రను, ఆ విధ్యుక్త ధర్మాన్ని భారత మేధావులు నిండుమనస్సుతో చేయగలరని కోరుకుందాం. వారు వెలిగించే ఈ జ్యోతి, అఖండ జ్యోతిగా పెరిగి భారత ప్రజల పునరుజ్జీవనానికి దారి చూపిస్తుందని ఆశిద్దాం

(మార్చి 1978)

# తెలుగుదనానికి తెగులు

ఒకనాడు తెల్లవాడి బానిసత్వంలో మ్రగ్గిన మనం నేడు ఉత్తరాది వాడి బానిస శృంఖలాలలో చిక్కుతున్నాము.

తెలుగు తనాన్ని విస్మరిస్తూ, తీపి తెలుగును చేదుగా చూస్తూ, పరాయిభాష, కిరాయి పాటపై మనం మోజు చూపుతున్నాము.

ఇన్నాళ్ళూ ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళని పరిహాసం చేసేవాళ్ళం. భావదాసులనీ, ఆంగ్ల మానస పుత్రులనీ తెల్లవాడి అడుగు జాడలు తప్ప మరో బాటను ఎరుగని వారనీ, అయితే ఇంత కాలానికి తెల్లవాడి బావుటా క్రిందకు దిగి, మన స్వంత "హయామీ" వస్తున్నదనే సరికల్లా జాతీయత పేరుతో మరల తిరిగి మనం, భావదాసులం కావడానికి ఆయత్తమవు తున్నాం. కాని ఈ సారి, సిసలైన దేశవాళీ సరుకు తయారవుతున్నది. హిందీ మానస పుత్రులమవుతున్నాం

ఆర్థిక, రాజకీయ విషయాలు అలా వుంచుతాం. వాటిలో మన కెక్కడా తావు లేదు. ఇటువంటి ముఖ్య విషయాలన్నిటిలోను ఉత్తర హిందూస్థానీవాడిదే ఎదురులేని పెత్తనం. అతగాడు ఆడింది ఆట, పాడింది పాట.

"మనది కాని"

ఆఖరుకు నిత్య జీవితంలో కూడా మామూలు వేష భాషల్లోనే తెనుగుబాణీ మనకు సుతరామూ నచ్చడం లేదు. ఉత్తరాది మతాన్నే తలచుకొంటున్నాము. మన్నన చేస్తున్నాము. ఘనమైనదనుకుంటున్నాము. మామూలు వేషం—ఏ ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నా పెళ్ళికో, శోభ నానికో కుట్టించుకున్న ఫావెల్ సూటు తగిలించుకొని శీతాకాలం, ఎండా కాలం అన్న వ్యత్యాసాలతో నిమిత్తం లేకుండా మనవాళ్ళు ఉద్యోగ ప్రయత్నానికి ఆయత్తమవుతూ ఉండేవాళ్ళు. ఇప్పుడు ఆట్టి రుచి మారి పోయింది. బిళ్ళగోచీ బిగించడం, మోకాళ్ళను దాటి జుబ్బా బనాయించడం, దానిమీద ఉన్నిదో ఖద్దరుదో ఒక జవహర్ జాకెట్ వేసుకోవడం, నెత్తికో గాంధీ టోపీ తగిలించడం, వీటినన్నిటినీ మించి చేతికో సంచి, ఈ వేషంతో ఎక్కడకు వెళ్ళినా, అపూర్వమైన గౌరవం జరుగుతుంది. చూసే వాళ్ళంతా ఆఖరుకు ఈయన ఒక శాసన సభ్యుడైనా కాకపోతాడా అను కుంటారు. అయితే ఈ మర్యాదని నిలబెట్టుకోవాలి అంటే, ఎంత రోహిణీ కార్తె అయినాసరే, ఎంత ఉక్కతో తబ్బిబ్బులవుతున్నా సరే, చెమట

ధారలు కడుతున్నా సరే, ఈ జవహర్ జాకెట్టు విప్పకూడదు. గాంధీ టోపి తీయకూడదు. ఈ వేషంలో వెళుతూ చూసేవాళ్ళు వీరెవరో ఉత్తర హిందూస్థానీయులలాగున్నారని భావించి క్యా భాయి అని వాళ్ళచేత పలకరించుకోవడం, మనము తెలుగువాళ్ళు కాననిపించుకోవడం, మనకు ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. అటు ఆంగ్లమహాయుగంలో, ఇటు ఈ క్రొత్త శకంలో కూడా తెలుగు కట్టుకు, తెలుగు భాషకు మాత్రం ఆదరణ లేదు. ఇప్పటిదాకా ఈ మౌఢ్యం ఆడవారిలో తక్కువ. ఇప్పుడిప్పుడు కొంతమంది అమ్మాయిలు-ముందు సినిమా తారల అనుకరణతో ప్రారంభమయింది. - పంజాబీవేషం పై మక్కువ పడుతున్నారు.

"పరభాషా వ్యామోహం"




భాషా విషయంలో ఈ మార్పు మరింత స్పష్టంగా గోచరిస్తుంది. ఆంగ్లాన్ని అధ్యయనం చేసినవాళ్ళు సర్వసాధారణంగా తెలుగులో మాట్లాడరు, మాట్లాడలేరు కూడాను. ఉపన్యాస చర్యలు కాదు సుమండీ, మామూలు సంభాషణలలో కూడా అంతే. ఒకవేళ మన ఖర్మం చాలక తెలుగులో మొదలుపెట్టినా, అందులో వుద్దేశాలు వెల్లడించలేక తికమక పడి, చిట్టచివరకు, తమను, భాషను కూడా నానాగందరగోళం చేసుకుంటారు. ఉత్తరప్రత్యుత్తరాలన్నారా - ఈ స్వాములు తెలుగులో కూడా ఉత్తరాలు వ్రాయబోతే మై డియర్ గ్రాండ్ మదర్ అన్నమాటలు ఈ పాడుభాషలో ఎలా వ్రాయాలో తెలియక మై డియర్ ముత్తవ తల్లీ అనేదాకా వస్తుంది.

హిందీ విద్యార్థికులూ క్షమించండి. హిందూస్థానీ విద్యార్థికులని అనాలి కాబోలు— ఇంతకంటే నాలుగాకులు ఎక్కువే చదివారు. నమస్తే అని తప్ప వీరు పీక తెగినా నమస్కారం అనరు. హిందీ భాషావేత్తలు ఒకరికొకరు తెలుగులో ఉత్తరాలు వ్రాసుకోవడం మీరెప్పుడైనా చూశారా? అఖరుకు ఆ వింత ఎన్నడైనా విననైనా విన్నారా? దబడబ లాడించే మిలిటరీ భాష హిందూస్థానీ ఉండగా ఉత్త తెలుగులో ఉత్తరాలు వ్రాసుకోవడం వీరికి చాలా అప్రశస్తంగా కనిపిస్తుంది.

అసలు వీరికి ఆలోచనలు, కోరికలు కూడా హిందూస్థానీలోనే రావడం మొదలెట్టాయిట. క్రొత్త బిచ్చగాడు పొద్దెరగడని, ఈ నూతన హిందూస్థానీ వాదులకు, ఎప్పుడైనా గోంగూర పచ్చడి తినాలని కోరిక పుడితే. గోంగూరకు హిందూస్థానీలో సరైన పదం లేదుగనక, గోంగూర పచ్చడినే మానుకుంటున్నారట.

"పోతన రామాయణమా!?"




సాహిత్యంలోకి వెళ్ళండి. ఆంగ్లం అభ్యసించిన వాళ్ళకు, ఆ భాషలోని లగువు, బిగువులు తప్పితే తెలుగు భాషలోని సొకడలు సుతరామూ తెలియవని భావించేవాళ్ళము. షేక్స్పియర్ పుట్టిన ఇంటికి ఎన్ని దూలాలో వారు చెప్పగలుగుదురుగాని, భారతం తెనిగించిన మహాకవుల పేర్లు వీరికి తెలియనే తెలియదు. ఈ విషయంలో హిందూస్థానీ భాయి ఔర్ బహెన్ సంగతి మరీ గందరగోళంగా ఉన్నది. తులసీదాసు రామాయణం కొంత

తదుపరి కొంత వల్లె వేయమంటే వీరు టకటక లాడించేస్తారు. వారిని తెలుగుమాటగా పోతన్నగారి సంగతి ఏమిటని అడిగాం అనుకోండి. పోతన్న సినిమా ఎవరి బలవంతంతోనో చూసి ఉంటారు. పోతన్ననే ఎరుగమా! రామాయణం వ్రాసి పోయినాడు కదా! అని టపీమని సమాధానం చెబుతారు. హిందీ సాహిత్యంలో ఈనాడు ఈ గడియవరకు వచ్చిన వన్నెచిన్నెలన్నీ చిత్రించమంటే చిత్రిస్తారుగాని, వీరి తెలుగు సాహిత్య పరిచయం ఓనమాలతో ఆగిపోయి వుంటుంది. హిందీ రచయితల గురించి గడగడ మాట్లాడేవార్ని, ఈనాటి తెలుగు రచయితల గురించి అడగండి. ఓ కౌన్ హై అని నిర్మొహమాటంగా సమాధానమిస్తారు. ఆ తెలియకపోవడంకూడా ఓ ఘనమైన విషయమని వీరి అభిప్రాయం.




పూర్వకాలంలో కొందరు సంస్కృత పండితులు, ఆ తదుపరి మరికొందరు ఇంగ్లీషు ప్రొఫెసర్లు తెలుగును ఎంత ఏవగింపుతో చూశారో ఈ హిందూస్థాన్ జాతీయవాదులుకూడా తెలుగును అంత హీనంగా చూస్తున్నారు. ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళకు కొంతవరకన్నా కారణం కనిపిస్తుంది. అయిదో ఏట నుంచి, ఇరవై అయిదో ఏటవరకు ఇంగ్లీషు రుబ్బి రుబ్బి వీరికి ఆ భాష తప్ప యింకోటి కనిపించదు. హిందీవారికి ఈ నెపం వర్తించదు. హిందీ ప్రచారసభ ఇప్పుడు హిందూస్థానీ ప్రచారసభ అయిపోయింది. ఆ సభ పరీక్షలన్నిటినీ కలిపి మహా అయితే రెండు సంవత్సరాలలో పూర్తి చేయవచ్చును. ఈ రవ్వంత తెలుగు మీద వీరికింత

ముభావం పుట్టవలసిన అగత్యం లేదు. దీనికి ఒకే కారణం కనిపిస్తుంది. జాతీయత పేరుతో మన కళ్ళకు కట్టిన పొరలు.

లోగడ మన ఆడపడుచులకు పెండ్లి యీడు వచ్చిందనేసరికల్లా సంగీతప్పెట్టె ఒకటి కొని సంగీతం పేరుతో దాన్ని వాయించడం నేర్పే వాళ్ళం.

పెండ్లి చూపులకు మొగపెళ్ళివారు వచ్చేటప్పటికి, ఆ సంగీతప్పెట్టె బూజు దులిపించి, వారికంటికది తగిలేటట్లు సరిగమలతో తంటాలుపడుతుండే వాళ్ళము. ఇప్పుడో అది పోయింది. సంగీతప్పెట్టె మూలబడింది.




అమ్మాయి పెండ్లి ఈడుకు వస్తున్నదనగానే నెలకో పది రూపాయలిచ్చి హిందీ మేష్టర్ని పెడుతున్నాము. ఆయనగారు గారడీ చేసినట్లు మూడు నెలల్లో మన అమ్మాయికి రాష్ట్రభాష పరీక్ష పట్టా తెప్పించేస్తాడు. ఆ పట్టా మామూలు బిరుదనుకుంటున్నారేమో? కాదు కాదు, మన అమ్మాయి వైవాహిక జీవితానికి రాచబాట. మన అమ్మాయి దాంపత్య జీవితానికి ప్రణయ మంత్రం. మనపాలిట కల్పతరువు. ఈ పట్టాసాయంతో అల్లుడి కట్నం విషయంలో ఎంతైనా బేరం చేయవచ్చును. ఈ పట్టాకొరకు మనం పెట్టిన పెట్టుబడికి కలలో కూడా మనం కోరుకోని లాభాలు గిడుతున్నాయి.

లలిత కళల మాటేమిటంటారా? ఆ విషయంలో మనదంతా పక్కు హిందూస్థానీ బాణీయే. ఆ మాటకొస్తే తెలుగునాడులో లలిత కళలన్నీ సినిమా మీదనే ఆధారపడివున్నాయి. పూర్వకాలంలో వీటిని రాజాధిరాజులు పోషించినట్లుగా ఈనాడు సినిమా షావుకార్లు పోషిస్తున్నారు. ఈ మాట కాదంటారా – సినిమాలో పాట, సినిమాలో ఆట, సినిమాలో బొమ్మ తెలుగు దేశంలో ఏమాత్రం ఉన్నదంటారు? అయితే ఈ సినిమా ఎట్లా వున్నది. సైగల్‌ను అనుకరిస్తూ పాడితే నచ్చుతుంది. కాని మన నాగయ్య మనకు నచ్చడు. హిందూస్థానీ మాట్లు వినిరితేగాని కన్నాంబ గాయకురాలు కాదు. హుషారు పుట్టినప్పుడల్లా చకచకరే నవ్‌జవాన్ అని గంతులు వేస్తున్నాము. దిగులుగా వున్నప్పుడల్లా సోజా రాజకుమారి అని కంఠ మెత్తి ఏడుస్తున్నాము. ఏ హిందీ చిత్రం వచ్చినా తెలుగు హాల్లోనైనా ఆఖరుకు ఆదివారమైనా ఆడుతుంది. వాటిని తెలుగుజనం కుప్ప తెప్పలుగా చూస్తున్నారు. మన తెలుగు చిత్రాలలో కూడా ఆటా, పాటా అట్లాగే ఉండాలని కోరుకుంటున్నాము. అట్లా ఉండకపోతే చూడమని మొది, మొదితోపాటు మనీపర్సు బిగించుకుంటున్నాం. ఇది చూసి మన సినిమా షావుకార్లు హిందీ చిత్రాలకు నకళ్ళు తయారుచేస్తున్నారు.

ఇందాకటి నుంచి వేష–భాషలనీ, లలిత కచేరీలనీ వాపోతున్నాము. అంతదాకా ఎందుకు–చివరకు తినేతిండి సంగతి చూడండి. మన శరీరానికి పడినా, పడకపోయినా రొట్టె తింటానికి తంటాలుపడుతున్నాము. వరి అన్నం పురుగుల తుట్టెలా కనిపిస్తుంది. రొట్టె నాజూకు నాజూకుగా మునివేళ్ళతో గిల్లుకు తినడం ఈనాటి మన నాగరికతలో ఉన్నత స్థాయన్నమాట.

ఈ మాటలన్నీ వింటే, హిందీ చదువుకోవద్దనీ, జవహర్ కోటెట్టు తొడుక్కోవద్దనీ, హిందీ పాట నేర్చుకోవద్దనీ, రొట్టెముక్క తినవద్దనీ చెబుతున్నాననుకుంటారేమో? నేననేది అదికాదు. వీటన్నిటినీ తప్పకుండా

నేర్చుకోండి. మరచిదనుకుంటే రొట్టెముక్క తప్పకుండా తినండి. నేర్చుకోవడంలో గట్టిగా నేర్చుకోండి. తినడంలో గట్టిగా తినండి. కాని అవే జీవితానికి ఆదర్శాలనీ, పరమార్థాలనీ అనుకోవద్దు. మన తెలుగు నుడికారాన్ని మరచిపోవద్దు. స్వంత వ్యక్తిత్వం రాలేని మనం దేశానికి పనికి రాకుండా పోతాము. మనను కూరలో పురుగులా ఏరేస్తారు కనుక తెలుగు వ్యక్తిత్వాన్ని మాపుకోవద్దు.

(ఫిబ్రవరి 1965)

# ఆంధ్రప్రదేశ్‌పై ఎందుకీ శీతకన్ను

దేశభాషలలో లెస్స అనిపించుకున్న తేట తెలుగు వారి రాష్ట్రం పట్ల కేంద్రం తొంటి చెయ్యి చూపిస్తుండడంతో అన్ని రంగాలలో అభివృద్ధి కుంటుపడుతున్నది.

తెలుగువారు తమ మెత్తని స్వభావాన్ని త్యజించి తమలోని చైతన్యశక్తిని వెలికితీసి తెలుగునాట మహోదయానికి కృషి చేయాలి.

క్రోధిని సాగనంపుతూ, 'విశ్వావసు'ను ప్రవేశపెడుతూ ఉగాది వచ్చింది.

సంప్రదాయసిద్ధంగా, ఉగాదితో వసంతోదయం కావలసింది. చెట్లన్నీ చిగిర్చవలసింది. పూలు ఉద్ధృతంగా పూయవలసింది. మానవులకు నాడులలో నూతన తేజము ప్రసరించవలసింది. ప్రకృతి విలాసాన్ని, నవ విన్యాసాలతో మనం చూడవలసింది. అందుకనే, ఈ చిగురాకు జొంపాల శోభను సూచిస్తూ, ఆస్వాదిస్తూ మనం వేప పూలను రుచి చూడడం, జీవితంలోని మధురిమను మననం చేసుకుంటూ, అనుభవిస్తూ అందులో బెల్లాన్ని కలుపుకోవడం.

అయితే రోజులు మారాయి. ఉగాదితో ఇప్పుడు వసంతం అంతమవుతున్నది గాని, ఆరంభం కావడం లేదు. మొదలవుతున్నది గ్రీష్మం. ఎండలతో, వడగాడ్పులతో, జీవకోటిని నిస్సారం చేసే వాతావరణంతో, గ్రీష్మం ప్రవేశిస్తున్నది ఉగాదినాడు.

ఇది తెలుగు వాళ్ళ బ్రతుక్కి సూచనప్రాయంగా వుందేమో అనిపిస్తుంది తెలుగునాట వసంతమే లేని, సదా గ్రీష్మమేనేమో అనిపిస్తుంది. ఈ ఊహ నిరుత్సాహపూరితమే; సందేహం లేదు. కాని సత్య దూరం కాదు. ఆధార రహితం కాదు.

స్వరాజ్యం వచ్చి 18 యేళ్ళు కావస్తున్నది. ఆంధ్రరాష్ట్రం పుట్టుకు వచ్చి 12 ఏళ్ళు కావస్తున్నది విశాలాంధ్ర జన్మించి 8 ఏళ్ళు దాటిందికూడా. ఇంత కాలము రాష్ట్రానికి సుస్థిర ప్రభుత్వం వుంది. అందునా ఒకే పక్షం అధికారంలో ఉంటూ వచ్చింది.

ఆంధ్రప్రదేశ్ సువిశాలమైన దేశం, సారవంతమైన భూమి, సమృద్ధిగా ఉన్న నదీ జలాలు, అనేక ముడి పదార్థాలూ, ఖనిజ సంపదలు, అన్నిటినీ మించి ఆర్ద్ర హృదయంగల ప్రజలు. ఇవన్నీ ఆంధ్రదేశపు

అదృష్టాలు, అవకాశాలు. అవకాశాల సద్వినియోగంలోనే పురోగమనం ఉన్న చరిత్ర వుంది.

అందునా ఆంధ్రభూమి కీలక స్థానంలో వుంది. భారతంలోని ఉత్తర దక్షిణ ప్రాంతాల కూడలి ఆంధ్రదేశం.శం. రెండు భూభాగాలు ఇక్కడ కలుస్తాయి. రెండు సంస్కృతులు ఇక్కడ సమ్మేళన మవుతాయి. ఆంధ్ర దేశానికి సరిహద్దులలో అంటిపెట్టుకున్న రాష్ట్రాలు మరింకే రాష్ట్రానికీ లేవేమో. మద్రాసు, మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్‌ను చుట్టుకుని వున్నవి. తూర్పున సుదీర్ఘమైన సముద్ర




తీరం వున్నది. ఉత్తర దక్షిణాపథాలను కలుపగల, సమన్వయపరచగల అవకాశం ఆంధ్రభూమికే వుంది.

## “తేట తెలుగు కమ్మదనం”

తెలుగువారి పెద్ద అదృష్టాలలో ఒకటి—వారి భాష. తియ్యగా, సరళంగా, హాయిగా వుంటుంది తెలుగు. సంగీత తరంగాలనే పొంగించగలదు దాని శబ్ద మాధుర్యం. దీనికి తోడు, సంగీతం, సంస్కృతం మొదలైన పరభాష మంచిని, తనలో ఇముడ్చుకొని, విందుతనాన్ని సంతరించుకున్నది తెలుగు భాష. దేశంలోని అన్ని భాషలకు అంతో ఇంతో అందుబాటులో వుండి వాటి విశిష్టతలను తనతో లగ్నం చేసుకోగలిగింది తెలుగు భాషే. అందుకనే "దేశభాషలందు తెలుగు లెస్స" అని ఆనాడు శ్రీకృష్ణదేవరాయలు మెచ్చు

కొన్నది. ఈనాడు ఎట్టి పక్షపాతబుద్ధి లేని పాశ్చాత్య శాస్త్రవేత్తలు హోమ్‌ఫీల్డు, మాక్‌లాయిడ్, డాక్టర్ కారే, డాక్టర్ కాంప్‌బెల్, మోరిస్, డాక్టర్ హాల్డేన్ మెచ్చుకున్నది కనుక భాషాదురభిమానం, సంస్కృతీ వైరుధ్యంతో సతమవుతూవున్న భారతావనికి అంగరక్ష కాగల శక్తి ఆంధ్ర దేశానికే వున్నది.

అయితే ఇంతటి ప్రాభవం, కాగితం మీద మాత్రమే కనిపిస్తుంది. ఊహాలోకంలో మెరుస్తుంది. ఇంతవరకు ఇది కలగానే మిగిలిపోయింది.




వాస్తవం దీనికి పూర్తిగా విరుద్ధం. పొరుగు రాష్ట్రాన్ని అభిమానిస్తూ అన్ని రంగాలలో కేంద్రం తొంటి చెయ్యే చూపుతున్నది.

### "ఆంధ్రుల మెతకదనం"

ఈ దురవస్థకు కారకులెవరు? ఇతరులను అని ఏమి ప్రయోజనం? ఆందోళన జరిపితే తప్ప మన వునికిని అంగీకరించని ఈ దినాలలో ఈనాటి మన సత్వంతో తెలుగువారు బ్రతకడం నేర్చుకోవాలి. ఈ మధ్య మద్రాసు రాష్ట్రంలో విజృంభించిన హిందీ వ్యతిరేక వుద్యమాన్ని చూసి జడిసి, హిందీ భాషావేత్తలు కొంతమంది హిందీతో పాటు తమిళాన్ని అధికారభాషగా స్వీకరించండని సూచిస్తున్నారు. హిందీ తరువాత విస్తరణలో, వాడుకలో, రెండవదిగా వున్న తెలుగు భాష వారికి జ్ఞాపకం రాలేదేమిటి? తెలుగువారు జ్ఞాపకం చెయ్యలేదు కనుక.

చూడగా తెలుగు వారి మెత్తని స్వభావమే ఇందుకు కారణమని పిస్తుంది. తెలుగువారు కష్టపడటానికి సిద్ధంకారు. వారికంతా మార్గం సుగమంగా వుండాలి.

సాహిత్యంలో సుగమ సాహిత్యం కావాలి. అందుకనే తెలుగులో నవలలు, నవలికలు, కథలు పిచ్చటిల్లినయ్ శాస్త్ర రచన వెనుకాడు తున్నది. సంగీతంలో సుగమ సంగీతం కావాలి. వాగ్గేయకారులు తెలుగు లోనే సంగీత రచన చేసినా, తెలుగువారికి శాస్త్రీయ సంగీతం ఎక్కువగా పనికి రాదు. అలాగే తమకున్న ముడిసరుకును బయట అమ్ముకొని




సొమ్ము చేసుకుంటారే గాని, వాటితో సామగ్రిని తయారుచెయ్యరు. ఇవన్నీ తెలుగువారు అలవాటుపడ్డ సుఖవు జీవితానికి చిహ్నాలు. వారు పెట్టుకున్న కంపెనీలు, సంస్థలు ఎక్కువగా చితికిపోతుంటాయి. అది క్రమశిక్షణ, కలసికట్టుతనం లేనిదానికి గుర్తు.

అభివృద్ధిని సాధించాలంటే తెలుగువారు సహజంగా తమలో వున్న చైతన్యశక్తిని బయటకు పొంగించాలి. శ్రమపడటం అలవరుచుకోవాలి. కార్యదీక్షను పెంపొందించుకోవాలి.

జరిగిన చరిత్రను బట్టి పాఠాలు నేర్చుకొని, తెలుగువారు, ఈ విశ్వావసు ఉగాది శుభ సందర్భంలో దీక్షాకంకణులై మహోదయానికి కృషి చెయ్యవలసి వుంది.

(ఏప్రిల్ 1965)

# విజ్ఞానశాస్త్రము
# నాగరిక సమాజము

ప్రతి సంస్కృతికి, నాగరికతకు పునాది సమాజం.
సాధించిన శాస్త్రీయ పురోభివృద్ధి ఎక్కడ జరిగిందో
అక్కడ సమాజం ప్రగతిని సాధించింది.
ఎప్పుడు సమాజం మౌఢ్యానికి ఆలవాలమై
శాస్త్రాన్ని విస్మరించిందో అప్పుడది జడత్వానికి
లోనై క్షీణించింది.

అత్యంత వేగంతో ప్రయాణాలు చేస్తూన్న నేడు కూడా సమాజంలో చాలామంది వీటి వెనకవున్న శాస్త్రీయ విజ్ఞానాన్ని గురించి ఆలోచించరు. యాంత్రికంగా వాటి సదుపాయాలు పొందడమేగాని, అవి ఎలా సాధ్యమైన వనే ఆలోచన పోదు అనేకమందికి. ఇవి శాస్త్రం సంతరించిపెట్టిన సౌకర్యాలని లోతుకు దిగి పరిశీలించరు — సరికదా, శాస్త్రం మనిషిని పాడుచేస్తున్నదని కొంతమంది అపోహ కూడాను. అది మనిషి నైజాన్ని చెరుపుతున్నదని వారి భయం. అతని శీలసంపదకు భంగం కలిగిస్తున్నదని సందేహం. ఈ సంకోచాలకు కారణాలు — శాస్త్రం సంపాదించిపెట్టిన జీవిత సౌలభ్యాన్ని ఒక చెంప పొందుతూనే, దానికి ఆధారభూతమైన శాస్త్రీయ దృక్పథాన్ని అవగాహన చేసుకోకపోవడం; అలవరచుకోక పోవడం; 'పాత' ను గురించిన అభిమానం; క్రొత్త యెడల భయం; ఆలోచించడానికి వెరపు.

## "మానవుని ముందడుగు"

మానవునికి ఊహాపోహాలు వచ్చిన నాటినుంచి తన జీవితాన్ని సుగమం చేసుకోవడానికి యత్నిస్తూనే వున్నాడు. సాధ్యమైనంత వరకు అలా చేసుకుంటూనే వున్నాడు. చేతిలోని కత్తి, దున్నడానికి నాగలి, బరువులు మోయడానికి బండి, ఇవన్నీ ఎట్లా పుట్టుకు వచ్చినట్లు? తన పని సుకరం చేసుకోవడానికి, తన భారాన్ని తగ్గించుకోవడానికి మనిషి కని పెట్టిన పనిముట్లే కదా ఇవన్నీ! పరికరాలను సృష్టించుకోవడం, వాటితో తన పని బరువు తగ్గించుకోవడం, తన జీవనసరళిని సులభం చేసుకోవడం, మానవుని సహజ గుణం. తాను నిర్మించుకున్న పరికరాలతోనే మానవుడు ఎదుగుతున్నాడు. అతని జీవనస్థాయి పెరుగుతున్నది. మానవ పరిణామం ప్రగతి, శాస్త్రవిజ్ఞానంతో పెనవేసుకుపోయిన వాటి మధ్య అవినాభావ సంబంధం కుదిరి వుంది. ఆ విజ్ఞానం లేకుండా మానవ సంస్కృతి ముందుకు సాగడం కష్టం. కష్టమేకాదు దుర్లభం.

చరిత్రను పరికిస్తే ఈ సత్యం అవగతమవుతుంది. ప్రతి సంస్కృతికి, నాగరికతకు పునాది ఆ సమాజం సాధించిన శాస్త్రీయ పురోభివృద్ధే, మరొకటి కాదు. ఎక్కడ ఆ పురోభివృద్ధి జరిగిందో, అక్కడే సమాజం ప్రగతిని సాధించింది. ఎప్పుడు సమాజం మౌఢ్యానికి ఆలవాలమై శాస్త్రాన్ని విస్మరించిందో, అప్పుడది జడత్వానికి లోనై క్షీణించింది. మానవ చరిత్ర ఈ సూత్రాన్ని రుజువు చేస్తున్నది.

శాస్త్రం, విజ్ఞానం, మనిషి చుట్టూ ఉన్న పరిస్థితులను సమూలంగా మార్చగలవు. వాటి ప్రయోజనాలను ఎంత త్వరగా తమ జీవితాలకు మలుచుకుంటే, అన్వయించుకుంటే, అంత త్వరగా మానవులకు అభ్యు




దయం సాధ్యమవుతుంది. కాక, అట్టి విజ్ఞానాన్ని కాదనడం, త్రోసి పుచ్చడం మానవ నైజాన్నే విస్మరించడమవుతుంది; అతని సహజ లక్షణాన్ని తిరస్కరించడమవుతుంది

## “శాస్త్రీయ దృక్పథం”

శాస్త్రానికి, సంఘానికి మధ్యవున్న సంబంధాన్ని రెండు కోణాల నుంచి పరిశీలించవలసి ఉంటుంది. అందులో మొదటిది, ముఖ్యమైనది శాస్త్రీయ దృక్పథం. తాను సంతరించుకున్న పరిజ్ఞానాన్ని మనిషి తన జీవితానికి ఉపయోగించుకోవాలంటే శాస్త్రము, శాస్త్రీయ దృక్పథం ఒక్కటే మార్గం. ఈనాటి జీవితం తనను వేధిస్తున్నదని తెలిసివుండీ, దానినే పట్టు

కుని వేళ్ళాడటం మనిషికి భావ్యం కాదు. తనను ఆవరించివున్న వాతా వరణం, సమాజ పరిస్థితి బాధాకరంగా, జుగుప్సాకరంగా వున్నంత వరకు వాటిని మార్చడం మానవుని కర్తవ్యం. తనకు, తోటివారికి బాధకలిగిస్తున్న అలవాట్లు, ఆచారాలు, నమ్మకాలు, సంప్రదాయాలు — మౌలికంగా పరీక్షించే దృష్టి అవసరం. వాటి సబబును పరిశీలించే శక్తి, అవి సబబుగా లేనప్పుడు వాటిని త్రోసివుచ్చగల ధైర్యం, ప్రగతిశీలుడైన ప్రతిమాన వునికీ కావాలి. ఆ పరిశీలనా శక్తి, పనికిరాని వాటిని విసర్జించగల ధైర్యం ఒక్క శాస్త్రమే, దాని ఆలోచనా విధానమే సంపాదించిపెట్టగలవు. ఆ దృష్టి లేకపోతే క్రొత్తగా ఆలోచించే అవకాశమే లేదు; గానుగ ఎద్దు మాదిరి, వేసిన పుంతనే తిరుగుతూ ఉండడం మనిషికి మిగులుతుంది. ఇప్పుడున్న వ్యవస్థ ఎలా వచ్చింది అని ప్రశ్నించుకుంటేనే సమస్యా పరిష్కారానికి, స్వేచ్ఛా వాతావరణానికి నాందీవచనం పలికినట్లవుతుంది. ఈ నాటి సంఘం లోగడ మనుషులు తమ అవసరాలను బట్టి, తమ అభి ప్రాయాలననుసరించి తమ కోరికలు నెరవేర్చుకోవడానికి ఏర్పరచుకొన్న వ్యవస్థ అని స్పష్టమవుతుంది. అయినప్పుడు, ఈనాటి మనుషులు తమ అవసరాలకు, ఆలోచనలకు అనుకూలంగా సమాజాన్ని ఎందుకు మార్చు కోకూడదు? సనాతనులకున్న హక్కు, అధికారం ఆధునికులకు ఉండ కూడని కారణం ఏమిటి? ఈ పరీక్షను, పరిశీలనను ప్రేరేపించేది శాస్త్రీయ దృక్పథం.

"దారిద్ర్యాన్ని రూపుమాపడమెలా?"

రెండవది, నానాటికీ పెరుగుతున్న విజ్ఞానాన్ని మానవోప యోగానికి, మానవ కల్యాణానికి సద్వినియోగం చెయ్యడం. ప్రపంచంలో పేదరికము పెరుగుతున్నది. అందులో ముఖ్యంగా బడుగుదేశాలలో ఈ దారిద్ర్యం తీవ్ర రూపంలో వుంది త్వరితగతిని హెచ్చుతున్న జనాభా పెరుగుదల ఈ పరిస్థితిని మరింత జటిలం చేస్తున్నది. తినడానికి తిండి, కట్టుకోడానికి బట్ట, ఉండడానికి ఇల్లు, కనీసమైన వైద్య సౌకర్యాలు చాలా దేశాలలో కరువైనాయి. దీనికి పరిష్కార మార్గమేమిటి? ఈ ఆకలి

దప్పులు తీర్చేదెలా ? ప్రజల కనీసావసరాలనైనా సర్దగల సామర్థ్యం ఎలా వస్తుంది ? సాంఘిక న్యాయాన్ని సాధించడం ఎట్లా ?

సమాజంలోని నిమ్నోన్నతాలను సమం చెయ్యడం మాత్రమే చాలదు. అది ఒక్కటే సమస్యను పరిష్కరించలేదు. అందులో వర్ధమాన దేశాలలో ఉన్న సంపద స్వల్పం కావడంచేత, సమతా కార్యక్రమం ఎంత అవసరమైనా, వున్న దారిద్ర్యాన్ని అది తీర్చలేదు. దానంతట అది పూర్తి పరిష్కారం కాదు.




“శాస్త్రీయ విధానం ఆవశ్యకత”

ఉత్పత్తి – అవసరమైన అన్ని వస్తువుల ఉత్పత్తి – అనేక రెట్లు పెరిగితేనే తప్ప ఆర్తిగొన్న ప్రజాసమూహానికి అవసరాలు సాధ్యం కావు. ఉత్పత్తి అధికంగానే కాక, విరివిగా, బహుళంగా పెరగాలంటే, నేడు లభ్యమవుతున్న శాస్త్రీయ విజ్ఞానాన్ని అన్ని రంగాలలోను వినియోగించుకోక తప్పదు. ఆకలి బాధ తీరాలంటే ఆహారపదార్థాలు ఇబ్బడి ముబ్బడిగా ఉత్పత్తి కావాలి. భూమి పెరగదు గదా! పెంచవలసింది, పెంచగలిగింది అందులో నుంచి వచ్చే ఉత్పత్తి మాత్రమే! ఆ పెరుగుదల ఒక్క శాస్త్రీయ విజ్ఞానం ద్వారానే సాధ్యమవుతుంది. అలాగే పారిశ్రామికోత్పత్తి కూడా. ఆ రీతిగానే అన్నిరంగాలలోను ఉత్పత్తి పెరగడానికి ఇది ఒక్కటే మార్గం.

నిజం చెప్పుకోవాలంటే, ఈ శాస్త్రీయ విజ్ఞానమే నేటి సమాజం లోని నీతిని, న్యాయాన్ని పెంచగలదు. ఆస్తి కరువై, అనేక మంది అలమటిస్తూ ఉంటే చూసి పట్టనట్టు ఊరుకునే తత్వంలో ఏమి నీతి ఉంది? ఏమి న్యాయముంది? అందరి అవసరాలు తీరే న్యాయమైన, నీతిబద్ధమైన సమాజం ఏర్పడటానికి శాస్త్రీయ విజ్ఞానం ఎనలేని సాధనం. అట్టి నీతినీ, న్యాయాన్నీ, గుర్తింప జేసేది కూడా శాస్త్రీయ దృక్పథమే. అందుకనే సంఘానికి శాస్త్రం అందించే ఆలోచనా సరళి, విజ్ఞానం ప్రాణం వంటివనడం అతిశయోక్తి కాదు.

(అక్టోబరు 1973)

# జీవవాహిని శంఖ

వేదాలతో విరమించకుండా మన తాత్త్వికులు ఉపనిషత్తులు, ఆస్తికషడ్దర్శనములు రచించారు. పరిశీలించడం, పురోగమించడం, జీవంగల మనిషి చేయువలసిన పని. మానవ జీవితం ఒక నిరంతర యాత్ర. హద్దులు లేవు. ఏ ఒక్క వ్యవస్థా చరమావస్థ అవడానికి వీలు లేదు. ముందుకు సాగడమే మానవ కర్తవ్యం.

నన్ను మార్చిన పుస్తకాలు అనేకం ఉన్నాయి. వాటిని, మార్చిన పుస్తకాలు అనడం కంటె, నన్ను మలచిన పుస్తకాలు అనడం ఉచితమను కుంటాను. అంతకంటె కూడా, నన్ను మలిచిన రచయితలు అనడం ఇంకా ఎక్కువ సబబుగా వుంటుంది.

మనిషి పుట్టిన దగ్గర నుంచి అనేక ప్రభావాలకు లోనవుతూ వుంటాడు. వయసు పెరిగిన కొద్దీ, తాను పొందిన అనుభవాలు, అనుభూతులు ఆతన్ని తీర్చి దిద్దుతూ ఉంటాయి. వీటిలో నుంచి భావాలు అవతరిస్తూ ఉంటాయి. అవి అతనిలో ఆలోచనల్ని రేకెత్తిస్తాయి. పరిణతి పొందిన అట్టి ఆలోచనలు, భావనలే అతని జీవితాన్ని నడుపుతూ ఉంటాయి, మలుస్తూ ఉంటాయి.

అట్టి భావాలు సంతరించుకొనడానికి ప్రధాన మార్గం చదవడం. పుస్తకాలు, పత్రికలు చదివేటప్పుడు, ప్రతి మనిషికీ ఆలోచనలు స్ఫురించడం సహజం. అవి ప్రగాఢమైనవైతే వాటి ప్రభావం ఎక్కువగా వుంటుంది. భావాలకు పలుకుబడి వుండాలంటే వాటిలో కొత్తదనం వుండాలి. సబబు వుండాలి. వాటిని వివరించే తీరులో వేడి, వాడి వుండాలి. అట్టి రచనలే పాఠకుని మేధను జేరగలవు దాన్ని కదిలించగలవు.

"నాపై ఉషఃకాంతులు వెదజల్లిన రచయితలు"

ఇంత శక్తి గల రచనలను, రచయితలను చదువుకునే అవకాశం నాకు లభించింది. చిన్ననాటి నుంచి నన్ను ఉత్తేజపరచిన ఇప్పటి వరకు, నాది దాదాపు ఆరు దశాబ్దాల జీవితం. ఒక్కసారి ఈ జీవిత గమనాన్ని పరిశీలించుకుంటే, నాలో పెరిగిన ఎన్ని భావాలో, నన్ను మలచిన ఎన్ని ప్రభావాలో, కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. బాల్యంలో నడిచిన పల్లెటూరి జీవితం మూలాన సంకుచితంగా ఆరంభమైన నా ఆలోచనా సరళి, యీ ప్రభావాల మూలంగా, లోతును, విశాలతను సంతరించుకున్నది. ఒక్కోసారి నాలో కలిగిన మార్పులు నాకే ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంటాయి. నాకు

మట్టుకు నాకు ఈ మార్పుకు ముఖ్యకారణం నేను చదువుకున్న రచయితలే

నేను పుట్టింది చాలా మంది లాగానే, సంప్రదాయబద్ధమైన కుటుంబంలో: భక్తి ప్రధానమైన మనస్తత్వం నా పెద్దలది. దేవుణ్ణి శ్రద్ధగా కొలుచుకునే వాతావరణం అది. నాకు సుమారు తొమ్మిది, పది సంవత్సరాల వయస్సులో మొదటిసారి గౌతమ బుద్ధుని కథ చదువుకున్నాను నా క్లాసు పుస్తకంలో అది వ్రాసింది ఎవరో గమనం లేదు. కాని, ఆ కథ నా లేత మనసులో వెలిగించిన ఉషఃకాంతులు యీనాటికీ నా స్మృతి పథంలో నిలిచి వున్నాయి. నీ చుట్టూ వున్న ప్రాణికోటి




ఈతి బాధలతో అలమటించిపోతూవుంటే, అది పట్టించుకోక, దేవుడి కోసం భజన్లు చెయ్యడం దేనికి అన్న ప్రశ్న రేకెత్తించింది. ఆ కథ నాకు తెలియకుండానే నా తోటి మానవుల్ని కొత్త ఆసక్తితో చూడ్డం మొదలెట్టాను. దేవాలయాల మీద శ్రద్ధ తగ్గడం ప్రారంభమైనది. గౌతమ బుద్ధుని గురించిన ఆ గాథ అంత పని చేసింది నాలో.

వేమనగారి పద్యాలు ప్రతి తెలుగు బిడ్డకు పాఠ్యభాగంగా వుంటాయి. మా చిన్నతనపు రోజుల్లోనే వేమన కవితకు ప్రచారం వచ్చింది. మా క్లాసు పుస్తకాలలో వారివి కొన్ని ఆటవెలదులను, తేటగీతలను చేర్చారు. ఆ పద్యాలలో అంతకు ముందు చూడని విజ్ఞాన జీవిత సత్యాలను చూపినట్లయింది నాకు. మనిషిని మంచివాణ్ణిగా మార్చాలంటే

అతని ఆలోచనా రీతిని మెరుగుపరచాలంటే వేమనగారి బోధ చాలా అవసరం. నాలో చిగురిస్తున్న మానవుని మీది ఆసక్తి వేమనగారి కవితతో బలపడింది.

ఇది యిలా వుండగా చిన్ననాటనే మరొక ప్రభావం వచ్చి పడింది నామీద. అది తెలుగు భాష మీద, తెలుగు సాహిత్యం మీద ప్రీతి: ఇది కలగడానికి ప్రధాన కారణాలు వేమన గారి పద్యాలు, పోతనగారి భాగవతమూను. మందార మకరందంలాంటిది తెలుగు అని తెలుసుకున్నాను. ఆ ఇద్దరు కవులు తెలుగు తియ్యదనాన్ని రుచి చూపించగా, నాలోని అభిరుచి పెరిగింది. ప్రతి తెలుగు రచన-దొరికిందల్లా చదవడం అలవాటయింది. వాటిలో భారతం, ఆముక్తమాల్యద, వసుచరిత్ర నా హృదయం మీద చెరగని ముద్ర వేసినై.

నా చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడే వచ్చింది తెలుగులో భావకవిత్వం; ఆ కవనం కొరకు నన్నయ్య రచనను కాకపోయినా, తిక్కన రచనను, కృష్ణశాస్త్రి కృష్ణపక్షమునూ, ఇతర రచనలనూ చదివాను. ఏదో అవ్యక్తమైన మానసిక స్వేచ్ఛ కోసం ఆరాటపడే కవనం. అది ఆ స్వేచ్ఛాప్రియత్వం నా భావ సరళిని తీవ్రతరం చేసింది

## "హేతువాద బీజాలు"

తరువాత త్రిపురనేని రామస్వామిగారి కురుక్షేత్రం, సూత పురాణం చదివాను. ఎంతో పలుకుబడిగల నమ్మకాలను క్రొత్త దృష్టితో పరిశీలించారు వారు. ఎంత పురాతనమైన విషయమైనా స్వంత బుద్ధితో ఆలోచించి, విమర్శించుకునే కుతూహలం కలిగింది, వారి రచనలు చదివితే. అంధ విశ్వాసాల మీద, దురాచారాల మీద విప్లవోద్యమం నడిపిన వీరేశలింగంగారి గ్రంథాలు అప్పుడే చదివాను. ఈ దురాచారాలు మనిషిని ఎంత బలహీనుణ్ణిగా చేస్తున్నాయి? ఎంత బానిసగా చేస్తున్నాయి? మనిషి బాగుపడాలంటే, మార్పు అవసరమనీ, మార్పుకు ఆలోచన కావాలనీ, ఆలోచనకు విజ్ఞా

నము, సాహసము కావాలనీ, ఈ ఇద్దరి ప్రముఖుల రచనలవల్ల తెలుసుకున్నాను గురజాడ అప్పారావు గారి కన్యాశుల్కం అందుకు దోహదకారి అయింది

అంతలో ఒకప్రక్క చలం గారు, మరొకప్రక్క శ్రీ శ్రీ గారు వచ్చారు నా పఠనా పరిధిలోకి. స్త్రీని గురించి ఒకరు, సమాజాన్ని గురించి మరొకరు, కొత్త కోణాలనుంచి నేను ఆలోచించేట్టు చేశారు. ఉన్నవ లక్ష్మీనారాయణ గారి మాలపల్లి సాంఘిక దృష్టిని రేకెత్తించింది నాలో.




అయితే, ఈ కొత్తదృష్టికి నాలో అదివరకే పునాదులు ఏర్పడి వున్నాయి. మార్క్స్ వ్రాసిన 'దాస్ కాపిటల్' ఆయన ఎంగెల్స్‌తో కలిసి వ్రాసిన 'కమ్యూనిస్టు మానిఫెస్టో' శ్రీ శ్రీ రచనకు ముందే చదివాను. ఈ రెండూ, హెగెల్, కాంటు రచనలను చదవడానికి దారితీసినై. ఈ భావుకత నాలో కొత్త ఆసక్తిని రగుల్కొలిపింది. ఈ భావనారీతి ఎలా పరిణతి చెందింది? రష్యన్ విప్లవానికి ఎలా దారి తీసింది? అనే ప్రశ్నలు నాలో పుట్టుకు వచ్చినై. చదవగా ఆలోచించగా తేలిన సారాంశం.

"సాంఘిక విప్లవానికి ఆనుల సోపానం"

పదహారు, పదిహేడు శతాబ్దాలలో ఇంగ్లండులో జరిగిన పారిశ్రామిక విప్లవం ప్రజాస్వామిక విప్లవానికి మార్గదర్శకమైంది.

పందొమ్మిదవ శతాబ్ది చివరి భాగంలో వచ్చిన అమెరికన్ స్వాతంత్ర్య సమరము, ఫ్రెంచి విప్లవము ప్రజల హక్కుల కోసం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం జరిగినవి. థామస్ జఫర్సన్, రూసో మొదలయిన రచయితలు, భావుకులు ఈ సంఘటనలకు వైతాళికులైనారు. అయితే ఆ ఉద్యమాలలో ఆర్థిక సమానత ప్రధాన వస్తువు కాదు. కాని ముందు రాబోయే ప్రగతి ఉద్యమాలకు అవి నాందీ వచనాలు పలికినై.ఇరవయ్యో శతాబ్దపు తొలి భాగంలో జరిగిన రష్యన్ విప్లవం సాంఘిక వ్యవస్థను అందులోని ఆర్థిక ప్రాతిపదికను సమూలంగా మార్చింది. మార్క్సుకు, లెనిన్ వ్రాసిన భాష్యం, ఈ క్రియానుగతమైన మానవోద్యమాలకు అద్దం పట్టింది. వీటిని చదివి, మానవుడు స్వేచ్ఛాప్రియుడని, అట్టి స్వేచ్ఛకు ఆర్థిక సౌలభ్యం ప్రధాన భాగమని తెలుసుకున్నాను

భారత స్వాతంత్ర్యోద్యమం గాంధీ గారి నాయకత్వం క్రిందకు వచ్చిన పిమ్మట, ప్రజావాహిని అందులో పాల్గొనడం మొదలుపెట్టింది. అప్పటి వరకు పై తరగతుల వారికి, చదువుకున్న వారికి, పరిమితమైన ఈ ఉద్యమం గాంధీజీ రాకతో పల్లెటూళ్ళకు పాకింది. సామాన్య ప్రజల హృదయాలలో కూడా స్వాతంత్ర్య వాంఛను రేకెత్తించింది. గాంధీజీ నాయకత్వానికి గొప్పగా ఉపకరించింది వారి ఆత్మ కథ. వేలూరి శివరామ శాస్త్రిగారు దాన్ని తెలుగులోకి అనువదించారు. గాంధీజీ నిర్మలమైన మనస్తత్వాన్ని, నిర్మలమైన వ్యక్తిత్వాన్ని ప్రజలకు అందించిన పుస్తకం అది. మహాత్ముల యెడ గురివున్న భారతీయులకు గాంధీజీ ఏడుగడగా రూపొందాడు. వారి ఆత్మకథ చదివిన పిమ్మట గాంధీజీకి భారత ప్రజల మీద అంతటి అధికారం ఎలా వచ్చిందో అర్థం చేసుకోగలిగాను. వారి పత్రికా రచన చాలా పదునైనది. పాఠకుని మనస్సులోకి సూటిగా జొరబడి, దాన్ని కదిలించగల శక్తి వుంది ఆ రచనకు.

స్వాతంత్ర్యోద్యమకర్తలలో ఒకడు కాకుండా వుంటే పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రపంచ రచయితల్లో ఒకరై వుండేవారు. వారి "డిస్కవరీ ఆఫ్ ఇండియా", "గ్లింపసెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" భారత

చరిత్రకు, మానవ చరిత్రకు, నూతన దృక్పథాన్ని ఎత్తి చూపెట్టినై. ఈ కోవనే పయనించి "ఆర్నాల్డ్ టైన్బీ" మానవ చరిత్రకు నూతనత్వాన్ని నూతన ప్రాతిపదికను ప్రతిపాదించాడు. ఈ పుస్తకాన్ని చదువుకున్న పిమ్మట, ఈ చరిత్ర అంటే కేవలం ఒక పెద్ద కథ మాత్రమే కాదనీ, మానవ సమాజ గమన వివరణ అనీ తెలుసుకోగలిగాను. అప్పటినుంచి చరిత్రను కొత్త దృష్టితో చదవడం మొదలుపెట్టాను. ఏయే ఘట్టాలలో ప్రభావాలు మానవుణ్ణి, సమాజాన్ని నడిపినదీ, అవి తరువాత ఎలా మారుతూ వచ్చాయో అర్థం చేసుకోగలుగుతున్నాను.

నెహ్రూజీదే మరొక గ్రంథం వారి ఆత్మకథ. అది ఒక మహా నాయకుని జీవిత చిత్రణే కాకుండా, ఒక మధుర కావ్యం కూడా. ఎటువంటి




సంపదల మధ్య పుట్టినప్పటికీ సున్నితమైన హృదయ తత్వము, సునిశిత మైన మేధా సంపద, సత్యాన్ని తెలుసుకోగల జ్ఞానతృష్ణ, ఎరిగిన సత్యాన్ని బాహాటంగా ప్రకటించగల సత్యనిష్ఠ వుంటే, మనిషి మహామనిషి ఎలా అవుతాడో వారి ఆత్మకథ ఎత్తిచూపుతుంది. వారి ఆత్మకథతోపాటు నిరాద్ చౌదరిగారి "ఆటోబయోగ్రఫీ ఆఫ్ యాన్ అన్నోన్ ఇండియన్", ఈ మధ్యనే వచ్చిన యమ్. పి. చాగ్లాగారి "రోసెస్ ఇన్ డిసెంబర్" భారత సాహిత్యాలలో విరిసిన పరిమళభరితమైన కుసుమాలు. నిరాద్ చౌదరిగారి ఆత్మకథ భారత దేశాన్ని గురించి, భారతీయ జీవితాన్ని గురించి, నన్ను

ఆలోచనాపరుణ్ణి చేసింది. సునిశితంగా వాటిని పరిశీలించే కోరికను నాకు కలిగించింది. ఛాగ్లాగారి ఆత్మ చరిత్ర ఈ నాటి మన దేశానికి, హిందూ ముస్లిమ్ సహృదయతకు, న్యాయ పరిపాలనా వ్యవస్థకు ఒక దర్పణం లాంటిది. ఈ గ్రంథాలను చదివితే నేనే కాదు, ఎవరేనా ఆలోచనాపరులవుతారు. వాటిని ఎన్నటికీ మరువలేరు.

## "మానవతావాదం"

ఇంగర్ సోల్, బెర్ట్రాండ్ రస్సెల్, మొదలైన తాత్వికుల రచనలు చదివాను. అవి నా ఆలోచనా భావనలో పెద్ద పీట వేసుకొని కూర్చున్నాయి. విశ్వరహస్యాలను, మానవ ప్రకృతిని మౌలికంగా పరిశీలించిన గ్రంథాలు




వారివి. ఈ ఇద్దరు మేధావులూ మానవుణ్ణి రచనా వస్తువుగా స్వీకరించిన వారు. మానవుడు తన జీవితానికి తానే కర్త, భర్త అని వాదించినవారు వారిద్దరు. మానవోన్నతికి భగవంతుడు అవసరము లేదనీ, కాకపోగా, పైగా అడ్డుగా నిలబడగలడనీ వారి వాదన. మన ప్రగతి మానవ ప్రయత్నం మీదనే ఆధారపడి వుంటుందనేది వారి రచనల నుంచి నేను నేర్చుకున్న విషయం.

"మానవేంద్ర నాథ్ రాయ్" రాసిన రచనలెన్నో వున్నాయి. ప్రతి ఒక్కటి భావుకతలో ఆణిముత్యం. మౌలికమైన విషయాలను విప్లవాత్మ

కంగా పరిశీలించిన మహామేధావి, తాత్వికుడు యమ్ యన్. రాయ్, తాత్విక, రాజకీయ, సాంఘిక, ఆర్థిక సమస్యలను ఉద్యమాలను కొత్త బాణీలో ఆయన నిర్వచనం చేశాడు. నవ్య మానవతావాదాన్ని ప్రతిపాదించాడు మానవుడు సమాజంలో అంతర్భాగమైనప్పటికీ, విశిష్టమైన వ్యక్తి, ప్రతి వ్యక్తి స్వేచ్ఛను, శ్రేయస్సును కాపాడందే సమాజ కల్యాణం పరిపూర్ణం కాదని వారి వాదం. అటు వ్యక్తి స్వేచ్ఛకు, ఇటు సాంఘిక శ్రేయస్సుకు మధ్య సమన్వయం చేకూర్చే భావ సరళి రాయ్‌ది. రాయ్ రచనలు అందించిన భావాలు నామీద చాలా ప్రభావాన్ని కలిగించినై. హేతువాదం, అందులోనుంచి భౌతిక వాదానికి పురోగమిస్తున్నది రాయ్ మార్గం.

ఈ మార్గాన్నే ఆలోచించినవాడు 'ఎరిక్ ఫ్రామ్' ఆయన వ్రాసిన 'సేన్ సొసైటీ' నాకు బాగా నచ్చిన గ్రంథాలలో ఒకటి. ఏది వ్రాసినా ప్రతిభావంతంగా వ్రాయగలడు. ప్రతిభతోపాటు బాగా స్వతంత్ర ఆలోచన వున్నవాడు ఆయన. సామాజిక వ్యవస్థ తీరుతెన్నులను నిశితంగా పరిశీలించడానికి సహకరిస్తాయి, 'ఫ్రామ్' పుస్తకాలన్నీ.

ఈమధ్యనే 'నోబుల్ ప్రైజ్' వచ్చింది ఆర్థిక శాస్త్రవేత్త 'మిరడాల్'కు. వారి ప్రసిద్ధ గ్రంథం 'ఏసియన్ డ్రామా', చాలా ఆసక్తితో చదివాను ప్రాచ్యదేశాలను లోతుగా పరీక్షించిన గ్రంథం అది. ఈ పుస్తకం ఆసియాలోని ఆర్థిక సమస్యలను అర్థంచేసుకోవడానికి నాకు ఉపకరించింది

## "నిత్య ప్రవాహము"

సింహావలోకనం చేస్తే ఒక సత్యం కనిపిస్తుంది. వేదాలతో ఆగిపోకుండా మన తాత్వికులు ఉపనిషత్తులను, ఆస్తిక షడ్దర్శనములు వ్రాశారు. పరిశీలించడం, పురోగమించడం జీవంగల మనిషి చేయవలసిన

పని మానవ జీవితం ఒక నిరంతర పయనం. దానికి అంతం లేదు. హద్దులు లేవు. ఏ ఒక వ్యవస్థ చరమావస్థ అవడానికీ వీలు కాదు. దేనితోను ఆగిపోకూడదు. ముందుకు సాగిపోవడమే మానవ కర్తవ్యం. అదే అతని శ్రేయోమార్గం ఇన్ని పుస్తకాలు చదివి నేను తెలుసుకున్న సత్యం ఇదే.

(అక్టోబర్ 1976)

# నేటి సినిమాల స్థాయి

చలన చిత్రకళ అభివృద్ధికి అవార్డుల ప్రదానం ఎంతో దోహదం చేస్తుంది.

చిత్రాలలో అనుకరణ పరిపాటి అయింది.

దీక్షతో, ఏకాగ్రతతో, చిత్రాలలో స్థాయి పెంచవచ్చు. నిజ జీవితానికి కథలు దగ్గరగా వుండాలి. సహజత్వంతో పాటు సమాజ వికాసానికి కూడా వీలు కల్పిస్తే చిత్రాలు బాగుంటాయి.

చలన చిత్రకళ అభివృద్ధికి అవార్డుల ప్రధానం ఎంతో దోహదం చేస్తుంది. కళను గౌరవించి ఉత్తమ ప్రమాణాలను ప్రోత్సహించడమే ఉత్తమ చిత్రాలకు అవార్డులు ఇవ్వడంలో ప్రధాన ఉద్దేశ్యం. రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ అవార్డుల నిర్ణయంలో విభిన్న పద్ధతులు అమలు జరుగుతున్నాయి. కొన్ని ప్రత్యేక సంస్థలు, "బేలట్ బాక్స్ పద్ధతి" ద్వారా ప్రేక్షకుల అభిప్రాయాన్ని సేకరించి తగిన రీతిలో కళను ప్రోత్సహిస్తున్నాయి. జాతీయ స్థాయిలో ఇచ్చే అవార్డుల కోసం ఒక "జ్యూరీ" ని ఏర్పరచి ఆ యా ప్రాంతాల ప్రముఖులకు అందులో ప్రాతినిధ్యం ఇచ్చి తగిన నిర్ణయాలు గైకొంటున్నారు. అవార్డుల కమిటీలో సంగీత పరిజ్ఞానమున్న వారికి, సినిమాటోగ్రఫీలో మంచి ప్రావీణ్యం వున్నవారికి



కూడా ప్రాతినిధ్యమిస్తే మంచిది. ఆ యా దృక్పథాలను నిశితంగా పరిశీలించి సముచితమైన సలహాలివ్వడానికి వాళ్ళు దోహదం చేస్తారు. సినీ పరిశ్రమతో పరిచయమున్న వారిని కానీ, సినీ పరిశ్రమలోని వారిని కానీ ఒకరిని చేర్చితే బాగుంటుంది.

## "వయలెన్స్ యుగం"

అవార్డుల నిర్ణయాలపై ఎప్పుడూ విమర్శలు వుంటాయి. కాని విమర్శ, విమర్శగా కాకుండా సద్విమర్శగా సునిశితంగా వుండడం అవసరం. విమర్శకులకు నేను కలలో కూడా జంకను. కాని నా మటుకు నేను నా విధి

నిర్వర్తించాననే తృప్తి వుంది. చిత్రాలలో అనుకరణ అనేది సహజమై
పోయింది. ఎవరు ఎలా కాపీకొడుతున్నారో పట్టుకోవడం దుస్సాధ్యం.
ఎప్పుడో ఎక్కడో నిర్మించిన చిత్రాల సంగతి ఎలా తెలుస్తుంది? అయినా
విమర్శలకు తావుండకుండా వుండేందుకు ఒక ప్రత్యేక పద్ధతిని సూచి
స్తున్నాను. అదేమంటే ఎంపికైన చిత్రాలకు అవార్డులు ప్రకటించే ముందు
పత్రికలలో ప్రకటించి అభిప్రాయాలు సేకరించడమో, విమర్శను
"వయలెన్స్" రూపంలో ప్రదర్శించడమో అప్పుడప్పుడు జరుగుతుంది. ఇది
తగదు. ఇది "వయలెన్స్" యుగమైపోయింది. ప్రతిది వయలెన్స్ ద్వారా
సాధించుదామనే భావం అందరిలో నాటుకుపోయింది.




చలన చిత్రాలు సమాజ వికాసానికి ఎంతో దోహదం చేస్తాయి
వాటిని చూసి ప్రజలు ప్రక్కదారులు త్రొక్కుతున్నారంటే నేను
నమ్మను. సినిమాలు సర్వ కళలతో కూడుకున్న సాధనాలు. సంగీతం,
నటన, నాట్యం, అభినయంతో పాటు సాంకేతిక విలువల్ని జతగూర్చిన
సమగ్రమైన రూపమే సినిమా కళ. ఇట్టి కళాసృష్టికి కథలు ప్రజలనుంచే
వస్తాయి.

## "సన్నగిల్లుతున్న క్వాలిటీ"

పూర్వకాలం చిత్రాలకు, ఇప్పటి చిత్రాలకు తేడా వున్నది. నేటి
పరిశ్రమ ఎంతో ప్రగతిని సాధించింది కాని అప్పుడు వున్న క్వాలిటీ
ఇప్పటి చిత్రాలలో చూపెట్టలేకపోతున్నారు. ప్రతి విషయంలో పొందుప

చలన చిత్రకళ అభివృద్ధికి అవార్డుల ప్రధానం ఎంతో దోహదం చేస్తుంది. కళను గౌరవించి ఉత్తమ ప్రమాణాలను ప్రోత్సహించడమే ఉత్తమ చిత్రాలకు అవార్డులు ఇవ్వడంలో ప్రధాన ఉద్దేశ్యం. రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ అవార్డుల నిర్ణయంలో విభిన్న పద్ధతులు అమలు జరుగుతున్నాయి. కొన్ని ప్రత్యేక సంస్థలు, "బేలట్ బాక్స్ పద్ధతి" ద్వారా ప్రేక్షకుల అభిప్రాయాన్ని సేకరించి తగిన రీతిలో కళను ప్రోత్సహిస్తు న్నాయి. జాతీయ స్థాయిలో ఇచ్చే అవార్డుల కోసం ఒక "జ్యూరీ" ని ఏర్పరచి ఆ యా ప్రాంతాల ప్రముఖులకు అందులో ప్రాతినిధ్యం ఇచ్చి తగిన నిర్ణయాలు గైకొంటున్నారు. అవార్డుల కమిటీలో సంగీత పరిజ్ఞాన మున్న వారికి, సినిమాటోగ్రఫిలో మంచి ప్రావీణ్యం వున్నవారికి



కూడా ప్రాతినిధ్యమిస్తే మంచిది. ఆ యా దృక్పథాలను నిశితంగా పరిశీ లించి సముచితమైన సలహాలివ్వడానికి వాళ్ళు దోహదం చేస్తారు. సినీ పరిశ్రమతో పరిచయమున్న వారిని కానీ, సినీ పరిశ్రమలోని వారిని కానీ ఒకరిని చేర్చితే బాగుంటుంది.

## "వయలెన్స్ యుగం"

అవార్డుల నిర్ణయాలపై ఎప్పుడూ విమర్శలు వుంటాయి. కాని విమర్శ, విమర్శగా కాకుండా సద్విమర్శగా సునిశితంగా వుండడం అవసరం. విమర్శకులకు నేను కలలో కూడా జంకను. కాని నా మటుకు నేను నా విధి

# నా డైరీ నుంచి

మనిషి ఎంత మామూలువాడైనా ఎలా మారుతూ
వచ్చాడో ఎలా ఎదుగుతూ వచ్చాడో అతని జీవితం ఎలా
పరిణతి చెందుతూ వచ్చిందో డైరీలో కనిపిస్తున్నది.
సామాన్య జీవితాలలో కూడా డైరీవల్ల ప్రయోజనము
కనిపిస్తుంది.

డైరీ రాయడం వల్ల ఉపయోగం ఏమిటి? అది మహనీయమైన జీవితానికి సంబంధించినదైతే, సమాజ నడవడికకే ఉపకరిస్తుంది. ఆదర్శంగా వెలుగుతూ ఉంటుంది. సామాన్య జీవితాలలో కూడా డైరీ వల్ల చాలా ప్రయోజనం వుంది. మనిషి ఎంత మామూలు వాడైనా, ఎలా మారుతూ వచ్చాడో, ఎలా ఎదుగుతూ వచ్చాడో, అతని జీవితం ఎలా పరిణతి చెందుతూ వచ్చిందో, అందులో కనిపిస్తూ ఉంటుంది. డైరీలో మరొక విలువ కూడా ఉంది. అది ఆంతరంగికమైన విషయం గనక దాన్ని రాసుకునే మనిషి అంతరంగం, అందులో అరమరికలు లేకుండా ఆవిష్కారణ మవుతుంది.




అయితే, ఈ దినచర్యలు పుస్తకానికి ఎక్కించకపోయినా తన మనస్సును, బ్రతుకును మలిచిన సంఘటనలు, సన్నివేశాలు ప్రతి మనిషికీ చెరగని .ముద్రలుగా, స్మృతిపథంలో నిలిచిపోతాయి. తనను ప్రభావితం చేసిన అనుభవాలను మనిషి సాధారణంగా మరిచిపోలేడు.

## “నేను - నా బాల్యం”

రష్యాలో విప్లవం జరిగిన ఏడే నేను పుట్టాను. మాది గుంటూరు జిల్లాలోని మారుమూల గ్రామం. మొదటి ప్రపంచ యుద్ధం మూలంగా మానవాళిలో పెద్ద మార్పులు వచ్చినా, మా చిన్న గ్రామంలో వెంటనే తేడాలు కనిపించ లేదు. జీవితం దేవాలయాల వలయాలలో తిరుగుతూ

ఉండేది. కులాల పట్టుదల మీద నడుస్తూ ఉండేది. పాతుకుపోయిన ఆచారాలకు, అలవాట్లకు అంతం లేదేమో అనిపించేది. చదువు సంధ్యలకు కూడా అవకాశం పెద్దగా దొరికేది కాదు. వీధి బళ్ళు, ఉన్నవారు ప్రత్యేకంగా దిగుమతి చేసుకొన్న గురువులు. వీరే విద్య గరిపేవారు. ఈ పరిధి లోనే నా బాల్యస్థితి నడిచింది.

మెల్లమెల్లగా గ్రామాలకు క్రైస్తవ మత బోధకులు, తెల్లవారు, రాసాగారు. ఆ తరువాత గాంధీగారు హరిజనులని ఘనంగా పిలిచిన మాల మాదిగలు వారి చుట్టూ చేరారు. ప్రభుత్వం చేస్తున్న తెల్లవారే రావడం చేతనా, ఈ ఆకర్షణ అని నా లేత మనస్సులో ప్రశ్నించుకొన్నాను. అలా అయితే అగ్రకులాల పేరుతో చెలామణి అవుతున్న వారుకూడా వారి చుట్టూ తిరగాలి కదా? అలా జరగలేదు ఆనాడు. కేవలం అంటరాని వారు మాత్రమే క్రైస్తవ మతంలో చేరారు. అందుకు ఆనాడు, ఈనాడు నాకు దొరికిన సమాధానం ఒక్కటే. ప్రతి మానవుడూ ఒక వ్యక్తి. తన గుర్తింపు కోసమై తాపత్రయపడతాడు. తాము పుట్టి పెరిగిన మతంలో తరతరాల నుంచి తమకు తావులేకుండా పోయింది. ఈ క్రొత్తదానిలో తమని గుర్తిస్తున్నారు, మనుషులుగా. దేవుని బిడ్డలుగా మన్నిస్తున్నారు. అందుకనే ఆంధ్రదేశంలోని హరిజనులు పుంఖాను పుంఖంగా క్రైస్తవాన్ని స్వీకరించారు.

## "గురు శిష్య సంబంధం"

గుంటూరు చాలాకాలంనుంచి విద్యాకేంద్రం. హైస్కూలు చదువుకై అక్కడకు పంపారు నన్ను. ఎన్నటికీ మరపురాని అనుభవం. ఆనాటి అధ్యాపకులు, శిష్యులయెడ చూపిన ఆప్యాయత నాకు ఇన్నేండ్లు గడిచినా, వారినుంచి పొందిన ప్రేమానుభూతి మధుర స్మృతిగా నాలో నిలిచిపోయింది. అంతటి ఆదరణ చూపగలిగిన ఉపాధ్యాయుడు, విద్యార్థి హృదయాన్ని ఆకట్టుకోడంలో ఆశ్చర్యమేముంది? ఈనాటి విద్యార్థి లోకంలోని అశాంతికి, ఉపాధ్యాయుల బాధ్యత మెండుగానే ఉన్నదనుకొంటాను.

తమ దగ్గర చదువుకుంటున్న బిడ్డల్ని వారు అంతగా అభిమానించలేక పోతున్నారు. అభిమానించలేనివారు అదుపులో ఎలా పెట్టగలరు?

"తెలుగు భాషాభిమానం-మందార మకరందం"

మా క్లాసు పుస్తకంలో చదివాను- "మందార మకరంద మాధుర్య మును గ్రోలు....." అనే పోతన గారి పద్యాన్ని. ఎంత తియ్యగా మనో హరంగా ఉంది ఈ పద్యం! అది కంఠతా పట్టాను. ఆ పద్యమే పాడు కొంటూ తిరుగుతూ ఉండేవాణ్ణి. మననం చేసుకొన్నకొద్దీ దాని మాధుర్యం నన్ను ఆవరించింది. భాగవతం యావతూ చదివేదాకా ఆగలేదు మనస్సు.




ఆ చిన్న వయస్సులో అంతా అర్థమైకాదు ఆ చదవడం. ఆ నడక, ఆ పద లాలిత్యం, ఆ శబ్ద సౌందర్యం, అందులోని భక్తి పారవశ్యత నాలో పారవశ్యతను నింపినాయి. వేమనగారి పద్యాలు చదివాను. ఆటవెలది, తేటగీతి అనే పేర్లు ఆ పద్యాల మూలంగానే సార్థకతను సంతరించుకొన్నవా అనిపించింది. పోతనగారు, వేమనగారు కలిసి, నాలో తెలుగు భాష యెడల గాఢమైన అభిమానాన్ని పెంచారు. దొరికిన ప్రతి కావ్యము, పుస్తకము చదవడం మొదలుపెట్టాను.

"హేతువాద బీజాలు"

ఇంతలో 1930 వచ్చింది. అప్పుడే ఉప్పు సత్యాగ్రహం జరిగింది. ఏమి కోలాహలం, ఏమి ఉత్సాహం! నిద్రాణమై వున్న జాతిని

ఒక్కసారిగా మేల్కొల్పినట్లయింది. అంతటి బాల్యావస్థలోనూ, జాతిలో వెల్లివిరిసిన నూతనతేజాన్ని చూడగలిగాను. మరీ స్త్రీలోకం ఏదో కొత్తశక్తి సంతరించుకొన్నట్లు కనిపించింది. గాంధీజీ ఎంతటి వైతాళికుడు! స్తంభించి ఉన్న పల్లెపట్టులను సైతము చైతన్యవంతం చేయగలిగాడు. శతాబ్దాల బానిసత్వంలో క్రుంగుతున్న మనస్సులలో క్రొత్త ధైర్యాన్ని, సాహసాన్ని సృష్టించాడు. ఒక రకంగా సృష్టికర్తగా ఆయన్ని అర్థం చేసుకొన్నాను. ఆ ఉద్యమానికి టంగుటూరి ప్రకాశంగారి 'స్వరాజ్య' ఎంతగానో దోహదం ఇచ్చింది. ఆ పత్రిక చదవని రోజంతా నాకు ఏదో వెలితిగా ఉండేది.

స్వాతంత్ర్య సమరంలో గుంటూరుది గొప్ప స్థానం. స్వాతంత్ర్య దీక్ష తీసుకొన్న వాలంటీర్ల దళం గుంటూరు వచ్చింది. ఉన్నవ లక్ష్మీ నారాయణగారు ఆ దళానికి అధిపతి. మునిసిపల్ ఆఫీసువద్ద స్వాతంత్ర్య యోధులకు స్వాగతం పలికారు పురజనులు. శారదా నికేతనం యువతులు వారికి వీరకంకణాలు కట్టారు ఆనాటి వారి గానం ఈ నాటికీ నా హృదయాన్ని పొంగిస్తూనే ఉంది. "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెలుపుడీ——" అన్న వారి గేయం శ్రోతలను ఉద్రూతలూగించింది. ఆ గీత కర్తను తెలుసుకొనే దాకా నాకు నిద్ర పట్టలేదు. త్రిపురనేని రామస్వామి గారి కవిత్వంతో అదే నా మొదటి పరిచయం. వారి కవిత్వంతో పరిచయం కలగాలే కాని, చిత్తశుద్ధితో వారి రచన చదవాలే కాని, పాఠకుడు ప్రభావితుడు కాకుండా ఉండలేడు. మిత్రుడు గోపీచంద్ అన్నట్లుగా 'ఎందుకు అన్న ప్రశ్న' అందరికీ కలిగించిన భావుకుడు ఆయన. నాలో భావ స్వాతంత్ర్యానికి పునాదులు వేసినవాడు రామస్వామిగారు.

"సాహిత్య స్థానం"

అప్పుడే ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి నవల చదివాను. దానిలోని శిల్పం, సౌందర్యంతో పాటు, తెలుగు లోకానికి సాంఘిక

దృక్పథాన్ని అందించిన పుస్తకం అది. ఆ రోజుల్లోనే ఒకనాడు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు గుంటూరు వచ్చారు. వారి కవితాగానం విన్నాను. "ఆకులో ఆకునై, పూవులో పూవునై ఈ అడవి దాగిపోనా!" అని ఆయన ఆరాట పడుతుంటే, ఆ కవితారీతిలో, ఆలోచనా వీధిలో కొత్త మలుపులు చూశాను. శ్రీశ్రీ గారి విప్లవగానం అప్పట్లోనే ఆరంభమయింది. సంఘ వ్యవస్థమీద విప్లవ ధ్వజమది. "కదం తొక్కుతూ, పదం పాడుతూ" మానవుడు నూతన జగత్తువైపు తరలిపోవాలని ఆయన ప్రబోధం. అన్యాయంతో నిండిన సమాజాన్ని సమూలంగా మార్చివేయాలని శ్రీశ్రీ ఆవేశం.




"భావ చైతన్య ఉద్యమం"

ఇన్నిరకాల రచనలు నాలో ఆలోచనల్ని రేకెత్తించినాయి. సాహిత్యం ఇలా మారిపోతున్నదేమిటి? ఇందులో ఏదైనా అంతరార్థం ఉన్నదా అని తెలుసుకోడానికి ప్రయత్నించాను. చదవగా, ఆలోచించగా నాకు సమాధానం దొరికింది: సాహిత్యం సమాజ దర్పణం. సమాజ ప్రవృత్తిలోని మార్పు, సాహిత్యరీతిలో ప్రతిబింబించితీరుతుంది. అది జరగకపోతే సాహిత్యానికి ప్రయోజనమే లేదు. ఆదిలో పాత జీవితాన్ని చూపించే కావ్యసృష్టి, తరవాత క్రొత్తదనానికి, స్వేచ్ఛకు ఆరాటపడే హృదయంలో నుండి పొంగిన భావకవిత్వం, దానితోనూ తృప్తిచెందక సమాజాన్ని సమూలంగా మార్చాలనే ఆవేశంలో నుంచి ఆవిర్భవించిన ప్రగతి కవిత్వము, వాటి నిజతత్వాలతో నాకు ద్యోతకమయినాయి.

మారుతున్న మానవుణ్ణి ఎత్తిచూపుతున్నాయి ఈ కవితారీతులన్నీ. సమాజాన్ని మార్చమంటున్నాయి. బాగానే వుంది. సమాజానికి మూలకందం మానవుడు కదా! కనక మనిషిలో భావ చైతన్యం లేకపోతే, ఏ ప్రగతి సాధ్యం కాదు. అందుకని అతని ఆలోచనా విధానాన్ని మార్చాలి అనే ఉద్యమాన్ని చూశాను. కందుకూరి వీరేశలింగం, త్రిపురనేని రామస్వామి ఈ ఉద్యమానికి మూలపురుషులుగా అగుపించారు నాకు. రాజకీయ బానిసత్వంతో పాటు, మానసిక బానిసత్వం నుంచి కూడా భారతీయుడు విముక్తి చెందాలి. తన విమోచనా మార్గాన్ని తన వివేకంతో తానే నిర్మించుకోవాలి అనే వాదం నాకు నచ్చింది. ఇవన్నీ 19 వ శతాబ్దిలోని వికాసోద్యమం, 1930 తరవాత ఉద్భవించిన రాజకీయ, సాంఘిక ఉద్యమాల




ఫలితం అని అర్థం చేసుకొన్నాను. కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు వేరు వేరుగా స్థావరాలు ఏర్పరచుకొన్నారు. వారి ప్రచారాలు, ప్రభావాలు పెరిగినాయి. వాటిలో విశిష్టంగా యం. యన్. రాయ్ బయటకు వచ్చారు.

"యం. యన్. రాయ్. ప్రభావం"

అప్పుడు కలకత్తా యూనివర్శిటీలో చదువుకొంటున్నాను. 1936, 1937 సంవత్సరాలు అవి. అప్పటికే మార్క్సిజం ఆసక్తితో చదివి ఉన్నాను. ఆ నూతన తాత్త్విక చింతన నన్ను ఆకర్షించింది. ఆకలి దప్పులతో అలమటించే ఆర్తులు, మనుషులుగా జీవించగలరా! ఆ సమాజం ఎంత కుళ్ళుగా ఉంటుంది? ఎంత జుగుప్సను కలిగిస్తుంది! ఈ సమస్యను

తీర్చడానికి విప్లవం తప్ప మరో మార్గం లేదన్నాడు మార్క్స్. ఈ విధంగా మానవాళి అంతరంగాన్ని మేల్కొలిపాడు ఆ తాత్త్వికుడు. ఆ తత్త్వ చింతనకు రూపకల్పన చేసినవారు లెనిన్, మావోలు. మానవ చరిత్ర గతిని ప్రభావితం చేసిన వీరి వ్రాతలు, చేతలు ఆసక్తితో పరిశీలించడం మొదలు పెట్టాను.

అందుకు కారణం 'అమృత బజారు' పత్రికలో యం. యన్. రాయ్ వ్రాసిన వ్యాసావళి. అంతకు ముందే ఆయన జైలు నుంచి విడుదలై బయటకు వచ్చాడు. మహా మేధావి, తాత్త్వికుడు కావడంచేత మానవ ప్రయోజనాలను, భారతీయ సమస్యలను క్రొత్త కోణం నుంచి చూడడం,




చూపించడం మొదలుపెట్టాడు. మానవ ప్రగతికై జరుగుతున్న ఉద్యమాలను మౌలికంగా పరిశీలించిన వాడు రాయ్. అలనాడు బుద్ధుడు, ఇప్పట్లో రాయ్.... వీరిద్దరూ మానవుణ్ని సమాజానికి కేంద్రంగా, సూత్రధారుడుగా స్వీకరించారు. వ్యక్తిగతమైన మానవుణ్ణి మనిషిగా మలచ గలిగితే, నూతన శకారంభం జరగగలదని ఈ ఆలోచన సారాంశం. అది నాకు సబబుగా కనిపించింది.

1939 నుంచి 1945 వరకు జరిగిన రెండవ ప్రపంచ యుద్ధం మన దేశంలో బ్రహ్మాండమైన మార్పులను తెచ్చి పెట్టింది. దానితో పాత సామ్రాజ్యాల నడుములు విరిగినై. బానిస దేశాలకు రాజకీయ స్వేచ్ఛ వచ్చింది. ఆ స్వేచ్ఛ మనకూ వచ్చింది. 1947 ఆగస్టు 15న

నవ యౌవనంలో ఉన్న నేను దేశానికి మహోదయం రాబోతున్నదని ఆశపడ్డాను. ఉత్సాహంతో ఊహాలోకంలో విహరిస్తూ ఉండేవాణ్ణి.

"ఆశాభంగం"

అయితే ఆ ఉత్సాహం ఎక్కువ రోజులు నిలవలేదు. హిందువులు, మహమ్మదీయులు ఒకళ్ళని ఒకళ్ళు ఊచకోతలు కోసుకొన్నారు. భారత్, పాకిస్తానుల మధ్య నవతుల పోరాటం ప్రారంభమైంది. దేశము, మనిషి, మనసు కూడా రణరంగం క్రింద మారిపోయినై. మారణహోమం నిత్య కార్యక్రమమైంది. దౌర్భాగ్యం ఆవరించి వున్న అశేష ప్రజానీకానికి నూతన జీవితాన్ని నిర్మించే కార్యక్రమం కాక, ఒకర్ని ఒకరు చంపుకునే మతోన్మాదం పిచ్చటిల్లిపోయింది. గాంధీగారి ఆత్మాహుతి కూడా ఆ అగ్ని జ్వాలలను ఆర్పలేకపోయింది. ఈ ఉన్మాదం దేశాన్ని నవ్వులపాలు చేయడమే కాక, దాని ప్రగతికే అడ్డుగోడగా నిలిచిపోయింది. గాంధీ గారు అమరులైన 1948 జనవరి 30 వ నాలో ప్రజ్వరిల్లిన భావాలివి. రాజ్యాధికారం రాగానే కులతత్వం పెరిగింది. పదవుల కోసం జరిగే ప్రాకులాటలో కులాల ప్రాబల్యం ఆకాశపథానికి అంటుకొన్నది. సమా జాన్ని మతము, కులము చీలికలు చీలికలుగా చీలుస్తున్నాయి. అగ్నికి ఆజ్యంగా, పీటికి తోడు ప్రాంతీయ దురభిమానము, భాషోన్మాదము. ఇవి చూస్తే ఎంత ఆవేదన కలుగుతుంది మనస్సుకి

1950 జనవరి 26 వ క్రొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చింది. అప్పటికే న్యాయవాదిని అయి ఉండడంచేత, దాని ఆశయాలను ఆకళింపు చేసుకోగలిగాను. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నిలుపుకుంటూ, శ్రేయో రాజ్యాన్ని స్థాపించుకోవాలి. మత, కుల ప్రమేయంలేని పరిపాలనను ప్రవేశపెట్టుకోవాలి. ఈ ఆశయాలు ఆదర్శవంతంగానే ఉన్నాయి.

అయితే ఆచరణ ఎలా? దానికి చిత్తశుద్ధి కావాలి. పౌరులలో జాగృతి కావాలి. నాయకులలో నిజాయితీ కావాలి. ఎలా వస్తాయి ఇవన్నీ?

ఇవి పైనుంచి ఊడిపడేవి కావు. ఎవరో ప్రసాదించే వరాలు కావు. ప్రతి ఒక్కరూ ఆత్మపరిశీలన చేసుకొని సంతరించుకోవలసిన గుణాలు ఇవి. ఎవరి డైరీనుంచి వారు తమ జీవితాలను పునర్దర్శనం చేసుకొని, చక్క దిద్దుకోవలసి ఉంటుంది. అదే సామాన్య మానవుని డైరీ ప్రయోజనం.

(జులై 1965)

# ఆంధ్రులారా! ఆత్మగౌరవం కాపాడుకోండి

ఆంధ్ర రాష్ట్రము, తదుపరి ఆంధ్ర ప్రదేశ్
సాధించాము. అధికారం కోసం ఆత్మగౌరవాన్ని
అమ్ముకొంటూ నాయకులు రాజకీయాలను
అధోగతి అగాధంలోకి త్రోసివేశారు.

ఈ విషాద చరిత్ర పునరావృత్తం కాకుండా తెలుగు
జాతి అప్రమత్తంగా వ్యవహరిస్తూ ఎన్నికలలో పదవులకై
తగవులాడుకునే రాజకీయ వర్గాలకు గుణపాఠం చెప్పాలి.

శార్వరి కూడా వెళ్ళిపోయింది. ఒక్క శార్వరి నామ సంవత్సరమే కాదు, ఆంధ్ర ప్రదేశం ఏర్పడి నాలుగేళ్ళు గడిచిపోయింది. అంతకుముందు ఆంధ్ర రాష్ట్రమొచ్చి మరొక మూడేండ్లయినది. ఈ ఏడేండ్లకు తెలుగు వారు ఏమి సాధించినట్లు ?

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వుంటే తెలుగు దేశం బాగుపడటం లేదని ఆందోళనపడ్డాము. తెలుగు నదులకు ఆనకట్టలు పడవని బాధ పడ్డాం. తెలుగునాడులో పరిశ్రమలు పెరగవని సంశయించాం. తెలుగు గ్రామాలకు విద్యుచ్ఛక్తి ప్రసరించదని భయపడ్డాము. తెలుగు దేశంలో సౌకర్యాలు విస్తరించవని, తెలుగువారి విశిష్టత, నాగరికత వికసించదని, భీతిగొన్నాం. ఢిల్లీలోను, దేశంలోను తెలుగువారికి గౌరవం వుండదని, గౌరవం రాదని ఆవేదనపొందాం. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం తెచ్చుకుని ఏమి విజయం సంపాదించాం?

ప్రత్యేక రాష్ట్రం కావాలని నలభై ఏళ్ళు ఉద్యమం నడిపాం. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఉద్యమానికి నాయకులమయినాము. ఆందోళన చేశాము. పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ చేశాడు. దానిని పురస్కరించుకొని ఆంధ్రావని అంతా పెల్లుబికింది. ప్రత్యేక రాష్ట్రం కోరింది. ప్రధాని కది లాడు. భారత ప్రభుత్వం కదిలింది. ఆంధ్ర రాష్ట్రం వచ్చింది. ఆంధ్ర రాష్ట్రాగమనంతో భారత చరిత్రలోనే నూతనాధ్యాయం ఏర్పడింది. స్వదేశ సంస్థానాల రద్దుతో నూతన రూపం దాల్చిన భారత చిత్రం భాషా ప్రయుక్త రాష్ట్రాలతో మరొకసారి రూపం మారవలసివచ్చినది. ఇంత గట్టిగా గచ్చపొద కదిలించాం. రాష్ట్రం సాధించాం. ఇంతటి ఘన విజయం సాధించి, మనం పొందినది ఏమిటి ?

"మనం సాధించిన దేమిటి ?"

మొదట ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రం తెలుగు గడ్డలో ఒక భాగము మాత్రమే. ఈ భాగంతో మనం తృప్తి పడలేదు. విశాలాంధ్ర ఆశించాము.

తిరిగి జయం పొందాం. పూర్వపు హైదరాబాదు రాష్ట్రాన్ని విభజించారు. అందులోని తెలుగు భాగాన్ని ఆంధ్ర రాష్ట్రంతో కలిపారు. ఆంధ్ర ప్రదేశం ఏర్పడింది. అయితే ఈ విశాలాంధ్రాన్ని ఏర్పరచుకొని మనం సాధించిం దేమిటి ?

ఆంధ్ర రాష్ట్రం కోసం, ఆంధ్ర దేశం కోసం, ఆందోళన చేస్తూ వాటిని సాధించటం కోసం కొన్ని ప్రదేశాలను పోగొట్టుకున్నాం. మద్రాసును వదులుకున్నాం. మద్రాసు రాష్ట్రానికి కామధేనువుగా వున్న మద్రాసు నగరాన్ని, దాని రాబడిని, దాని పరిసంపదలను, వాటిలోని మన భాగాన్ని విసర్జిస్తే తప్ప, త్యాగం చేస్తే తప్ప మనకు ప్రత్యేక రాష్ట్రం




రాలేదు. ఆ త్యాగం చేశాము. అలాగే బళ్ళారి వదులుకున్నాము. బరంపురం వదులుకున్నాము. మైసూరులోని తెలుగు ప్రాంతం కోలారుకు తిలోదకాలు ఇచ్చాం. మధ్య ప్రదేశంలోని చాందా మొదలైన తెలుగు ప్రాంతాలకు హక్కు వదులుకున్నాం.

ఇన్ని వదులుకొని, ఇంత త్యాగం చేసి ఆంధ్రప్రదేశం సంపాదించు కున్నాం. అయితే మనకు ఒనగూడిన దేమిటి? ఇంత చేసిన పిమ్మట మనకు ఒరిగినదేమిటి ? మనము పాముకున్నదేమిటి ?

అవును, కొంతమందికి మంత్రి వుద్యోగాలు వచ్చినాయి. కొద్ది మందికి జడ్జీ ఉద్యోగాలు వచ్చినాయి. మరికొద్దిమందికి మరికొన్ని పెద్ద

ఉద్యోగాలు వచ్చినాయి. ఆ మాట నిజమే.. ఉద్యోగాలు అవసరమే. అయితే వాటికి ఆశించేనా, ఈ భగీరథ ప్రయత్నమంతా జరిగింది?

లాభ నష్టాలు బేరీజులు వేస్తే దురదృష్టవశాత్తు అంతకుమించి ఉపయోగాలు కనిపించడం లేదు.

### "ఆంధ్రులపై చిన్నచూపు"

ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వంలో తెలుగువారి గౌరవం ఏమైనా పెరిగిందా? వారి మాటకు విలువ పెరిగిందా? వారి కోరికలకు మన్నన




హెచ్చిందా? అవునని ఎవరనగలరు? "వెర్రివాడి భార్య వాడకట్టు కంతకు వదినే" అన్న సామెతగా వున్నది తెలుగువారి పరిస్థితి. కేంద్ర మంత్రా లయంలో తెలుగువారు ఎంతమంది? మిగతా భాషా ప్రాంతం వారితో పోల్చి చూస్తే తెలుగువారు ఎన్నోవంతు? ఉద్యోగాల సంగతి అటుంచుదాం. అఖిల భారత సాహితీ సమ్మేళనాలలో, సంగీత సభలలో, లలిత కళా విశే షాల్లో, శాస్త్రీయ పరిశోధనలలో తెలుగువారి స్థాన మేమిటి? చెప్పుకోదగ్గ పాత్ర కాదు తెలుగు వారిది. అర్హతను బట్టి వుండవలసిన స్థానం కాదు తెలుగువారిది.

సాంస్కృతిక విషయాలు అటు వుంచుదాం. ప్రతి ఏడాదీ చేర్చు కునే ఐ. ఎ. యస్. మొదలైన ఉద్యోగాల జాబితాలు చూడండి. తెలుగు

వారు ఎంతమంది ఉన్నారు? నూటికి ఒకరు కూడా ఉండరు. అయితే జనాభాలో తెలుగువారు పన్నెండవ వంతుదాకా ఉన్నారు. కాబోయే ఉద్యోగస్థులందరూ, అధికారులందరూ, ఆంధ్రేతరులే కదా! ఆంధ్ర ప్రదేశానికి కూడా ఆంధ్రేతరులు రావలసిందే కదా!

ఉద్యోగాల మాట అటుంచి నిర్మాణాత్మకమైన కృషిలో కేంద్రం నుంచి ఆంధ్ర ప్రదేశం పొందిన ప్రయోజనాలు ఏమిటి? ఇది పరిశ్రమల రంగం కదా! పరిశ్రమల పెరుగుదల మీదనేకదా దేశ భవిష్యత్తు యావత్తూ ఆధారపడి వున్నదని విశ్వసిస్తున్నాము. ఆ విశ్వాసంతోనే దేశం నలు మూలల్లో పరిశ్రమలు నెలకొల్పుతున్నది భారత ప్రభుత్వం ఇన్నేళ్ళుగాను. తెలుగు దేశానికి ఇచ్చిన పరిశ్రమలు ఏమిటి? కేంద్రం ఆంధ్రప్రాంతంలో నెలకొల్పిన పరిశ్రమ ఇంతవరకు ఒక్కటి కూడా లేదు. దీని ఫలితమేమిటి? శాశ్వతంగా భారత భూమిలో వెనుకబడ్డ జాతులకు చెందినవారుగా తెలుగు వారు నిలిచిపోవలసినదే కదా!

పోతే వ్యవసాయ రంగంలోనైనా ముందంజ వేశామా అంటే అదీ లేదు. నూరేళ్ళనాడు కాటన్ దొర కట్టిన కృష్ణా, గోదావరి నదుల ఆనకట్టలే ఈనాటికీ తెలుగు వారి పాడిపంటలకు ఆధారాలు. మొదలు పెట్టిన ఒక్క ఆనకట్ట నాగార్జున సాగరం కూడా ఇంకా తాబేలు నడక నడుస్తున్నది.

## "తెలుగు గంగకు అగచాట్లు"

ఇది ఇలా ఉండగా మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్టుగా నదీ జలాల తగవు వచ్చిపడింది. 1951 లో చేసుకున్న ఏర్పాటు అది. ఏర్పాటే కాదు, ఒడంబడిక. అయితే నేమి! తెలుగువారి చేతగానితనాన్ని చూచి, వారి అంతఃకలహాలు చూసి వారి మాటకు కేంద్రంలో మన్ననలేదనే రహస్యాన్ని గ్రహించి మైసూరు, మహారాష్ట్ర ప్రభుత్వాల అంగీకారంతో చేసుకున్న 1951 ఒడంబడికను కాదన్నవి. నోరుగల వానిది రాజ్యం.

బలవంతుని తప్ప బలపరచని మన కేంద్ర ప్రభుత్వం ఒడంబడికలను ఆవల ఉంచి, రాజీచేస్తానని చెబుతున్నది. ఢిల్లీలో వున్న కొంతమంది ఆంధ్ర నాయకులు ఆంధ్రలోని అంతఃకలహాలను పురస్కరించుకొనో, మరేమి దురదృష్టమో కాని, వారుకూడా శల్యసారధ్యం చేశారు. రాజీ సంప్రదింపులు అవసరమని సలహా ఇచ్చారు. రాజీ అంటే ఏమిటి? ఉన్నది కొంత వదులుకోమనే కదా! 1951 లో జరిగిన ఒడంబడిక 1961 లో మార్చ డానికి వీలయితే 1971 లో తిరిగి దానిని ఎందుకు మార్చకూడదు? తెలుగు వారు చేతకాని వారయితే ఈ దౌర్భాగ్యపు పని జరుగుతూనే వుంటుంది. తెలుగువారు ఎంత చేతగానివారు కాకపోతే కొత్త ఒడంబడిక కుదిరేవరకు నాగార్జున సాగర్ నిర్మాణానికి ధనం ఇవ్వవద్దని కేంద్రాన్ని మైసూరు, మహారాష్ట్ర ప్రభుత్వాలు కోరుతున్నవి.

కేంద్రసహకారం సవతితల్లి చూపుగా వున్నప్పటికీ, పోనీ మనరాష్ట్ర ప్రభుత్వమైనా పరిస్థితులు చక్కదిద్దుకుంటుందా అంటే అదీ కనిపించటం లేదు. కొత్త పరిశ్రమలు లేవు. కొత్త సంస్థలు లేవు. కొత్త వ్యవస్థలు లేవు. కదుతున్న ప్రాజెక్టులు పెండ్లి నడకలతో కదులుతూ వుంటే, కట్టిన కడిం ఆనకట్ట బద్దలై ఊరుకొంది. నూతన విద్యుచ్ఛక్తి కేంద్రాలు లేవు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆరంభించిన మాచ్‌ఖండ్ కేంద్రంనుంచి వచ్చే విద్యుచ్ఛక్తినే ఇప్పుడు మెల్లిగా గ్రామాలకు పంచిపెడుతున్నారు. రాష్ట్రం వచ్చినందుకు, పట్టుబట్టి రాజధాని నగరమగు కర్నూలులో కొన్ని కోట్లు ఖర్చుపెట్టారు. ఆ ఖర్చులో కర్నూలు నగరవాసులకైనా కొంతైనా వుపయోగించిందా అంటే సందేహాస్పదమే. కావాలని కేసీ కాలువమీద మితిమీరిన ధనాన్ని వ్యయం చేసింది రాష్ట్ర ప్రభుత్వం. దానిమీద కమిటీ నివేదిక చదివితే కనిపిస్తుంది. ఆ కాలువ చోద్యం దానిమీద జరిగిన దుర్వ్యయం.

రాష్ట్రం సంపాదించి సాంస్కృతికంగా తెలుగువారు ముందుకు పోయినది ఏమీ లేదు. ఇంకా సుగమ సంగీతం మీదనే, చిన్న కథా రచన

ఘుదనే వుంది తెలుగువారి మోజు. శాస్త్రీయ, సాంకేతిక విషయంలో చిట్ట చివర ఎక్కడో వెనుకనే వున్నాము.

“గ్రామ సింహాల కొట్లాట”

ఇక రాజకీయాలలో అధోగతిని, అగాధాన్ని అందుకున్నాం. మరీ ఏడాదినుంచి ఆంధ్రలో జరిగిన అల్లకల్లోలం తెలుగువారంతా సిగ్గు పడ వలసిన విషయమే. పెండ్లి యింటివద్ద గ్రామసింహాలు పోట్లాడేటట్లు జరిగింది ఆ తగవు. బయట తెలుగుదేశపు సమస్యలు అధ్వాన్నమవు తున్నవి. పరిశ్రమలన్నీ యితర రాష్ట్రాలకు తరలిపోతూ వుండే నదీ



జలాలకొరకు ఇతరులు హక్కులు సంపాదించుకొంటూ వుండే రాష్ట్రం పురోగమించవలసిన సమయం శరవేగంతో దూసుకుపోతూ వుండే తెలుగు నాయకులు అధికారానికై అంతఃకలహాలలో పడి మునిగిపోయారు.
అధికారం తప్ప ఆంధ్రదేశపు ప్రగతి వారికి పట్టలేదు. రోము దహన మవుతుంటే ఫిడేలు వాయించుకొన్న నీరో చక్రవర్తిని మరపించారు మన నాయకులు.

ఇంత తాపీగా పోరాడుతున్న నాయకులు శార్వరి సంవత్సరం కూడ గతించిపోవడం చూశారు. నూతన సంవత్సరంలోనే తిరిగి ఎన్నికలని గమనించారు. ఎన్నికల ద్వారానే తిరిగి పెత్తనంలోకి వచ్చేది. ఎన్నికల కొరకు ఒక ఒడంబడిక చేసుకున్నారు.

ఆ ఒడంబడిక ఎటువంటిది? వారిలో వారి తగవును తీర్చుకోడానికి ప్రజాధనం వినియోగించి, మరి నల్గురు మంత్రులను నియమిస్తారట. క్రొత్తగా నల్గురు మంత్రులను నియామకం చేస్తే లోగడ చేసిన దుండగాలన్నీ మరచిపోతారట. ఇది మనము గమనించి గౌరవించాలి. దీనికితోడు మంత్రిమండలిని నియమించే హక్కు ముఖ్యమంత్రిదై వుండగా ఈ ఒడంబడిక ప్రకారం కొంతమంది మంత్రులను నియమించే హక్కు ముఖ్యమంత్రి కానివారి కివ్వబడిందని వార్తాపత్రికల భోగట్టా. ఇదే వాస్తవమైతే ఇది శాస్త్ర విరుద్ధం, చట్ట విరుద్ధం. పార్టీ స్వభావాల కొరకై, వ్యక్తి లాభాల కొరకై, రాజ్యాంగ సిద్ధాంతాన్ని వమ్ము చేయడం సహించకూడని పని.




అలా జరగకుండా చేయవలసిన బాధ్యత తెలుగు ప్రజాభిప్రాయం మీద వున్నది. తిరుగులేని మెజారిటీని ఏ పక్షం వారికి ఇచ్చినప్పటికీ యీ విషాద గాథ పునరావృత్తమవుతుంది. అధికారంలో వున్నవారిని అదుపాజ్ఞలలో పెట్టుకొనేశక్తి తెలుగువారికి లేకపోవడంచేత నేటి దుస్థితి ఏర్పడ్డది. అంతఃకలహాలు పెరిగి తెలుగు తేజస్సు సన్నగిల్లింది.

శార్వరిలో జరిగిన విషాద చరిత్ర చూచిన తదుపరి అయితే ఆంధ్ర ప్రజలు అప్రమత్తులై వుండాలి. తీవ్రమైన ప్రజాభిప్రాయాన్ని పెంపొందించాలి. రాబోయే ఎన్నికలలో పదవులకై తగవులాడే రాజకీయ వర్గాలకు గుణపాఠం నేర్పాలి.

(1959)

# ఎక్కడకు పోతోంది వర్ణ సమాజం?

కుల తత్వానికి ప్రధాన కార్యరంగం రాజకీయ క్షేత్రం. ఈ రాజకీయ క్షేత్రం నుంచి కుల తత్వాలను ప్రక్షాళనం చేస్తే కుల తత్వం సన్నగిల్లడం ప్రారంభమౌతుంది.

కులాంతర వివాహాలు, సహపంక్తి భోజనాలు తదితరమైన అభ్యుదయకర చర్యలూ ఈ కుల నిర్మూలనోద్యమానికి దోహదం చేస్తాయి.

కులతత్వాలు పోవాలి. అది అందరూ అనే మాటే. అందరూ అంగీకరించే భావమే. అయితే ఆచరణలో మాత్రం అమలుకావడం లేదు. కులతత్వాల విషయంలో చెప్పేది ఒకటి, చేసేది వేరొకటిగా వుంది. రాజ్యాంగ చట్టం వచ్చి చాలా కాలమైంది. ఈ కులతత్వాన్ని నిర్మూలించ డానికి రాజ్యాంగం ప్రయత్నించింది. అవకాశాలు ఇవ్వడంలో పౌరునికి, పౌరునికి మధ్య కుల ప్రాతిపదికపై వ్యత్యాసం ఉండకూడదని మన రాజ్యాంగం అనుశాసిస్తున్నది. అట్టి వ్యత్యాసం చట్ట విరుద్ధమని చాటు తున్నది.




మన రాజ్యాంగం కుల, మత ప్రాధాన్యం లేనిది. రాజకీయ వ్యవ హారాలేవీ కుల, మత ప్రాతిపదికపై చేయరాదు. భారతీయ రాజ్యాంగ కర్తలు కులమత విచక్షణలేని రాజ్యాంగ విధానాన్ని ఆశించారు, అను శాసించారు. అందువల్ల ఈ కులమత విచక్షణలు, వ్యత్యాసాలు అంత ర్జాతీయంగా మనలను, మన జాతిని బలహీనపరుస్తాయి. జాతీయంగా మనను తరగతులు తరగతులుగా విభజించాయి. ఐక్యత లేకుండా చేశాయి. మానవత్వాన్ని నాశనం చేస్తున్నాయి.

ఇంతటి ప్రమాదం ఈ కులమత భేదాలలో వుందని అందరూ ఎరుగుదురు. భారత జాతికి ఇందువల్ల వాటిల్లే ముప్పును అందరూ గుర్తిస్తారు.

అయినా ఈ కులతత్వం మన సంఘంలో, మన దేశంలో సమసి పోయిందని అనగలమా ? కనీసం తగ్గుముఖం పట్టిందని అనగలమా ? ఆ మాట అనగలవారు సాహసవంతులై వుండాలి. సత్యాన్ని పెద్దగా గుర్తించని వారై వుండాలి.

## “ నరనరాల కులతత్వం ”

ఈ కులతత్వం తేలిగ్గా సమసిపోయేది కాదు. అది మన భారత జాతి, ముఖ్యంగా హైందవ సంఘపు ప్రతివాడిలోను ఇంకిపోయింది, జీర్ణించుకు




పోయింది. వర్ణాశ్రమ ధర్మంతో ఆరంభమైన కులతత్వమిది. ఈ కుల తత్వాన్ని ఆనాటి వర్ణాశ్రమ ధర్మం అంగీకరించలేదా అన్నది కాదు ప్రశ్న. ఆ వర్ణాశ్రమ ధర్మాలనుంచి, ఆ సూత్రంనుంచి, ఆ భావననుంచి పుట్టుకు వచ్చిందే ఈ కులతత్వం. అందువల్ల ఈ కులతత్వం మతం ప్రాతి పదికపై, ధర్మం ఆధారంపై పెరుగుకుంటూ వచ్చింది. అందుచేనే దానికంత బలం, అంతటి శక్తి. వేలకొలది సంవత్సరాల తరబడి పెరిగి పెద్దదై, సర్వవ్యాప్తమై సమాజ జీవితాన్ని, గమనాన్ని కలుషితం చేస్తున్నది. నిజమైన ఐక్యత, పురోగమనం భారతీయులకు లేకుండా చేస్తున్నది.

మతము, ధర్మము పెంపొందించిన ఈ కులతత్వపు సంప్రదాయం స్వాతంత్ర్యం వచ్చాక, దురదృష్టవశాత్తు పెచ్చుపెరిగింది, విచ్చటిల్లింది.

స్వరాజ్యం వచ్చాక పౌరుల విజ్ఞానం, వివక్షణ పెరిగి ఇట్టి వ్యక్తిగత స్థావాలు సన్నగిలి వుండవలసింది. వీటి ప్రభావం తగ్గి వుండవలసింది. అలా జరగలేదు సరికదా పైగా వాటి విలయతాండవం ఎక్కువైంది. వాటి పలుకుబడి విపరీతంగా పెరిగిపోయింది.

అందుకు కారణం స్పష్టంగానే కనిపిస్తుంది. వచ్చింది స్వరాజ్యం కదా! సొంత పెత్తనం కదా! పరిపూర్ణమైన అధికారం భారతీయుల హస్తగతం అయింది కదా! అందునా వచ్చింది ప్రజాస్వామిక రూపమైన అధికారము. అందువలన అధికారంలోకి రాకోరిన ప్రతి రాజకీయపు వ్యక్తి పదిమందిని ఆకట్టుకోవాలి. తన బలాన్ని పెంచుకోవాలి. తన పలుకుబడిని విస్తరింపచేసుకోవాలి. కుల ప్రాతిపదికపై చెక్కలు ముక్కలు అయి వున్న సంఘంలో త్వరలో ప్రాబల్యంలోకి రావాలంటే ఎవరైనా సరే ఈ కులాల ప్రాపకాన్ని అపేక్షించక తప్పదు. ఏ ప్రాంతంలో ఏ కులం ఆధిక్యత వహించివుంటుందో, ఆ కులానికి చెందిన వ్యక్తులు అక్కడ ప్రాబల్యం పొంది వుంటారు. వారే రాజకీయ నాయకులవుతున్నారు, శాసన సభ్యులవుతున్నారు, పెత్తందారులవుతున్నారు.

మిగతా ఉద్యోగాలు, అవకాశాలు కూడా వాటిని బట్టే పంచబడుతున్నాయి. ఈ విధంగా స్వరాజ్యం వచ్చిన పిమ్మట కులతత్వపు ప్రభావం విపరీతంగా పెరిగిపోయింది.

వీటికి తోడు వెనుకబడిన కులాలు మరికొన్ని వున్నాయి. తర తరాల నుంచి ప్రత్యేకావకాశాలను అనుభవిస్తున్న కులాలతో పాటు వెనుకబడిన వారిని కూడా జోడిస్తే ఈ ప్రజాస్వామికంలో అన్యాయం జరగవచ్చు. అందుకని వెనుకబడి వున్న కులాలవారికి రాజకీయంగా కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కూర్చబడ్డవి శాసనసభలకు కూడా కొన్ని నియోజక వర్గాలు వారికై కేటాయించబడ్డవి ఈ కేటాయింపు సాంఘిక



6

న్యాయపు దృష్ట్యా అవసరమే. అయితే ఈ ప్రత్యేకపు ఏర్పాట్లు కుల తత్వాలను పెంచి పోషిస్తున్నవనడానికి మాత్రం సందేహం లేదు.

ఈ విధంగా కులతత్వం ఉండకూడదని రాజ్యాంగంలో పొందు పరచబడివున్నప్పటికీ, ఆ సూత్రాన్ని అందరూ అంగీకరించి, గుర్తించి నప్పటికీ ఆచరణలో మాత్రం అది విపరీతంగా అమలుజరుగుతున్నది.

"తరుణోపాయము"

ఈ విషమ పరిస్థితినుంచి తరుణోపాయం లేదా? లేకేమి, ఉంది. మనుషులు చిత్తశుద్ధితో దేనినైనా సంకల్పించాలేగాని దానిని సాధించ




గలరు. మానవుల ఉపజ్ఞ అటువంటిది. ఈనాటి కులతత్వానికి ప్రధాన కార్యరంగం రాజకీయ క్షేత్రమైంది. అందువల్ల కుల తత్వాన్ని అరికట్టే ప్రయత్నం రాజకీయరంగంలో ప్రారంభం కావాలి.

ఇప్పుడు ఎక్కడ ఏ కులంవారు అధిక సంఖ్యలో వుంటారో, ఆ నియోజక వర్గానికి, ఆ కులపువారినే అభ్యర్థులుగా రాజకీయ పక్షాలన్నీ సర్వ సామాన్యంగా పెట్టుకుంటున్నారు. ఆ పద్ధతి మానేసి అల్ప సంఖ్యాకులైన కులాల వారినే అభ్యర్థులుగా ఏర్పాటు చేసుకుంటే అధిక సంఖ్యగల కులాల వారి పట్టుదల పెద్దగా వుండదు. అప్పుడు కులాన్ని బట్టిగాక, అభ్యర్థిని బట్టి అతని కార్యక్రమాన్ని బట్టి ఓట్లు వేయడం జరుగుతుంది. సమాజ సమైక్యతను కేవలం మాటల్లోనేగాక చేతల్లోకూడా సాధించి చూపెట్టాలంటే,

రాజకీయ పక్షాలవారంతా ఒక ఒడంబడికకు రావచ్చు. దానికై ప్రత్యేకంగా ఒక చట్టాన్ని చేయనవసరం లేదు. పెద్ద మనుషుల ఒడంబడికతో దానిని అమలు జరుపవచ్చును.

రెండపది ఉద్యోగుల ఎన్నిక. ఇందులో కుల ప్రభావం పెద్దగా వుండే అవకాశం వుంది. కనుక ఉద్యోగుల నియామకంలో జాగ్రత్త తీసుకోవలసి వుంటుంది.

కులాంతర వివాహాలు, సహపంక్తి భోజనాలు, కుల తత్వాన్ని రూపుమాపడానికి బాగా ఉపకరిస్తాయి. వీటికి తోడు విద్యార్థుల ఆలోచనా రంగంలో కులతత్వం ప్రవేశించకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. పాఠశాలల్లో, కళాశాలల్లో, ఎక్కడా ఎప్పుడూ కుల ప్రమేయం లేని పద్ధతి అక్షరాల అమలు జరగాలి. అప్పుడు వారు భావిపౌరులైనా కుల విభేదాలను విస్మరించగలుగుతారు.

ఇవీ, ఇట్టివీ కులతత్వంనుంచి బయటపడే తరుణోపాయాలు చాలా కనిపిస్తాయి. అయితే ఆ ఆశయాన్ని సాధించాలంటే సమాజ సభ్యులకు, నాయకులకు స్థిరసంకల్పం కావాలి. అంతకు మించి చిత్తశుద్ధి వుండాలి.

(జూన్ 1962)

# కులం-కుటుంబం ఆస్తి-వ్యవస్థలు

జీవకోటిలో విశిష్టమైన మానవుడు ఓ సంఘజీవి. మానవుని భౌతిక అవసరాల సాధనకు సంప్రదాయాలు ఆవిర్భవించాయి. జీవిత అస్తిత్వానికి అవసరమైన నియమాలే సంప్రదాయాలు. ఆనాటి అవసరాల నిమిత్తం ఏర్పడిన వేదకాలంనాటి వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ ఈనాడు హేతువాద బద్ధం కాదు.

సంప్రదాయానికి, మార్పుకు పరమ వైరము. అయినప్పటికీ సంప్రదాయాలు మారుతూనే వున్నవి. క్రొత్తవి పుడుతూనే వున్నవి. ఎందుకనగా: మానవుడు మారుతున్నాడు కనుక, అతని భావాలు మారుతున్నవి కనుక. అతని చుట్టూవున్న పరిస్థితులు మారుతున్నవి కనుక.

అసలు సంప్రదాయాలంటే ఏమిటి? అవి ఎలా పుట్టుకు వస్తవి? ప్రాణికోటి కంతటకు, భౌతికమైన అవసరాలు కొన్ని ఉన్నవి. ఆహారం తినాలి, ద్రవపదార్థం త్రాగాలి, కామేచ్ఛ తీర్చుకోవాలి. బడలిక తీర్చు కోవడానికి విశ్రాంతి తీసుకోవాలి. ఈ అవసరాలు నిత్యం కలుగుతూనే వుంటవి కనుక, నిత్యము వాటిని తీర్చుకొనవలసినదే. నిత్యకృత్యములైన అలవాట్లు, సంప్రదాయాలకు దారితీసినవి, సంప్రదాయాలుగా రూపొందినవి.

"మానవుని విశిష్టత"

మిగతా ప్రాణికోటికీ, మానవులకు భౌతికావసరాలు సమానములే. అయితే మానవులలో ఒక విశిష్ట లక్షణముంది. మిగతా ప్రాణికోటిలో లోపించిన ప్రత్యేకమైన శక్తి మానవులకున్నది. అది బుద్ధిబలము. ఆ బుద్ధిబలము మానవులకు ఆలోచనా శక్తిని, పరిశీలనా శక్తిని ప్రసాదించినది, కార్యకారణ విచక్షణను సమకూర్చినది. వారిని హేతువాదావలంబకులుగా చేసినది.

మానవులలో పనిచేసే ఈ కార్యకారణ విచక్షణ వారిలో స్వేచ్ఛా ప్రియత్వాన్ని రగుల్కొల్పినది. చండశాసనాన్ని మానవులు హృదయ పూర్వకంగా అంగీకరించలేరు. నియమాలు సహేతుకంగా కనిపిస్తేనే వాటిని అంగీకరిస్తారు, అనుగమిస్తారు. సహజసిద్ధంగా వారిలో ప్రజ్జ్వరిల్లే స్వేచ్ఛా ప్రియత్వానికి, సబబని తోచిన పరిధులను మాత్రమే మానవులు స్వీకరిస్తారు. సబబు తప్పిన కట్టుబాట్లతో మానవులకు ఎప్పుడూ యుద్ధమే. ఈ

లక్షణాలలోనుంచి ఉద్భవించినదే మానవులలోని నైతిక గుణం. మానవులు సహజ సిద్ధంగా నీతిమంతులు, ఋజుమార్గవర్తులు. పరిస్థితులు బలవంత పరిస్తేగాని నీతిమార్గాన్ని అతిక్రమించరు.

ఇట్టి లక్షణ సమన్వితమైన మానవ ప్రకృతి, మానవ ప్రవర్తన, మానవ సంఘం, మిగతా ప్రాణికోటికంటే విచక్షణంగా వుంటాయి.

మానవుడు సంఘజీవి. ఇతర మానవులతో కలిసి బ్రతకవలసిన వాడు. అందుచేత మానవ ప్రవర్తన, ప్రధానంగా సాంఘికంగానే వుంటుంది. మానవ సంఘంలో ఒక సభ్యుడుగానే అతను తన నడకను, జీవితాన్నీ రూపొందించుకుంటాడు.

ఇద్దరుగాని, ఎక్కువమందిగాని మానవులు కలిసి జీవించినప్పుడు వారి పరస్పర సంబంధాలు విచ్చలవిడిగా వుండడానికి వీలు కాదు. వాటికి నియమాలు అవసరం, తిరుతెన్నులు అవసరం, కట్టుబాట్లు అవసరం.

ఒకాయన వాహ్యాళికి వెళుతున్నాడనుకోండి. నడుస్తున్నది ఒక్కడే కనుక, తన చేతికర్రను స్వేచ్ఛగా తన ఇష్టం వచ్చినట్టుగా ఊపుకుంటూ వెళ్ళవచ్చును. ఒక్కడేకాక, మరొకరితో కలిసి వాహ్యాళికి నడిచి వెళు తున్నాడనుకోండి. అప్పుడు కూడ తన చేతిలోని కర్రను త్రిప్పుకొన వచ్చును. అయితే ఆ కర్రను త్రిప్పుకొనే స్వేచ్ఛకు అప్పుడు ఒక అవధి ఏర్పడుతుంది. రెండవ మనిషికి తగలకుండా, రెండవ మనిషికి ఇబ్బంది కలగకుండా,తన కర్రను త్రిప్పుకొనవలసి వస్తుంది. ఒకరి నడక మరొకరికి, ఒకరి ప్రవర్తన మరొకరికి ఇబ్బంది కలిగించకుండా వుండే రీతిలో మనుష్యులు ప్రవర్తించుకోవాలి. సర్వసాధారణంగా ప్రవర్తించుకుంటారు.

"సంప్రదాయాలంటే ఏమిటి ?"

అలాగే మానవులు తమ భౌతికావసరాల తీరుమానం కొరకై, ఇతరులతో సంబంధం తప్పనిసరిగా పెట్టుకోవలసి వస్తుంది. తమ ఆహార, పానీయాల కొరకు, తమ జీవన వృత్తికొరకు, ఇతర మానవులతో

సంబంధ బాంధవ్యాలు అవసరం. తమ కామతృప్తి కొరకై, సంతాన ప్రాప్తి కొరకై స్త్రీ, పురుషులు కలిసి జీవిస్తారు. అంతదాకా ఎందుకు? ఒక జీవి పుట్టినదంటే, తల్లి గర్భంలోనుంచి పుట్టాలి. స్త్రీ, పురుషుల సంయోగము ద్వారా జన్మించాలి. బాల్యములో తల్లిదండ్రులు పోషించాలి. తిరిగి వృద్ధాప్యము వచ్చినప్పుడు, అనారోగ్యము సంభవించినప్పుడు, ఇతరులు శుశ్రూష చేయాలి.

ఈ విధంగా పరస్పర సంబంధాల ప్రాతిపదికపై జీవితం నిర్మాణ మైనది. ఆ సూత్రము మీదనే జీవితం నడుస్తున్నది. పరస్పర సహకారం మీద ఆధారపడి నడిచే మానవ సముదాయానికి, దాని అస్తిత్వానికి, దాని గమనానికి కొన్ని నియమాలు, కట్టుబాట్లు అవసరం, తప్పని సరి. ఆ నియ మాలే, కట్టుబాట్లే మన సంప్రదాయాలు.

మానవుని వ్యక్తిగతమైన ప్రవర్తనకు, సామూహిక సామాజిక మైన ప్రవర్తనకు తప్పకుండా వ్యత్యాసముంటుంది. చివరకు ఆహార పానీయాలలో, వేష భాషలలో కూడా యీ వ్యత్యాసము స్పష్టంగా కనిపిస్తుంది. ఒంటరిగా ఉన్నప్పుడు మనిషి భోజనం చేసే వైనం వేరు. నలుగురితో కలిసి భోజనంచేసే వైనం వేరు. తనంతట తానుగా ఉన్నప్పుడు వేసుకునే బట్టలు ఒక విధం, బయటకు వెళ్ళేప్పుడు, పది మందితో కలిసినప్పుడు వేసుకునే వస్త్రధారణ, అలంకరణ మరొక విధం. నలుగురిలో ఉన్నప్పుడు మనుష్యులు చేసే సంభాషణ ఒక అదుపులో ఉంటుంది. నోటికి వచ్చిన మాటల్లా అనడానికి మనుష్యులు సందేహిస్తారు. ఈ కట్టడినే మామూలుగా సభ్యత అని పిలుస్తూ వుంటాం. ఈ సభ్యత లేని సామాజిక జీవితం దుర్భరం. సామాజిక జీవితం నియమబద్ధం కాక పోతే, సంప్రదాయ సిద్ధం కాకపోతే మానవులు ఒకరిని ఒకరు బాధపెట్టు కుంటారు, హింసించుకుంటారు. జీవితం ఆటవిక మవుతుంది.

మానవులలో స్పందించే హేతువాద గరిమ, నైతిక విలువలు యీ కట్టుబాటులు వారిచే అంగీకరింపజేస్తవి. వారు సహజసిద్ధంగా అకలంక

మైన స్వేచ్ఛాప్రియులైనప్పటికీ, సమాజ [illegible] సహజాన్ని [illegible] కార్యకారణ విచక్షణ వారిలో [illegible] వసనే [illegible] కొన్ని నియమాలను సృష్టించుకున్నారు. ఇతరులకు ఇష్టంలేని, బాధను కలిగించడానికి ఇష్టంలేని నైతిక [illegible] స్పష్టంగా [illegible] తమ స్వేచ్ఛకు ఆటంకం కలిగించే [illegible] కొన్ని [illegible] వారుగా ఏర్పరచుకొన్నారు. ఈ [illegible] సంప్రదాయాలను సమగ్రంగా పోషించుకుంటూరు కనుక యీ సంప్రదాయాలన్నీ నిక్కరాలు.

"సంప్రదాయాలకు మూలం వేదాలు"



ఈ సంప్రదాయ సమూహము, యీ నియమావళి, ధర్మమనే పేరుతో చలామణీ అవుతూ వుంది. ఈ ధర్మానికి మానవులు ఎంతటి ప్రాధాన్యమిచ్చారో, ప్రపంచంలోని సాహిత్యాలు చూస్తే తెలుస్తుంది. ఆచరణలో యీ సంప్రదాయాలకు రూపకల్పన కాగా, అవి గ్రంథస్థం చేయబడ్డవి. చరిత్రకందినంతలో మానవుల మొట్టమొదటి గ్రంథాలైన వేదాలు ప్రధానంగా ధార్మిక గ్రంథాలు. ఆనాటికి రూపొందిన సంఘ జీవితాన్ని, దాని నియమాలను, అలవాటులను, సంప్రదాయాలను వేదాలు చిత్రించినవి, ప్రతిబింబించినవి. అందుచేతనే, ఆ పిమ్మట జరిగిన భారతీయ జీవిత గమనానికి అవి ప్రాతిపదికలైనవి. అటు పిమ్మట భారత భూమిలో విజృంభించిన సాంఘిక విప్లవోద్యమాలకు అవి కేంద్రమైనవి.

ఈ సంప్రదాయాలు మానవ నిర్మితాలని నిర్ణయించుకున్నామంట, అవి దేశ, కుల వ్యత్యాసాలనుబట్టి మారుతూ వుంటవనే సత్యం విశదమవుతుంది. చుట్టూవున్న వాతావరణం మానవులమీద చాలా ప్రభావం కలిగి వుంటుంది. భౌగోళికమైన పరిస్థితులు ఈ వాతావరణంలో ప్రధాన భాగాలు. భౌగోళికమైన - అనగా ప్రకృతి సిద్ధమైన వ్యత్యాసాలు ప్రపంచంలో భిన్న భిన్న ప్రాంతాలలో నివసించే మనుష్యుల అలవాట్లు, ఆచార వ్యవహారాలలో, సంప్రదాయాలలో పెద్ద తేడాలను తెచ్చిపెట్టినవి. చలిప్రదేశాలైన పాశ్చాత్య దేశాలలోని మానవుల అలవాట్లకు, వేడి ప్రదేశాలైన ప్రాచ్యదేశాలలోని మానవుల అలవాట్లకు ఉన్న తేడా ఊహిస్తేచాలు. అక్కడి ఆహార పానీయాలు వేరు, ఇక్కడి ఆహారపానీయాలు వేరు. అక్కడి వేషధారణ ఒక విధం, ఇక్కడి వేషధారణ మరొక విధం. అక్కడ వైవాహిక జీవితం ఆలస్యంగా ప్రారంభమైతే, ఇక్కడ పెంద లాడే ప్రారంభమవుతుంది. అక్కడి శరీర పాటవం వేరు, ఇక్కడి శరీర పాటవం వేరు. ఈ విధంగానే ప్రకృతి ప్రసాదించిన సంపదలను బట్టి ఆ ప్రాంతపు ప్రజల పని పాటలు, నాగరికత,సంస్కారము రూపొందుతవి సస్యశ్యామలమైన గంగా తీరంలో నివసించిన ఆర్యజాతి, జీవన వృత్తికి వెతుక్కొనవలసిన అగత్యములేని కారణము చేత, గొప్ప పరిష్కారాన్ని, నాగరికతను పెంపొందించుకున్నది. తిండికి కరువైన మధ్య ఆసియా ప్రాంతంలో ఋతువు కొక మజిలీ చేసుకుంటూ తిరిగి బ్రతికే అవస్థ అక్కడి ప్రజలకు కలిగింది. ఇతర ప్రాంతాలమీద దండయాత్రలు చేసి అక్కడి ప్రజలను హింసించి దోచుకుంటూ తమ జీవితాన్ని గడపవలసిన అగత్యం వారికి కలిగినది. అందువల్లనే చెంగిజ్‌ఖాన్, టామర్లేన్ లాంటి హింసాకారులు అక్కడ ఉద్భవించారు.

"ఆ కాలానికి సరిపోయిన కుల వ్యవస్థ"

దీనిని బట్టి విశదమయ్యే విషయమేమిటంటే, మానవ ప్రవర్తన వారి సంప్రదాయాల్ను, వారి చరిత్ర, ఆయా పరిస్థితుల కనుగుణంగా రూపొందినవి, మారినవి, నడిచినవి.

ఈ సంప్రదాయాలకు కొన్ని కీలక స్థానాలున్నవి. అవి కేంద్రా లుగా మానవ జీవితం, అందులోని ఆచారవ్యవహారాలు ప్రవర్తిల్లుతూ వుంటవి. వాటిలో ప్రధానమైనవి కుటుంబము, కులము, ఆస్తి, మానవుల చూట్టూ పెరిగిన సంప్రదాయాలకన్నిటికీ ప్రధాన ప్రాతిపదికలు ఈ మూడే.

"ఆదిమ కాలంలో కుటుంబ నిర్మాణం"

ప్రాణుల కామవాంఛతో కుటుంబము ప్రారంభమైనది. దంపతులు ఏర్పడినారు. వారి సంయోగంతో సంతానం కలిగినది. కుటుంబము పెరిగినది. తల్లిదండ్రులు, బిడ్డలు, మనుమలు, అన్నదమ్ములు ఈ విధంగా కుటుంబము చిలువలు పలువలుగా అభివృద్ధి చెందినది అందరూ కలిసి జీవించినప్పుడు ఉమ్మడికుటుంబాలు ఏర్పడినవి. కుటుంబానికి వృత్తి, ఆ కుటుంబానికి యాజమాన్యము కావలసివచ్చినవి. కుటుంబము ఒక వ్యవస్థగా, సాంఘిక జీవితానికి ప్రాతిపదికగా రూపొందినది.

కులము, వృత్తిని బట్టి మాత్రమే నిర్మితమైనదనీ, ఆదిలో అది పుట్టుకతో నిమిత్తం లేనిదనీ యిప్పుడు దాదాపు అందరూ అంగీకరించే విషయమే. ఈశ్వరుని భిన్నావయవాలనుంచి చతుర్వర్ణములు పుట్టుకు వచ్చినవనే వేదార్థం సరైనది కాదని పండితులు నిర్ణయించారు. ఆ భావం హేతువాదబద్ధం కూడా కాదు. మానవ లోకమంతా ఈశ్వర నిర్మితమే అయితే, యీ చాతుర్వర్ణ వ్యవస్థ ఒక్క భారత దేశంలోనే ఉండవలసిన అవసరమేమిటి? మిగతా దేశాలలో ఎందుకు లేదు! కనుక భారత దేశంలో అమలు జరుగుతున్న వర్ణవ్యవస్థ, కులతత్వం అప్పటి అవసరా లనుబట్టి మానవులు నిర్ణయించుకున్నదే. సంఘజీవితం సమపాళ్ళుగా జరుగగలందులకు, ఎవరి కృషిని వారు సక్రమంగా నెరవేర్చగలందులకు, యీ విభజన జరిగినది. భూమి దున్ని పండించే కృషీవలుడు, రక్షించే రాజ దండము, వాణిజ్యము జరిపే వ్యాపారస్థుడు, జీవిత నిత్యావసరాలు సరఫరా చేసే చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి మొదలైనవారు లేకపోతే

సంఘము పనిచేయలేదు. ఈ వృత్తులు, యీ సదుపాయాలు నిస్పందేహంగా సాగగలందులకు, వాటిని వంశపరం చేశారు ఒకే వృత్తిని అవలంబించే వారు ఒక కులము వారయినారు. కులవ్యవస్థ భారతీయ సంఘాన్ని చాలా కాలం పటిష్ఠం చేసినది, ఒడు దుడుకులు లేకుండా చేసినది.

## " ఆస్తి ఆవిర్భావం "

తనకు ఉపయోగించని పనిని మానవుడు చేయలేడు. ఆ ఉపయోగించే పనిలో కూడా స్వేచ్ఛను కోరుతాడు. ఈ భావాల సమ్మేళనంతో ఆస్తి ఏర్పడినది. మానవుల కృషి, ఉపజ్ఞ ఫలితము ఆస్తి. తన ఆస్తిని పురస్క-




రించుకునే అతని ప్రయత్నమంతా జరుగుతుంది. నిర్మాణాత్మకమైన అతని కృషి యావత్తూ నడుస్తుంది. తను, తన కుటుంబము జీవించటం కొరకు, సుఖించటం కొరకు, మానవుడు ఆస్తిని పోగుచేస్తాడు, పదిల పరుచు కుంటాడు. మానవ ప్రయత్నాని కంతటకు, ఆస్తి పట్టుకొమ్మ అయినది.

రాజ్యము, రాజ్యాధికారము, రాజ్యాంగము కూడా సంఘ శ్రేయస్సు కొరకై నిర్మించబడిన వ్యవస్థలే. అయితే జీవితానికంతటకు మూలకేంద్రము మానవుడు. వ్యక్తిగతమైన మానవుడు, మానవ సంఘము, ప్రత్యేకమైన, విశిష్టమైన, వ్యక్తిత్వముగల మనుషుల సమూహము. అందుచేత సంఘ వ్యవస్థ, దాని సంప్రదాయాలు, మానవుని వ్యక్తిత్వానికి ప్రతిబంధకము లైనచో అవి ఎక్కువ కాలము నిలబడలేవు. సంప్రదాయాలు సబబుగా

వున్నంతకాలమే మానవులు వాటిని అంగీకరిస్తారు. కాక అవి మానవులకు సంఘములో హెచ్చుమంది సభ్యులకు పీడాకరంగా, బాధాకరంగా తయారయితే, వాటిని నిర్మూలించడానికి ప్రయత్నం జరుగుతుంది. వాటి నిర్మూలనం జరుగుతుంది.

అలాగే, ఇప్పటి విధానం కంటె, మరొక విధానం ఎక్కువ ప్రయోజనకారియని మానవులు భావించినప్పుడు వ్యవస్థలో మార్పు జరుగుతుంది. నూతన వ్యవస్థ, నూతన విధానం నిర్మాణమవుతుంది.

ఈ మార్పు మానవ మౌలిక స్వభావంయొక్క అవసరం తీవ్రతరమైనప్పుడు, దానికి ప్రతిబంధకం బలవంతమైనప్పుడు మానవుల ప్రయత్నం విప్లవరూపాన్ని ధరిస్తుంది. కొన్ని పరిస్థితులలో అది హింసారూపాన్నికూడా వహిస్తుంది. కాని మానవ చరిత్రను పరిశీలిస్తే, మానవుని లోని మంచితనమే పటబును గుర్తించి సర్దుకు పోగలిగిన శక్తే ఎక్కువ కాలం పనిచేసినట్లు కనిపిస్తుంది. లేకపోయినట్లయితే, మానవ సంఘము ఛిన్నాభిన్నమై ఉండవలసినది. మానవులలో రోషకషాయ ప్రవృత్తే ప్రధానమైనదైనట్లయితే, విధ్వంసక శక్తులే బలీయమైనవయితే, యీనాటి మానవ చరిత్ర కుక్కలు చింపిన విస్తరిలా అయిపోయి ఉండవలసినది. మధ్యలో ఎన్ని అవాంతరాలు వచ్చిపడినా, ఎన్ని యుద్ధాలు జరిగినా చివరకు మానవులు కలసి బ్రతకకలుగుతున్నారు.

అందుచేతనే బాధాకరములైన సంప్రదాయాలన్నీ మారిపోతున్నవి. మానవులు వాటిని మార్చుకుంటున్నారు. కుల, మత సంబంధములైన కార్కశ్యాలు తగ్గుతున్నవి. వర్ణాంతర వివాహములు హెచ్చవుతున్నవి. సహపంక్తి భోజనాలు జరుగుతున్నవి. ఆర్థికంగా, మానసికంగా బాధను కలిగించే క్రతువులు, అలవాట్లు సమసిపోతున్నవి.

సాంఘికమైన వ్యత్యాసాలు క్రమంగా సన్నగిల్లుతున్నవి. స్త్రీ పురుషుల మధ్య సమానత్వం పెరుగుతున్నది. కలిమి, లేముల మధ్య

సమతాభావానికి ప్రబహ్మాండంగా ఉద్యమం సాగుతున్నది. సాంఘిక న్యాయము కొరకు ప్రజానీకం కృతనిశ్చయ మైనది.

సాంఘిక జీవితాన్ని ప్రతిబింబించే రాజ్యాంగంలో బహుముఖంగా మార్పులు వచ్చినవి, వస్తున్నవి. పరాయి ప్రభుత్వం పనికిరాదన్నాము. రాచరికం కాదన్నాము. నియంతృత్వం పనికిరాదన్నాము. ఒక కక్షియొక్క చండశాసనం వల్ల కాదన్నాము. ప్రజానీకపు ఆమోదంతో పరిపాలన జరిపే వ్యవస్థను కోరుకుంటున్నాము.

ఈనాడు లభ్యమైన విద్యాసౌకర్యాలు, రహదారుల శీఘ్రగమన శక్తులు, సాంకేతిక, శాస్త్ర విజ్ఞానాలు మానవునకు అపూర్వమైన శక్తిని ప్రసాదించినవి. ఈ శక్తులను సద్వినియోగపరచుకుంటే తనను సంకుచిత పరిచే కట్టుబాటులనుంచి మానవుడు విముక్తి పొందగలడు. స్వేచ్ఛగా ప్రకృతి శక్తులతో సయ్యాటలాడగలడు. దీనికంతటకు సూత్రప్రాయుడు మానవుడు. అతడు సర్వదా ప్రగతికామి. ప్రగతికి పరమార్థము, ప్రతి మానవుడు భయరహితుడు కావటం, అతని వ్యక్తిత్వము, ప్రజ్ఞ, శక్తి సామర్థ్యాలు పూర్తిగా వికసించడం, అతడు సర్వసమృద్ధిని అనుభవించటం, ఆనందాన్ని సాధించడం.

ఈ ప్రగతి మార్గం ద్వేషపూరితం కాకూడదు. హింసా కలుషితం కాకూడదు, కానక్కరలేదు అదుగో ఉదాహరణ, అదుగో ఆదర్శం. మహా విప్లవాన్ని ప్రశాంత రూపాన సాధించిన గౌతమబుద్ధుని కరుణామయమైన మార్గం. తన ప్రేమజ్యోతితో గౌతమబుద్ధుడు వెలిగించిన బాటనే మనము ప్రగతిని సాధించి మానవతను పరిరక్షించవలసియున్నది.

( 1960 )

# కట్టలు తెగిన ప్రజావాహిని

పెల్లుబుకుతున్న మానవకోటి పెరుగుదలను ఆరోగ్యమైన రీతిలో అరికట్టగల పద్ధతులను అన్వేషించి వాటిని అమలు జరపాలి. స్వచ్ఛందమైన ప్రజల కృషి, నచ్చచెప్పే పద్ధతిలో ప్రభుత్వకృషి చేదోడువాదోడుగా జరిగినప్పుడు ఈ ప్రజా వెల్లువను అరికట్టవచ్చును.

ఈ పొంగుతున్నది అఖండ గోదావరి కాదు. అస్సాంలో బ్రహ్మపుత్రా నది కాదు. అంతకంటె ప్రమాదకరమైనది. పర్యవసానంలో అంత కంటె భయావకమైనది. పెల్లుబుకుతున్నది మానవకోటి. అది వరద వెల్లువగా ఉప్పొంగుతున్నది. అవధులను అధిగమించనున్నది.

కాక మరియేమి ; ప్రపంచంలో మానవులు రోజుకు తొంభై వేల చొప్పున పెరుగుతున్నారు. ఈ తీవ్రవస్థాయిలోనే పెరుగుదల సాగితే, 2000 సంవత్సరము నాటికి, ప్రపంచ జనాభా నాలుగు వందల కోట్లు కాగలదు. 1947-1953 సంవత్సరాల మధ్య మానవులు 11 శాతం పెరుగగా, వారి ఆహారోత్పత్తి 8 శాతం మాత్రమే పెరిగినది. విశ్వవ్యాప్తమైన కరువుకు, ఆహార కొరతకు ఇది రాచబాట.




ప్రపంచ పరిస్థితి యీ తీరుగా వుండగా, భారతావని పరిస్థితి మరీ అధ్వాన్నంగా వున్నది. 1961లో తేల్చిన జనాభా లెక్కలు ఇప్పుడే ప్రకటితమైనవి. 1961లో భారతదేశపు జనాభా (43,92,35000) నలభై మూడుకోట్లు, తొంభై రెండు లక్షల, ముప్పై అయిదువేలు. ప్రపంచంలోని భూభాగంలో భారతభూమి 2.4 శాతం మాత్రమే వుండగా జనాభా 14.6 శాతందాకా వున్నది. మానవ భారంలో, ప్రపంచ దేశాలలో, భారత దేశానిది రెండవ స్థానం.

అంతేకాదు. భారత దేశంలో జనాభా పెరుగుదల అతి తీవ్రమైన రూపంలో వున్నది. 1901 నుంచి 1921 వరకు, మొత్తం ఇరవై సంవత్స

రాలలో, జనాభా పెరుగుదల 5.35 శాతం వుండగా, 1921 నుంచి 1941 వరకు 26.79 శాతమైనది. 1951 నుంచి 1961 వరకు జరిగిన దశాబ్దంలో పెరుగుదల 21.50 శాతం వున్నది. ఇదే రీతిలో జనాభా శరవేగంతో పెరుగుతున్నది.

ఇప్పటికే భారత భూమిలో ఆహారపు కొరత ఎక్కువైనది. ఈ మానవాళి పెరుగుదల మన ప్రణాళికా కర్తలు కూడా ఊహించనిది. అందుచేత ప్రణాళికలు కొనసాగినా, ఫలప్రదమైనా, విజయవంతమైనా ఒక్క ఆహార కొరతనే తీర్చలేవు. మిగిలిన సౌభాగ్యాన్ని, విజ్ఞానాన్ని ఎక్కడ సంపాదించి పెట్టగలవు?




వైజ్ఞానిక విధానాలద్వారా యీ కొరత తగ్గించుకోగల విజ్ఞాన సంపద, శాస్త్రీయ మార్గాలు ఇంకా ప్రపంచానికే లభ్యం కాలేదు. భారత భూమికి అవి లభ్యమయి ఎంతటి మానవ సముదాయాన్నైనా సుఖవంతంగా పోషించగల శక్తి నెలకొనడం, ఇప్పటిలో సాధ్యమయ్యే విషయం కాదు.

## "పరిష్కార మార్గం"

క్రమక కార్యకర్తలు ఆలోచించాలి. మానవాళి పెరుగుదల ఆరోగ్యకరమైన పద్ధతిలో అరికట్టగల పద్ధతులను అన్వేషించాలి, వాటిని అమలు జరపాలి. సక్రమమైన కుటుంబ నియంత్రణా విధానం నెలకొనాలి.

మనదేశ పరిస్థితులలో, అది ఒక్క ప్రభుత్వ స్థాయిలోనే జరిగితే చాలదు. అది ఒక ఉద్యమ రూపం దాల్చవలసి వున్నది. వాడ వాడలంతా పాకవలసి వున్నది. మనిషి మనిషికీ అందవలసి వున్నది.

అందుచేత కుటుంబ నియంత్రణ స్వచ్ఛంద కార్యక్రమాలతో ఒక భాగము కావలసి వున్నది. ఇప్పటికి ఆ రంగంలో కొంత పని ప్రారంభమైన మాట వాస్తవమే. కాని, ముందుకు వస్తున్న ప్రమాదానికి ఈ ప్రయత్నం చాలదు, ఈ జాగ్రత్త సరిపోదు.

సంక్షేమ సంస్థల దృష్టి యీ సమస్య మీద కేంద్రీకరించబడాలి. కుటుంబ నియంత్రణ మార్గాలలో ఇంకా పరిశోధన జరగాలి. సులభమైన, చవకైన పద్ధతులు, ఆరోగ్యానికి భంగం కలిగించని మార్గాలు అందరకు అందుబాటులోకి రావాలి. స్వచ్ఛందమైన ప్రజల కృషి, అధికారయుతమైన ప్రభుత్వ కృషి సమన్వయం జరిగితే ప్రమాదకరంగా పెరుగుతున్న ప్రజావెల్లువను అరికట్టవచ్చును.

**అక్టోబర్ (1962)**

# ప్రజాస్వామ్యానికి కాపులెవరు?

అధికార పీఠంపై కొనసాగడానికి కాంగ్రెస్ పార్టీ చేపట్టిన విధానాల కారణంగా దేశంలో భావ దారిద్ర్యం పెచ్చు పెరిగింది. ప్రతిపక్షాలు కూడా అదే బాటన నడుస్తున్నాయి. రాజకీయ నాయకులు అపర దేవుళ్ళుగా చెలామణి అవుతూ మానవ జీవితాన్ని బాటకట్టిన వృషభంగా చేస్తున్నారు.

కాంగ్రెసు పార్టీలో భావదారిద్ర్యం మితిమీరిపోయిందని నెహ్రూగారు వాపోయారు. వారు చెప్పింది అక్షరాలా నిజం. ఒక కాంగ్రెసు పార్టీలోనే కాదు, దేశం దేశమే భావ దారిద్ర్యంతో నిస్తేజమైపోయింది.

అయితే ఈ దుస్థితికి కారకులెవరు? కాంగ్రెసువారు, నెహ్రూగారు ఈ బాధ్యత పంచుకోక తప్పదు. రాజకీయ పార్టీలన్నీ ఇందుకు దోహదమిచ్చినవే. అగ్నిలో ఆజ్యం పోసినవే.

స్వాతంత్ర్యం వచ్చిన పిమ్మట భావ కుశలత పెరిగి ఉండవలసింది. నూతన తేజం వెల్లివిరిసి ఉండవలసింది. ప్రజలలో ప్రతిభా, వ్యుత్పత్తులు రేకెత్తి ఉండవలసింది. ఉపజ్ఞ ఉత్పన్నమై ఉండవలసింది.




మరి ఎందుకు జరగలేదు? అధికారం హస్తగతమైన కాంగ్రెసు పార్టీ, తన ప్రాభవాన్ని పటిష్ఠం చేసుకోడానికి, తన అధికారాన్ని శాశ్వతం చేసుకోడానికి దృష్టిని కేంద్రీకరించింది. ఆ కార్యసాధన కొరకై ఏ మార్గాన్ని అవలంబించడానికీ అది సందేహించలేదు.

అలాగే, ప్రతిపక్షంలో ఉన్న ఇతర రాజకీయ పార్టీలు ప్రవర్తించినాయి. అధికారాన్ని చేజిక్కించుకోడానికీ, కాంగ్రెసును దుమ్మెత్తిపోయడానికీ ఏ మార్గం కనుపించినా అవి అనుసరించినాయి.

## " కొత్త దేవుళ్ళు "

ఇందు మూలంగా తేలిన సారాంశం ఏమిటంటే – ప్రజలను ఆకట్టుకోడానికీ, వాళ్ళని తమవైపు త్రిప్పుకోడానికీ, వాళ్ళచేత తమకు ఓట్లు వేయించుకోడానికీ, అన్ని పార్టీలవాళ్ళూ ఒకే తంతు అవలంబించారు. రాజకీయాలు సర్వమయమయినాయి. శాసన సభలు దివ్యలోకాలయినాయి. రాజకీయ పార్టీలు స్వర్గసోపానాలయినాయి. అధికారంలో ఉన్నవారు దేవుళ్ళయినారు. మహానాయకులు ఈశ్వరులే అయినారు. వంకాయకూర నుంచి అటం బాంబు వరకు వారు ప్రవచించిందే వేదవాక్కు అయింది. విద్యావిధానం నుంచి విజ్ఞాన పరిశోధనల వరకు అధికారవంతులే అధ్యాపకులయినారు. మార్గదర్శకులయినారు. భాగ్యవిధాతలయినారు. పాఠ్యగ్రంథాలు కూడా వారి పాదపద్మాల నుంచి ప్రవహించే గంగాజలాలయినాయి.




ఈ వ్యవస్థను, ఈ స్థితిని స్థిరం చేసుకోడానికి కావాలని వ్యక్తిపూజ పెంచారు. నూతనావతారాలను సృష్టించారు. పనికట్టుకుని దైవపూజను కూడా ఎక్కువ చేశారు. జీర్ణ దేవాలయాలను పునరుద్ధరణ చేశారు. భక్తిప్రపత్తులు కల ప్రజలు కదా! వారి మనసులను రంజింపచేయడం ఎలా? అందుకని దేవాలయాలు మరమ్మత్తులు చేయించారు. మహానాయకులు మాటిమాటికీ ఆ దివ్యస్థలాలకు పయనిస్తున్నారు. స్వామి సన్నిధిని వినమ్రులై మ్రొక్కుతున్న తమ బొమ్మలను ప్రచురిస్తున్నారు. తత్ఫలితంగా సంప్రదాయబద్ధులై ప్రజలు గుళ్ళల్లోని దేవుళ్ళను, అధికారంలోవున్న రాజకీయ దేవుళ్ళను కొలుస్తున్నారు. మారుమాట లేకుండా విధేయులవుతున్నారు.

దీనికి తోడు శ్రేయోరాజ్యం ప్రజల ఉపజ్ఞను బలికోరింది. బంజరు పట్టాలనుంచి భూమి హక్కు వరకు రాజ్యం, ప్రభుత్వం చెప్పుచేతలలోకి వచ్చినాయి. ప్రజాజీవితంలోని ప్రతి భాగము ప్రభుత్వపు అదుపు ఆజ్ఞలలోకి వచ్చినాయి. ప్రతి విషయంలోను ప్రభుత్వం జోక్యం కలిగించుకోడాన్నీ, మానవ జీవితాన్ని గాటకట్టిన వృషభాన్ని చేయడాన్నీ, ప్రతిపక్షాలలోని వామపక్షాలు కూడా ఆమోదిస్తున్నాయి, బలపరుస్తున్నాయి. ఇంకా తీవ్ర తరంగా చెయ్యాలని విమర్శిస్తున్నాయి, తొందర పెడుతున్నాయి. భారత పౌరుడు ఏంచెయ్యాలన్నా, ప్రభుత్వపు అనుమతి కావలసి వచ్చింది. ప్రభుత్వపు అదుపులో చెయ్యవలసి వచ్చింది.




ప్రజలలో పలుకుబడిని సంపాదించడానికి క్రొంగ్రొత్త పవిత్ర వ్యవస్థలు సృష్టింపబడ్డాయి. లేనివారు, వెనుకబడినవారు, పీడితులు, రాజకీయ వాదుల హస్తాలలో నూతన పవిత్రతను సంతరించుకున్నారు. అశుభం శుభం తెలియని ఆ అమాయకుల పేరుతో నూతన రామనామ స్మరణలు తయారయినాయి. పాత మత విద్వేషాల లాంటి విషతుల్యాలు, వర్గద్వేషాలు క్రొత్తగా అవతరించినాయి. ఈ విద్వేష తరంగాలమీద అధికారయానం చేయబూనుతున్నాయి రాజకీయ పార్టీలు.

ఈ క్రొత్త మతాలు పుచ్చుకోని వాళ్ళకు రాజకీయ జీవితంలో స్థానం లేదు. అధికారులకు దాసోహం అనని వాళ్ళకు బ్రతుకుతెరువు లేదు. రాజకీయపార్టీలకు చెందనివాళ్ళకు దేశంలో పరపతి లేదు.

ఇట్టి వాతావరణంలో పౌరులలో ఉపజ్ఞ ఎక్కడనుంచి వస్తుంది? ప్రతిభా వ్యుత్పత్తులు ఎక్కడనుంచి పుట్టుకు వస్తాయి? భావ కుశలత, భావ స్వాతంత్ర్యం ఉండడానికి అవకాశ మెక్కడిది?

## “ మనసొకటి మార్గ మొకటి ”

అసలు భారత సంప్రదాయమే వినయ ప్రధానమైనది, సంప్రదాయ బద్ధమైనది, వ్యక్తి ప్రభావానికి లోనయినది. పాత కాంగ్రెసు చరిత్ర తిరగవేస్తే అగుపిస్తుంది. ఈ నాటి భారత భాగ్యవిధాత పండిట్ నెహ్రూ ఆ నాడు గాంధీ కనుసన్నలలో మెలిగినవాడు. తన ఇష్టాన్ని చంపుకుని, తన ఈప్సితాలను వదలుకొని, గాంధీ అడుగుజాడలలో మెలిగినవాడు.




అంతులేని ఈ విధేయతా భావాన్ని, వినయ తత్త్వాన్ని వేదాలు, గీతలు, మతాలు, భారతీయులలో నరనరానికి, నాడి నాడికీ ఎక్కించినాయి. ఎదురు చెప్పలేని స్థితి ప్రజలలో పాతుకుపోయింది, జీర్ణించుకుపోయింది.

ఆ దౌర్బల్యాన్ని రాజకీయపార్టీలు ఉపయోగించుకున్నవి ఇన్నాళ్ళు. ఈ సరళి సాగితే ప్రజలలో మిగిలేది చావులాంటి బ్రతుకు.

పరిష్కార మార్గాన్ని కనిపెట్టడం విజ్ఞుల విధ్యుక్త ధర్మం. రాజకీయాలకు ఈ నాటి ప్రాధాన్యం పోవటం అత్యవసరం, అధికారానికి ఇప్పటి

ప్రాబల్యం అంతరించటం ముఖ్యావసరం. పౌరుని విశిష్టతను, అతని వ్యక్తిత్వాన్ని గుర్తించడం అందరి ప్రథమ కర్తవ్యం. అంతవరకు పరిష్కారమార్గం దుర్లభం.

(నవంబరు 1963)

# మనస్సుంటే
# [illegible]

సేవా దృష్టిగల వ్యక్తులకు సమాజసేవకు ఎన్నో అవకాశాలు ఉన్నాయి. వ్యక్తుల బాధలను సమాజం కలసి కట్టుగా పరిష్కారం చేయవచ్చు. ప్రభుత్వంపై ఆధారపడకుండా ప్రజలే తమ నిరక్షరాస్యత నిర్మూలనకు కంకణం కట్టుకోవాలి.

సేవ చేయడానికి అవకాశాలు,
సేవ చేయవలసిన అవసరాలు,
అడుగడుగునా కనిపిస్తాయి.
మనిషి, మనిషికీ కనిపిస్తాయి,
క్షణ, క్షణానికీ కనిపిస్తాయి.

అయితే ఆ అవసరాన్ని చూడగలగాలి. ఆ అవకాశాల్ని గుర్తించ గలగాలి. ఆ అవసరాల్ని చూడగల కరుణాదృష్టి ఉండాలి. ఆ అవకాశాల్ని గుర్తించగల హృదయం ఉండాలి, అర్హత ఉండాలి.

" దుఃఖోపశమన మార్గం "

ఇవి ఉంటే చాలు, సేవచేయడానికి ఎన్నెన్నో కనిపిస్తాయి అవ కాశాలు. అసలు మనచుట్టూ వున్న జీవితమే అటువంటిది. ఆ జీవితంలో ఆనందం వుంది, సుఖం వుంది, సిరి సంపదలు ఉన్నాయి. అయితే వీటికి తోడు కష్టాలు ఉన్నాయి, ఇబ్బందులున్నాయి, దారిద్ర్యం వుంది, అనా రోగ్యం వుంది, అజ్ఞానం వుంది. వీటితో మానవకోటి సతమతం అవు తోంది, దుఃఖిస్తూ వుంది. అందుకనే కరుణామయుడైన బుద్ధుడన్నాడు - సముద్రాలలోని జలాలన్నీ కలిసినా ప్రాణికోటి కార్చే అశ్రుధారలకు చాలవని. అవును - చాలవు, చాలనిమాట వాస్తవమే. మరి దీనికి తరుణో పాయ మేమిటి? ఉన్న బాధలకు ఉపశమన మార్గమేమిటి?

మనుష్యులు ఒకరికొకరు సాయం చేసుకోగలిగితే, ఈ సమస్య చాలా వరకు తిరుమానం అయిపోతుంది. మానవుడు కలిసి జీవిస్తాడు కనుక, కష్టసుఖాలు కూడా పంచుకుంటే జీవితం సుగమమవుతుంది.

మాట వరసకు, ఒక పెండ్లి జరుగుతున్న దనుకోండి. పెండ్లి ఆనంద దాయకమైన సంఘటన. పదిమందీ వస్తారు. బంధువర్గమంతా పోగవుతుంది.

ముచ్చట్లు, వేడుకలు జరుగుతాయి. విందులు జరుగుతాయి. వీటి కన్నిటికీ ఎంతో ఖర్చవుతుంది. ఎంతో శ్రమపడవలసివస్తుంది. కాని పూర్వం పెండిండ్లు మొదట్నుంచి చివరకు సహకార సహజీవనానికి ప్రతీకాలు. ఎవరి యింట్లో పెండ్లి జరిగినా, ఆ వాడకట్టు వాడంతా, తమ యింట్లోనే పెండ్లి జరిగినట్లుగా భావించుకునేవారు. పందిళ్ళు వేయడం, పొయ్యిలు వేయడం మొదలుకొని పాలు, పెరుగు, నెయ్యి సరఫరా వరకు, పనులన్నీ ఉమ్మడిగా జరిగిపోయేవి. అందుమూలంగా పెండ్లి చేసిన గృహస్థుకు ఆర్థిక బాధ అంతగా వుండేది కాదు. ఏర్పాట్లను గురించి చింత వుండనే వుండేది కాదు. ఆ పద్ధతి మారిపోయి యిప్పుడు పెండిండ్లు ఉపద్రవాలుగా తయారయ్యాయి. కట్నం, కానుకలతో పాటు పెండ్లి ఖర్చులు, ఏర్పాట్లు తానొక్కడే భరించవలసి రావటంతో, గృహస్థు ఎముకలు విరిగిపోతున్నాయి. ఈ బాధ పడలేక, పూలదండల పెండిండ్లని చెప్పి, గుట్టు చప్పుడుగా వివాహాలు చేసేస్తున్నారు తల్లిదండ్రులు. సంఘ జీవితంలో ఆనందదాయకమైన అనుభవాలు యీ రీతిగా సన్నగిలిపోతున్నవి.

అలాగే చావులు. ఎవరైనా చనిపోయినప్పుడు ఆ పోయిన మనిషి కుటుంబంలోనివారు దుఃఖాక్రాంతులై వుంటారు. కర్తవ్యతా విమూఢులై వుంటారు. అప్పుడు ప్రక్కవారు, తోటి గ్రామస్థులు చేరి అన్ని పనులూ స్వయంగా చేస్తారు. ఆ చనిపోయిన మనిషి ఏ జబ్బుతో పోయినప్పటికీ వెనుకాడరు, సందేహించరు. దహన సంస్కారం, అపర కర్మలు, అన్నీ అందరూ కలసి చేస్తారు. పదిమంది తమ దుఃఖాన్ని పంచుకుంటున్నప్పుడు, ఆప్తుల్ని కోల్పోయిన ఆ కుటుంబంలోని వారికి ఎంతో ఉపశమనం కలుగుతుంది.

## “అన్నీ కొరతలే!”

ఇట్టి అనుభవాలు గ్రామ జీవితంలోనే చూస్తాము. అయితే గ్రామాల సమస్యలు మారిపోయినవి. ఇంకా, ఇంకా మారిపోతున్నవి. జనబాహుళ్యం విపరీతంగా పెరిగిపోతున్నది. దానితో ఆహార కొరత, ఇళ్ళ

వాకిళ్ళ కొరత, చదువుల కొరత, పారిశుద్ధ్యపు కొరత, ఎన్ని కొరతలో ఎన్ని సమస్యలో పెరిగినవి. ఈ గడ్డు సమస్యలన్నిటినీ తీర్చాలంటే సాముదాయకమైన కృషి కావలసిందే. ప్రభుత్వ ప్రయత్నం వుండ వలసిందే.

అయితే, యీ ప్రభుత్వ ప్రయత్నం ఎక్కడ నుంచి వస్తుంది? సాముదాయకమైన కృషి ఏ విధంగా పుట్టుకు వస్తుంది? వ్యక్తిగతమైన మనుష్యులు చొరవ తీసుకున్నప్పుడే ఇవి లభ్యమవుతవి. వ్యక్తిగతం గా పౌరులు శ్రద్ధ తీసుకున్నప్పుడే, సహాకరించినప్పుడే ఇవి సాధ్య మవుతవి, ఫలప్రదమవుతవి.

ప్రజానీకం వారంతట వారుగా, సాముదాయకమైన పనికి దేనికీ ముందుకు రాలేరు. అందుకని అట్టి అభిలాష, ఉత్సాహం వున్న వారు కొంత చొరవ తీసుకోవాలి. కావలసిన నాయకత్వము ఇవ్వాలి. చేయవలసిన కర్తవ్యాన్ని ప్రజలకు విశదీకరించాలి. వారిని కార్యో న్ముఖులుగా చేయాలి. కార్యనిర్వహణలో శ్రద్ధాసక్తులు కలిగించాలి.

ఈ రీతిగానే ప్రభుత్వం నుంచి ప్రజానీకం పొందే సహాయంలో కూడా, సేవాతత్పరులు బాధ్యత తీసుకొనవలసివున్నది. కేంద్ర ప్రభు త్వానికి ఆసేతు హిమాచలం కార్యరంగమే. రాష్ట్ర ప్రభుత్వాలకు రాష్ట్రము యావత్తు కార్యస్థానం. జిల్లా పరిషత్తులు, జిల్లా మొత్తం చూచుకోవలసి వున్నది. అయినప్పుడు ఏయే ప్రాంతాలకి, ఏయే అవసరాలు ఉన్నాయి? ఏ ప్రాంతానికి ఏ పని ముందుగా చేయాలి? అన్నది ఒక ప్రశ్న. తమ ప్రాంతానికి కావలసిన సౌకర్యాలు, వసతులను నిర్మించుకోవడంలో, అందుకు కావలసిన అలజడి కలిగించడంలో ఇంగిత జ్ఞానం గల వ్యక్తులు ఎంతైనా నాయకత్వం వహించవచ్చును, సేవానిరతి చూపవచ్చును.

## "ప్రాంతీయ నాయకత్వం-ప్రాశస్త్యం"

దేశం జరుపుతున్న పురోగమనంలో, యీ ప్రాంతీయ, గ్రామీణ నాయకత్వానికి యివ్వవలసిన ప్రత్యేకత, ప్రాముఖ్యం ఇంకా రాలేదు. నిర్మాణమవుతున్న పంచాయితీ రాజ్యం యీ విషయంలో కొంత ఉపయోగాన్ని కలిగిస్తున్నమాట వాస్తవమే. కాని (ఎన్నికలు రేపుతున్న అలజడితో) ప్రాంతీయ నాయకత్వానికి రావలసిన ప్రాశస్త్యం రావడం లేదు. ప్రజలు ముందుకు నడవాలంటే, వారిలో నుంచే నాయకులు పుట్టాలి. వారిలో నుంచే ఉత్సాహం ఉబికిరావాలి. పైనుంచి, బయటనుంచి ఎంత ప్రోత్సాహాన్ని యిచ్చినా, ప్రగతికి కావలసిన చురుకుతనం రాదు. ఇట్టి




గ్రామీణ, ప్రాంతీయ నాయకత్వాన్ని రూపొందించడంలో చదువుకున్న వారికి, శాస్త్ర వ్యవహార జ్ఞానం ఉన్నవారికి బాధ్యత మెండుగా వుంది. సేవచేసే అవకాశం ఎంతైనా వుంది.

## "అక్షరాస్యత ఆవశ్యకత"

విద్యలేనితనం గ్రామాలలో పెద్ద ఆటంకమైనది. ప్రభుత్వంవారు ఎన్ని పాఠశాలలు నిర్మాణం చేస్తే యీ నిరక్షరాస్యత తీరుతుంది? అందు చేత ప్రజల స్వయం కృషితో పాఠశాలలు నిర్మాణం కావాలి. అయితే యీ పాఠశాలలు తేలికగా తయారవుతాయా? ఎంత ధనం కావాలి, ఎంతమంది ఉపాధ్యాయులు కావాలి, ఎన్ని పరికరాలు కావాలి? ఇవన్నీ సమకూర్చడం

ఆలస్యమవుతుంది. మరి అప్పటి వరకు ఆగవలసిందేనా? అక్కర లేదు. కొంత విద్యాగంధం వున్నవారు తీరిక సమయాల్లో పేద పిల్లలకు చదువు చెప్పవచ్చును. తరిఫీదయిన ఉపాధ్యాయులంత ఉపాయంగా, వారు చదువు చెప్పలేకపోవచ్చును. కాని పిల్లలకు చదువు వస్తుంది. వారి పనులు వారు చూచుకునే శక్తి సామర్థ్యాలు ఏర్పడతవి. వారికి స్వయం సేవకత్వానికి అవకాశమేర్పడుతుంది.

అలాగే పెద్దవారికి కూడా తీరుబడి సమయాల్లో చదువు చెప్పవచ్చును. చేయడానికి మనసే వుండాలి కాని చదువు చెప్పనక్కరలేదు. ఏనాటి వార్తలు ఆనాడు, ఏనాటి విషయాలు ఆనాడు, పనులన్నీ అయిన తరువాత, ఆ వాడకట్టులోని పెద్దా పిన్నలను పోగుచేసి, వారికి విశదీకరించవచ్చును, వారితో చర్చించవచ్చును. అక్షరాస్యత లేకపోయినా, యీ విధంగా ప్రజలకు వ్యవహారజ్ఞానం కలిగించవచ్చును.

## "రైతన్నకు సాయం"

పోతే వ్యవసాయదారులకు చేయవలసిన సహాయము ఎంతో వున్నది. ఈనాటికీ మనదేశంలో వ్యవసాయమే ప్రధాన కార్యరంగం. వ్యవసాయ రంగంలో ఉత్పత్తి పెరగడం అతి ముఖ్యమైన అవసరమని అందరూ గుర్తించినదే. అయితే అందుకు ఉపాయాలేమిటి? విధానాలేమిటి? ఈ విషయంలో ప్రభుత్వంమీద ప్రధానమైన బాధ్యత ఉన్నమాట వాస్తవమే. అయితే సువిశాలమైన యీ భారత భూమిలో ఎన్ని సమస్యలనో ఒక్కసారిగా ఎదుర్కొనవలసిన భారత ప్రభుత్వానికి వ్యవసాయ రంగంలో రైతులకు అవసరమైన సలహా, సహాయాలను పూర్తిగా అందించడానికి వీలు లేదు, సాధ్యం కాదు. అందుచేత, వ్యవసాయ పరిజ్ఞానం ఉన్నవారు యీ క్షేత్రంలో రైతాంగానికి చాలా ఉపకరించవచ్చును. క్రొత్త విత్తనాలు, సరిక్రొత్త పద్ధతులు, మంచి ఎరువులు, వాటి వాడకం, తెగుళ్ళు, వాటి నివారణ— ఈ మొదలైన విషయాలలో తాము ముందుగా

కృషిచేసి మిగతా రైతులకు దారి చూపడం, వారికి సలహాలు యివ్వడం ఇప్పుడు చాలా అవసరం. తెగుళ్ళతో ఎప్పటి కప్పుడు పంటలు చెడిపో తున్నవి. తోటలు పీరపించిపోతున్నవి. శాస్త్ర చైతన్యం కలిగిన రైతు బిడ్డలు, వ్యవసాయ శాఖవారిని సంప్రదించి తాము అనుభవంతో పరిశీ లించి, ఇందుకు సాధనోపాయాలను వెదకవచ్చును, కనిపెట్టవచ్చును

అలాగే, రైతు పండించే పంటలు బజార్లలో అమ్మవలె కదా! రైతుకు కావలసిన వస్తుసామగ్రి అక్కడ కొనవలె కదా! ఈ అమ్మకం, కొనుగోలు సౌకర్యాలు సరిగా లేకపోవడం చేత రైతులు వ్యాపారస్థుల చేతిలో నష్టపోతున్నారు. కొనబోతే కొరివి, అమ్మబోతే అడివిగా వున్నది




రైతుల సంగతి. ఇందుకు సహకార సంఘాలు అత్యవసరం. ఆ సంఘాల నిర్మాణంలో రైతు సేవకులు చాలా కృషి చేయవలసి వున్నది. అయితే అట్టి సంఘాలు నిర్మాణమయేదాకా వేచి వుండవలసిన అవసరం లేదు. చైతన్యవంతులు తమ సరుకులను అమ్ముకునేప్పుడు తగు జాగ్రత్త తీసు కుంటే, మిగతావారికి అది సాయపడుతుంది. అదీకాక తమ నిర్ణయంలో, సరుకుల తూకంలో, వ్యాపారస్థులు తగ్గించే అక్రమ మినహాయింపులలో చైతన్యవంతులైన రైతులు, తమ తోటివారికి చాలా సాయం చేయగలరు.

"తీరిక వేళలలో ఉపాధి మార్గం"

పోతే, గ్రామీణ కుటుంబాలలో ఏడాది పొడుగునా పనులుండవు. వ్యవసాయ తరుణంలో తప్ప, మిగతా సమయాలలో రైతులు తీరు

ఖాళీగా వుంటారు. ముఖ్యంగా స్త్రీలు. వారికి ఖాళీ సమయాలలో పని కల్పించగలిగితే, వారి సమయం సద్వినియోగమవుతుంది. వారికి ఆర్థికంగా కొంత స్తోమత కలుగుతుంది. చేతి పనులు, కుటీర పరిశ్రమ లాంటి వ్యాప కాలను ఎన్నిటినో ఏర్పాటు చేయవచ్చును. ఈ కార్య సాధనకు కార్య కర్తలే అవసరం. పెద్ద పెట్టుబడి అక్కరలేని పనులివి.

మనుష్యులకు ఆ మనసే వుండాలిగాని గ్రామ, నగర పారి శుద్ధ్యానికి ఎంతగానో తోడ్పడవచ్చును. చెరువులవద్ద, బావులవద్ద, కుళాయిలవద్ద, పాయిఖానాలవద్ద ఎంత గలీజుగా వుంటుందో నిత్యకృత్యంగా చూస్తూనే వున్నాము. వాటిని వాడే ప్రతి ఒక్కరు రవ్వంత శ్రద్ధ తీసు కుంటే, మురికి లేకుండా చేయవచ్చును. అయితే ఎవరూ పట్టించుకోరు. అదే వచ్చింది ఇబ్బంది.

బజారున వెళుతుంటే వీధి కుళాయిల గుండా నీరు ధారాపాతంగా కారిపోతూ వుండటం తరచుగా చూస్తాము. ఎంతమంది దగ్గరకుపోయి ఆ కుళాయిలు మూసేస్తారు?

రైలులో ప్రయాణాలు చేస్తాం. ఇరవై మందికి మాత్రమే నిర్ణయ మైన పెట్టెలో వలభై మంది ఇరుక్కొంటారు. రైల్వేవారు ఎన్ని టిక్కెట్లైనా అమ్ముతారు. ఈ ఇబ్బందిని రైల్వేవారి దృష్టికి తరచుగా తీసుకువస్తే, పరిస్థితులు మెరుగవుతవి. కానీ ఎవరైనా అడగాలిగా ముందు?

బళ్ళు పోవడానికి వీలులేని రోడ్లు ఎన్నో వున్నాయి. ఆఖరికి కాలి నడకను కూడా తేలికగా వెళ్ళడానికి వీలుకాని రోడ్లు కూడా ఉన్నాయి. వాటినిండా గుంటలు, మెట్టలు, రాళ్ళు, రప్పలు. వాటి విషయమై ఒకటికి రెండుసార్లు అధికారులకు తెలియజేస్తే, మరమ్మతులు జరుగుతాయి. అలా తెలియజేయడానికి ఎవరో ఒకరు ముందుకు రావాలి కదా?

కొంతమంది అధికారులున్నారు. కొన్ని కార్యాలయాలు ఉన్నవి. వాటిలో పని తెమలదు. అధికార దౌర్జన్యం కనిపిస్తుంది. వాటి విషయమై

అలజడి జరిగితే, ప్రజాసేవకులమనే విషయం, తిరిగి ఆ ఉద్యోగులకు స్ఫురణకు వస్తుంది. అయితే పిల్లికి గంటకట్టగల వ్యక్తులు లభ్యం కావాలి కదా!

### " పౌర కర్తవ్యం "

మొన్న అష్టగ్రహ కూటమి వచ్చింది. ప్రళయం వచ్చేస్తున్నాదని ప్రజలు భయభ్రాంతులై పోయారు. శాస్త్ర విషయ పరిజ్ఞానమున్న మనిషి తోటి మానవులకు ఎంతో ధైర్యము చెప్పవచ్చును, వారి ఆందోళన తగ్గించవచ్చును.

అన్నింటినీ మించి తోటి మానవులలోని, నిరుత్సాహాన్ని, నిస్పృహను పోగొట్టి, వారిలో నవచైతన్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పురిగొల్ప




గలిగితే, ఆ కృషి అమృతప్రాయం కాదా! మూఢనమ్మకాల కఠినత్వం నుంచి, అధికార దౌర్జన్యం నుంచి వారిని విముక్తుల్ని చెయ్యగలిగితే, ఆ సేవ అమరతుల్యం కాదా! మనుష్యులను మనుష్యులుగా మార్చబూనే ఈ కార్యక్రమం, విజ్ఞత గల ప్రతి ఒక్కరు నిత్యకృత్యంగా, అనుక్షణము నెరవేర్చినా తరగని కృషి.

కనుక చూడగలగాలే - గాని, హృదయ స్పందనం అవాలే కాని, ఇవీ, ఇటువంటివీ, ఎన్నో, ఎన్నెన్నో ఉన్నాయి, సేవ చేయడానికి మార్గాలు, తోటివారికి సాయపడగల అవకాశాలు. ప్రతిరోజూ, ప్రతి

క్షణము, ఈ అవకాశాలు దొర్లుకు వస్తూనే వుంటాయి. ఆ అవకాశాన్ని అందుకునే హస్తాలు, హస్తాలను చాచే ఆర్ద్ర హృదయాలే కావాలి.

అయితే ఏమి ప్రతిఫలాన్ని ఆపేక్షించి యీ సేవానిరతి అంతా? ఉపయోగాన్ని పొందిన ప్రజలకు సుఖానుభూతి, వారి నేత్రాలలో మెరిసే కృతజ్ఞత, వారి హృదయాలలో నుంచి ఉబికే అప్యాయత కంటె ప్రతిఫలం ఏమి కావాలి? అన్నిటినీ అధిగమించి, సత్కార్యాన్ని సాధించి నప్పుడు, సేవాతత్పరుని హృదయంలో వెల్లివిరిసే సంతృప్తి, ఆనందం ఎన్ని కోట్లు గడిస్తే వస్తుంది? ఎన్ని పదవులు చేబడితే లభిస్తుంది.

( 1959 )

# దేశ రక్షణలో పౌరుల పాత్ర

దేశంలో తీవ్ర పరిస్థితి ఏర్పడినప్పుడు దేశాన్ని
అతి పదిలంగా కాపాడిన ప్రజాస్వామ్యాన్ని ఆత్మ
విశ్వాసంతో ప్రజలు సంరక్షించుకోవాలి.
సుశిక్షితమైన సైనికశక్తికి మించి బాధ్యతలు
గుర్తెరిగిన పౌరశక్తి దేశానికి శ్రీరామ రక్ష.

దేశం ఏమయ్యేటట్టు? ఉజ్వల భవిష్యత్తును ఎలా సాధించాలి? ఈ ప్రశ్నలు ప్రభుత్వంనుంచి పౌరుని వరకు, అందరూ తీవ్రంగా ఆలోచిస్తున్నవే. ఈ ఆలోచన స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుంచి తీవ్రతరమైనది. అది సహజమే కదా: మన పెత్తనం మనకు వచ్చి మన బాధ్యత మనమీద పడ్డతరువాత, మళ్ళి మనం ఎలా బాగుచేసుకుందామనే జిజ్ఞాస కలగడం, ఆసక్తి పుట్టించడం అతి సహజం.

## "దేశమంటే మనుషులోయ్"

దేశమంటే వట్టి మట్టి మాత్రమే కాదు, అందులో నివసించే మానవ కోటి అంతా దేశమనే సత్యం గురజాడలాంటి బావుకులు ఏనాటో వక్కాణించారు. స్వాతంత్ర్యం లభించిన పిమ్మటగాని, ఆ సత్యం నిజస్వరూపం ప్రజల మనసు కెక్కలేదు. మనుష్యులు వాళ్ళ వ్యక్తిత్వం, వాళ్ళ సౌభాగ్యం ప్రధానమన్న సూత్రం మీదనే భారత రాజ్యాంగం నిర్మాణమయింది. మనుష్యులు ప్రధానం కనుక, పౌరులుగా తమ రాజ్యాంగాన్ని తామే నిర్వర్తించుకోవాలి. ఆ బాధ్యత తమకు తామే నిర్వహించుకోవాలి అనే ప్రాతిపదిక మీద మన రాజ్యాంగ విధానం నిర్మాణమయింది. ఆ నిర్మాణంకూడా ప్రజా పరిషత్తే చేసింది.

భారత వ్యవస్థ ప్రజాస్వామికమైనది కనుకనే ఈ 17 ఏండ్లలో ఎన్ని తాకిళ్ళొచ్చినా తట్టుకోగలిగింది. స్వాతంత్ర్యం వచ్చిందో, రాలేదో ఆ వెంటనే మత కల్లోలం కార్చిచ్చువలె దేశాన్ని కాల్చింది కదా: ఆ తరువాత కాశ్మీరు పైన పాకిస్థాన్ దండయాత్ర చేసింది. వీటికి తోడు తీవ్రమైన ఆహారపు కొరత, కటిక దారిద్ర్యం, నిరక్షరాస్యత, ప్రజలకు ప్రాథమిక అవసరాలు కూడా తీరని దుస్థితి. ఈ సమస్యలు మనకు ఎదురైనవి. ఈ సమస్యలను ఎదుర్కోలేక మన దేశం చుట్టూ ఉన్న రాజ్యాలన్నీ ఒకదాని తరువాత మరొకటి నియంతృత్వ పథంలో పడిపోయినాయి.

ఇవిగాక మిగతా దేశాలకు లేని ప్రత్యేక సమస్య భారత దేశానికొకటి వుండేది. ఆరువందలకు పైగా స్వదేశ సంస్థానాలు ఉండి ఉండటం చేత దేశమంతా అనేక భాగాలుగా అనేక చీలికలుగా ఉండేది. వాటినన్నిటినీ కలిపి, దేశాన్నంతటినీ ఐక్యం చేసి సంఘటిత పరిచి ప్రశాంత జీవితాన్ని నెలకొల్పి ప్రగతి మార్గాన దేశం పయనించగలిగిందంటే దానికంతటికు ప్రజాస్వామికమే కారణం. ప్రజాస్వామికంలో అమలు జరిగే ప్రజల ఆత్మవిశ్వాసమే కారణం.

కనుక ఏది ఏమి జరిగినా దేశాన్ని అతి పదిలంగా కాపాడిన ప్రజాస్వామికాన్ని ప్రజలు సంరక్షించుకోవాలి. అది వారికి శ్రీరామ రక్ష.



"ఆత్యయిక పరిస్థితిలో ప్రజల కర్తవ్యం"

చైనా రాజ్యం, భారత భూభాగాల మీద ఎలా దండయాత్ర చేసిందో భారత ప్రజాస్వామికం మీద కూడా అలాగే దండయాత్ర చేసింది. చైనా చేసిన దుండుగీడుతనం, భారత దేశానికి ఒక క్లిష్ట సమస్యను అత్యవసర పరిస్థితిని తెచ్చిపెట్టింది చైనా దండయాత్రలోని అంతర్యాన్ని భారత ప్రజలు గుర్తించాలి. భారత భూభాగాన్ని కొంత కబళిద్దామనే దురాశ ఒక్కటే కాదు చైనాకున్నది, దానికి తోడు తపతో పోటీచేస్తూ ఒక విస్తారమైన మానవ సముదాయాన్ని ప్రగతి తీరానికి చేర్చడానికి భారత భూమి అవలంబిస్తున్న ప్రజాస్వామిక పథం చైనా నియంతృత్వ

విధానానికి కంటకప్రాయమైనది. అందువల్ల భారతప్రజాస్వామిక జీవిత వ్యవస్థ మీదనే చైనా దండయాత్ర చేసింది.

ఇది గుర్తించి భారత ప్రజలు ప్రజాస్వామిక పరిరక్షణలో అప్రమత్తులై ఉండాలి. అత్యవసర పరిస్థితివల్ల కలిగిన ఆదుర్దాలో పడి ప్రజాస్వామ్య సూత్రాలను, ఆ సూత్రాల ప్రాతిపదిక మీద నిర్మాణమైన రాజ్యాంగాన్ని ప్రజలు విస్మరించరాదు. ఈ ఒత్తిడిలో పడి ఆ సూత్రాలకే భంగం కలిగిస్తే, ప్రజాస్వామిక రాజ్యాంగానికే భంగం కలిగిస్తే దండయాత్రలోని చైనావారి ఆశయం నెరవేరినట్టే. అందుచేత భవిష్యత్తును సంకట-స్థితిలో పెట్టి చైనా దండయాత్ర కల్పించిన అత్యవసర




పరిస్థితిలో భారత రాజ్యాంగ వ్యవస్థను, అందులోని ప్రధాన సూత్రాలను అతి పదిలంగా కాపాడుకోవడం ప్రతి భారత పౌరుని కర్తవ్యం.

ప్రజాస్వామ్యమునకు, ప్రజల హక్కులకు, వారి బాధ్యతలకు మధ్య ఒక చక్కని సామరస్యం నెలకొని ఉంటుంది. ప్రజాస్వామ్యం సఫలం కావాలంటే ప్రజల హక్కులు ఎలా చలామణీ కావాలో వారి బాధ్యతలు కూడా అలాగే అమలుజరగాలి. తమ హక్కులను కాపాడుకోడానికి పౌరులు ఎలా ప్రజాస్వామికవాదులు కాలేరో, తమ బాధ్యతలను విస్మరించే పౌరులు కూడా అలాగే నిజమైన ప్రజాస్వామికవాదులు కాలేరు.

## "ప్రజల బాధ్యతలు"

దేశం ప్రశాంతంగా నడుస్తున్న దినాలలో హక్కుల ప్రాధాన్యత మెండుగా వుంటుంది. అత్యవసర పరిస్థితులలో ప్రజల బాధ్యతలు ప్రాధాన్యతలోకి వస్తాయి. అందుకనే దేశాన్ని రక్షించడానికి, పర్యవసానంగా సాయుధ సేనల బాధ్యతలు గుర్తించిన పౌరుల దృఢ సంకల్పం ఎక్కువ అవసరమని ప్రజలు గుర్తించాలి.

ఈ బాధ్యతలను ప్రజలు ఎలా గుర్తించాలి? ఎలా నిర్వర్తించాలి అని ప్రతి పౌరుడూ ఆలోచించాలి.




అత్యవసర పరిస్థితి అనగానే ప్రభుత్వానికి అదనంగా డబ్బు కావాలి. ఆ డబ్బును ప్రభుత్వం రెండు మార్గాలద్వారానే సేకరించగలదు. ఒకటి పన్నులు, రెండు ఋణాలు ప్రతి పౌరుడూ తాను చెల్లించవలసిన పన్నులను. సకాలంలో చెల్లిస్తూ యథాశక్తి ఋణసేకరణలో ప్రభుత్వంతో సహకరించాలి.

ప్రభుత్వ యంత్రాంగం సాఫీగా, సులభంగా సాగిపోవడానికి ప్రతి పౌరుడు సాయపడాలి. దేశ ఆంతరంగిక వ్యవహారాలలో ప్రభుత్వం తికమక పడకుండా రక్షణ కృషిలోను పునర్నిర్మాణ కార్యక్రమంలోను, ప్రభుత్వం దృష్టిని, శక్తిని, కేంద్రీకరించడానికి అనువైన వాతావరణం ప్రజలు కలిగించాలి. అనగా దేశంలోని శాంతి భద్రతలకు పౌరులు బాధ్యత

వహించాలి. ప్రతి భారతీయుడూ బాధ్యతాయుతుడైన పౌరుడుగా మెలిగిన నాడు, దేశంలో శాంతి భద్రతలు నెలకొని సామరస్యం వెల్లివిరిస్తుంది, అభ్యుదయ సాధన తేలిక అవుతుంది.

విదేశీ వ్యాపారంలో మన దేశానిదే కింది చెయ్యి. అనగా మన ఎగుమతుల కంటె దిగుమతులు చాలా హెచ్చు. దిగుమతులలో ఆహార ధాన్యాలు ప్రధాన భాగంగా ఉన్నాయి. ఈ దిగుమతి మన భవిష్యత్తుకు ఒక గుదిబండలాగా తయారైనది. అందువల్ల ప్రజలు ఉత్పత్తిమీద దృష్టిని కేంద్రీకరించవలసి వుంది.

జాతీయ వ్యవస్థలో లంచగొండితనం, కుల, మత ప్రభావాలు మొదలైన దుష్టశక్తులు ప్రబలి ఉన్నాయి. ఈ శక్తులు మన ప్రజాస్వామికానికీ, మన రాజ్యాంగానికీ, మన భవిష్యత్తుకీ నిరోధకాలు. ఈ దుష్టశక్తులను అణచి వాటికి దేశంలో తావులేకుండా చెయ్యవలసిన బాధ్యత, అవకాశం పౌరులకే ఎక్కువ ఉన్నది.

వీటన్నిటికీ తోడు ప్రజలలో నిర్భయం, స్వేచ్ఛాప్రియత్వం, స్వయంపోషకత్వం నెలకొల్పే కృషి ప్రధానంగా ప్రజారంగం నుంచే రావలసి వుంది. నిర్భయులు, స్వేచ్ఛాప్రియులు స్వయంపోషకులు అయిన పౌరులుగల భారత భూమి, ఈనాటి అత్యవసర పరిస్థితినేకాక ఈనాటి క్లిష్ట సమస్యలనే కాక, అన్ని ఇబ్బందులను అధిగమించి, సర్వ సంపన్నమైన మహోదయాన్ని సాధించగలదు. ఆ మహావకాశము వ్యక్తిగతమైన పౌరుల అధ్యాయంలోనే వుంది.

(1965)

# ప్రజాస్వామ్యానికి ప్రత్యామ్నాయం

ఈ ప్రజాస్వామ్యంలో సిద్ధాంతాలకు ఆచరణకు సంబంధం లేకపోవడంతో ఇన్నాళ్ళూ వర్ధిల్లిన పార్టీ సరళి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అందరినీ నిరాశపరచింది

అధికార వికేంద్రీకరణతో పాటు అధికారం ప్రజాలోకానికి విస్తృతమయ్యే రాజ్యాంగ విధానం కావాలి. నిత్యజీవితాలను తీర్చిదిద్దే ప్రజా సంఘాలు ఏర్పడాలి.

ఈ రోజుల్లో ప్రజాస్వామ్యానికి అందరూ హారతు లెత్తుతున్నారు,నివాళులు పడుతున్నారు. ఆఖరుకు కార్మిక (ప్రొలిటేరియట్) నియంతృత్వానికి అంకితమైన కమ్యూనిస్టుపార్టీ సహితము ప్రజాస్వామ్యపు నినాదాల క్రిందనే పనిచేస్తున్నది.

అయితే, ఇంతకూ ప్రజాస్వామ్యమంటే ఏమిటి? ప్రతి పదార్థంగా తీసుకున్నా, చారిత్రకంగా తీసుకున్నా దానికొకటే నిర్వచనం కనుపిస్తుంది. ప్రజాస్వామ్యమంటే ప్రజల ప్రభుత్వం, ప్రజలు చేసే ప్రభుత్వం అని భావం. అనగా రాజ్యాంగంలోని సర్వస్వతంత్రత ప్రజలదేనని సిద్ధాంతం.

ప్రజాస్వామిక రాజ్యాంగాలు 18, 19 శతాబ్దాలలో చాలా దేశాలలో అమలులోకి వచ్చినవి. అంతకు పూర్వం రాచరికము, చండశాసనము ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నవి మానవులు వాటితో సతమతమయి నారు. వ్యక్తి స్వాతంత్ర్యమునకై దేవులాడినారు చివరకు ప్రజా స్వామిక రూపమైన ప్రభుత్వము క్రిందనే వ్యక్తి స్వాతంత్ర్యమునకు, వ్యక్తిగతమైన ఉపజ్ఞకు ఎక్కువ అవకాశము లభించగలదని తెలుసు కున్నారు. ఈ భావములోనుంచి ఉద్భవించినదే నవ్య ప్రజాస్వామ్యము

" నవ భావోదయం "

18 వ శతాబ్దంలో ఉదయించిన ఈ నవభావం మానవప్రగతిలో ఒక క్రొత్త కాంతిని ప్రసరించినది. రాజకీయ, సాంఘిక దృక్పథాలలో క్రొంగ్రొత్త ఆశలను రేకెత్తించినది స్వేచ్ఛా, స్వాతంత్ర్యములకు మహావకాశమును నెలకొల్పినది.

కాని. దురదృష్టవశాత్తు ఈ నూటయాభై ఏండ్ల అనుభవములో అనుకున్న ఆశలు నెరవేరలేదు. ప్రజాస్వామికం పేరుతో ఇన్నాళ్లూ

అమలుజరిగిన పార్టీ సహితమైన పార్లమెంటరీ ప్రజాస్వామికం యీ ఆశలన్నిటినీ నిరాశలు చేసినది.

ప్రజాస్వామిక సిద్ధాంతానికీ, ఆచరణకు సంబంధం లేకుండా పోయినది. వాస్తవికానుభవంలో అమలుజరుగుతున్న ప్రజాస్వామ్యంలో సిద్ధాంతం వేరు, ఆచరణ వేరు

అడుగులోనే హంసపాదన్నట్లు, ఆదినుంచి ఈ వైరుధ్యం ప్రారంభ మయినది నవ్యప్రజాస్వామ్య భావానికి వైతాళికుడు 'రూసో' అని అందరూ భావిస్తారు. అయితే ఆయనే - ఆ వైతాళికుడే ప్రజాస్వామ్యంలోని వైరుధ్యానికి పునాదులు వేసిపోయాడు ప్రాచీన గ్రీకు రాజ్యాలలో నడిచిన ప్రజాస్వామ్యం, వాటిలో ప్రజలు స్వయంగా పాల్గొనడం, తమ రాజ్యాం గాన్ని ప్రజలు సూటిగా నడుపుకోవడం ఆయనకు నచ్చింది. అయితే, ఆ గ్రీకు రాజ్యాలు చాలా చిన్నవి. అవి ఒక్కొక్క పట్టణానికి పరిమిత మైనవి. కనుక, వాటిలో ప్రజలు సూటిగా పాల్గొన్నట్లు విశాలములైన నేటి రాజ్యాలలో కోట్లకొలదిగా ఉన్న ప్రజలు పాల్గొని తమంతట తాము గానే పరిపాలన నడపలేరు అందుకని 'రూసో' ఒక మార్గం ఆలోచించాడు. ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకుని దాని ప్రకారం పరిపాలన జరపడం ఆ మార్గం.

"ప్రజామోదపు ముసుగులో"

ఇది ఎంత ప్రమాదకరమైన మార్గమో చరిత్ర చెబుతున్నది. ప్రజామోదాన్ని పొందే పరిపాలన చేస్తున్నానని హిట్లరు చెప్పాడు. ముసోలినీ చెప్పాడు ఈ కాలపు నియంత లందరు ఈ పాటనే పాడు తున్నారు ప్రజాస్వామ్యానికి దాని ప్రాతిపదికయైన వ్యక్తిస్వాతంత్ర్యానికి పరమశత్రువులుగా పరిణమిల్లిన నియంతృత్వాలన్నీ ఈ ప్రజామోదపు నెపముతోనే పుట్టుకువచ్చినవి రూసో సిద్ధాంతంలోనే ఈ ప్రమాదం కలిసి వున్నది.

రాజ్యాలలో లాగా, సూటిగా పరిపాలన చేసుకోలేరు గనుక, వారు తమకు ఉన్న సర్వస్వతంత్రాధికారాన్ని తమ ప్రతినిధులకు దఖలుపరుస్తారు. కొన్ని ఏండ్ల కొకసారి ఈ ప్రతినిధులను ప్రజలు ఎన్నుకొంటారు. ఈ ఎన్నుకొన్న ప్రతినిధులు ప్రజల సర్వస్వామ్యాలకు వారసులవుతారు. నేటి పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు విధాన మిది. ప్రజలు దఖలుపరచగా సర్వస్వతంత్రమైన శక్తి ఈ పార్లమెంటులలో నెలకొని ఉన్నదని ఈ విధానం సిద్ధాంతీకరిస్తుంది.

ఈ ప్రతినిధులను ఎన్నుకోవడంలోనే పార్టీలు ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నాయి. ఈ పార్లమెంటరీ విధానంలో పర్యవసాన




మేమిటంటే ఎన్నికల మధ్యకాలంలో అధికారాన్నంతను ప్రజలు ఈ పార్టీలకు హస్తగతం చేస్తారు. గుత్తకు ఇచ్చేస్తారు. ఆ కాలంలో ఆ పార్టీయే అధికారానికంతకు కేంద్రం. ఆ మధ్యకాలంలో ప్రజలకు ప్రభుత్వరంగంలో స్థానం లేదు. పరిపాలనతో నిమిత్తం లేదు. అధికారంతో సంబంధం లేదు. ఎన్నుకొన్న ప్రతినిధులను అదుపులో పెట్టుకోడానికి అవకాశం లేదు. అందుచేత పార్లమెంటరీ విధానం ఆచరణలో ప్రజల అధికార సన్న్యాసంగా, సర్వస్వామ్య పరిత్యాగంగా పరిణమించింది. అయిదేండ్లకొకసారి, నాలుగేండ్ల కొకతూరి ప్రజలు తమ అధికారాన్ని తమ ప్రతినిధులని పిలవబడే వారికి ధారాగతం చేసే పద్ధతిలో పార్లమెంటరీ ప్రజా

స్వామ్యం నడుస్తున్నది. సిద్ధాంతానికి, ఆచరణకు మధ్య ఉన్న యీ వైరుధ్యంతో పార్లమెంటరీ విధానమే కాక, ప్రజాస్వామ్య సిద్ధాంతమే నవ్వులపాలు అయినది.

## " పార్టీల దుష్టపాత్ర "

పార్లమెంటరీ విధానంలో పార్టీపద్ధతి మొదటినుంచీ ఉన్నదనే దురభిప్రాయం చాలామందికి ఉన్నది. అందుచేతనే "పార్టీలు లేకుండా పార్లమెంటరీ విధానం ఎలా చలామణి అవుతుంది" అనే ప్రశ్న మాటి మాటికీ వినిపిస్తుంది. ఆదిలో ఇంగ్లండులో పార్టీలు లేవు. ప్రతి నియోజక వర్గంనుంచి అభ్యర్థులు ఎవరికివారు ఎన్నికకు నిలబడేవారు. అప్పుడు వ్యక్తి విలువనుబట్టి మాత్రమే ఎన్నికలు జరిగేవి. తరువాత కొంత కాలానికి పార్టీలు ప్రారంభమయినవి. పార్టీల అవతరణతో వ్యక్తిగత మైన విలువలు నశించినవి. అభ్యర్థి వ్యక్తిగతమైన అర్హతలతో యీనాడు నిమిత్తం లేదు. ఇప్పుడు ఒక వైపున పార్టీ, మరొకవైపున ఎన్నికల సమయాన్ని పురస్కరించుకొని రెచ్చగొట్టబడిన మానవ సము దాయం. వ్యక్తిగతమైన మానవుడు, అతని విచక్షణ, విమర్శనాత్మకమైన శక్తి, ఎన్నికలలో పనిచేయడం లేదు. పార్టీలుచేసే ప్రచారం, కేవలం ప్రజల ఉద్రేకాలను రెచ్చగొట్టడానికి కేంద్రీకరించబడుతున్నది. సామాన్యమానవులలో ఉండే విభేదాలను, కుల, మత, సాంఘిక, ఆర్థిక వ్యత్యాసాలను పెంచి, వారిని ఉద్రిక్తపరచి, ఎన్నిక సమయానికి వారిని విచక్షణా రహితులుగా చేయడమే ఎన్నికల సమయంలో పార్టీలు తమ కార్యక్రమంగా పెట్టుకున్నవి. ఏదో ఒక రకంగా ప్రజలను మభ్యపరిచి, రెచ్చగొట్టి, మోసగించి, మరొక నాలుగయిదేండ్లపాటు అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి మాత్రమే రాజకీయపార్టీలు పనిచేస్తున్నవి అదే తమ ప్రధాన కర్తవ్యంగా పెట్టుకున్నవి ఈ విషపూరితమైన వాతా వరణంలో జరిగే ఎన్నికల ఫలితాలు ప్రజల యథార్థ మనోభావాలను, నమ్మకాలను ప్రతిబింబించగలవా? ప్రతిబింబించగలవని ఎవరనగలరు?

అదిన్నీ కాక, ఒకసారి ఎన్నికైన పిమ్మట, ఆ ప్రతినిధి పార్టీ సభ్యుడుగా, పార్టీ నియమావళికి బద్ధుడుగా, బానిసగా ప్రవర్తిస్తాడు కాని, ప్రజలయెడ తన కర్తవ్యాన్ని గురించలేడు. ఈనాడు పార్లమెంటు, శాసనసభా సభ్యులకు అధినేత పార్టీయే; ప్రజలు కాదు. ఈ తికమకలలో ప్రజాస్వామ్యమే అంతరించినది.

మామూలు పార్టీల శక్తే ఇలా ఉండగా, అదివరకే అధికారంలో వున్న పార్టీలు ఎన్నిక సమయాలలో విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నవి. తమ కున్న రాజ్యాధికారము, తద్వారా తమకు లభించిన ఆర్థికశక్తిని, ప్రచార మార్గాలను ఎదురులేకుండా ప్రయోగించి తడవతడవకు అధికారాన్ని అపహరించుకుంటున్నవి ఈ పార్టీలు.

## " ప్రజాస్వామ్య వైఫల్యం "

ఈ విధంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, అందులోని పార్టీ విధానం అందరకు నిస్పృహను కలిగించినవి. ప్రజాస్వామ్యంలో మానవులకు విశ్వాసం తగ్గిపోయే ప్రమాదాన్ని తెచ్చిపెట్టినవి. ఎన్నో చోట్ల సైనిక విప్లవాలకు దారులు తీసినవి. అనేకచోట్ల నియంతృత్వాలను పునః ప్రతిష్ఠచేసినవి.

మరి యీ పార్టీ విధానం తప్ప, ప్రజాస్వామ్యానికి గత్యంతరం లేదా? మరొక మార్గం లేదా? ప్రజలకొరకై ప్రజలు మాత్రమే చేసే ప్రభుత్వం నెలకొల్పలేమా?

అట్టి ప్రభుత్వాన్ని నెలకొల్పగలము. అయితే కోటానుకోట్లుగా వున్న ప్రజాసమూహంలో, అధికారం కేంద్రీకృతమైన ప్రభుత్వం ఉన్నట్లయితే, నిజమైన ప్రజాస్వామికం ఉండటం దుర్లభం. రాజకీయ పార్టీలు, రాజ్యాధికారం కేంద్రీకృతం కావడానికి రాజమార్గాలు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, నియంతృత్వాలు నెలకొనడానికి రాజకీయ పార్టీలు దారితీసినవి.

అందుచేత అధికారం వికేంద్రీకరణ చెందాలి అధికారం ప్రజలకు విస్తృతంచేసే రాజ్యాంగ విధానం నిర్మాణం కావాలి

ఏ సంస్థ అయినా, ఏ వ్యవస్థ అయినా మానవ నిర్మితమన్నమాట మనము విస్మరించరాదు. తన శ్రేయస్సుకై, తన వ్యక్తిత్వము పూర్తిగా వికసించడానికై మానవుడు ఈ వ్యవస్థలను నిర్మించుకుంటాడు. ఆ ఆశయాలను అర్థించే మానవుని నిత్యాన్వేషణ జరుగుతుంది. అందుచేత వ్యక్తిగతమైన మానవుని విశిష్టతను, శ్రేయస్సును ఉపజ్ఞను భద్రపరిచే రీతిగా రాజ్యాంగం మలచబడాలి. సముద్రములోని ఒక చుక్క రీతిగా, సమూహంలో ఒక స్వల్పమైన భాగంగా మానవుణ్ణి చూచే సామూహిక దృష్టి రాజ్యాంగంలో అంతరించాలి




“ పార్టీలకే ప్రజాసంఘాలు ”

ప్రతి మానవుడు చురుకుగా, ఉత్సాహంగా, శ్రద్ధగా పాల్గొనే ప్రజాసంఘాలు రాజ్యాంగానికి ప్రాతిపదికలు కావాలి. ఆ ప్రజాసంఘాలు ఎందుకూ కొరగాని, ఈనాటి పంచాయితీలు కావు. మానవత స్పందించే, మానవజీవితం ప్రతిబింబించే సంఘాలివి నిత్యజీవితాన్ని తీర్చి దిద్దే అధికారాలన్నీ అట్టి సంఘాలకు ఉండటం అవసరం. రాజ్యాంగంలో ఆ సంస్థలకు ప్రధానస్థానం ఉంటుంది. ప్రాథమిక అధికారం ఆ సంస్థలదే అయి ఉంటుంది. ప్రతిపనికీ సర్వరక్షకమైన కేంద్రప్రభుత్వం కరుణా భిక్షకై ఎదురుచూడకుండా, తమ నిత్యజీవితావసరాల న్నిటినీ తామే

తీర్చిదిద్దుకోగల స్వయంపోషకశక్తి ఆ ప్రాథమిక ప్రజాసంస్థలకు ఉంటుంది. నిత్యజీవితం తమ చేతులలోనిదే గనుక, తమ అదుపాజ్ఞలలోనే నడిచేది గనుక ప్రభుత్వం ప్రజలదై వుంటుంది. అది ప్రజలకొరకే, వారి శ్రేయస్సుకొరకే ప్రవర్తిస్తుంది. నిజమైన ప్రజాస్వామ్యం అమలు జరుగుతుంది.

రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు నిర్దిష్టమైన విషయాలలో మాత్రమే అధికారము కలిగి వుంటవి. చైతన్యవంతమైన ప్రజాసంస్థలు పంపే ప్రతినిధులతో ఆ ప్రభుత్వాలు నడుస్తవి. పార్టీలకు అంకితంగాని సభ్యులు గనక ఆ ప్రతినిధులు ప్రతి సమస్యను దాని మంచి చెడులనుబట్టి నిర్ణయిస్తారు. వర్గభేదాలతో, పార్టీ పట్టింపులతో ఆ నిర్ణయాలు జరుగవు. ఏ సభ్యుడైనా అక్రమంగా ప్రవర్తిస్తే, అతని ఎన్నిక రద్దుచేస్తే అధికారం అతనిని ప్రతినిధిగా పంపే ప్రజాసంస్థలకు ఉంటవి.

ఇంతటికీ ప్రధానంగా మానవునిలో విచక్షణాశక్తి, వివేకము పెంపొందాలి. ప్రతిపౌరుడు బాగోగులు ఆలోచించుకోగల శక్తిమంతుడు కావాలి. అది ఎంతోకాలం పడుతుందని దిగులుపడనక్కరలేదు. ఆదిలో ఆ ప్రయత్నం కఠినంగా కనిపించినా, క్రమంగా సులభమవుతుంది. మానవులలోని నిర్మాణాత్మకశక్తి త్వరలోనే వికసిస్తుంది, యథార్థ ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుంది.

(అక్టోబరు 1962)

# సహకార వ్యవసాయమా?

ఆనాడు కొన్ని విదేశాల మిడిమిడి అనుభవజ్ఞాన పిచికలతో ఉక్కిరిబిక్కిరి అయిన నెహ్రూ తల పెట్టిన 'సహకార వ్యవసాయం' [illegible]గు మడుగులను కడలి వెల్లువలా సోదాహరణంగా వివరించడం జరిగింది.

అనాదిగా భూమిని నమ్ముకొన్న రైతన్న భూ హక్కులను కబళించడానికి రూపుదాల్చిన ఈ రక్కసిని మడియించడానికి ఈ రచనలో ఓ పొలికేక వున్నది.

ఎందుకని ఈ విపరీత పరిస్థితి? ఎందుకని ఈ అసహజ ప్రవర్తన? మనది ప్రజాస్వామిక దేశమని చెప్పుకుంటున్నాము. మరి ప్రజలలో నూటికి డెబ్బైమంది రైతులు భూమిని నమ్ముకుని బ్రతికేవారు. అయినప్పటికీ ఎందుకని ప్రభుత్వాలకు రైతులోకం యెడల యింత చిన్నచూపు? కారణం అందరికీ తెలిసినదే రైతులకు నోరు లేదు. వారికి కూడా గట్టి సంస్థలు లేవు. వారి హక్కులను భద్రపరిచే సమాజాలు లేవు, వార్తా పత్రికలు లేవు. ప్రభుత్వాలలో యోధానుయోధులు ఎంతమంది వున్నప్పటికి, రైతులోకం నుంచి రైతు జీవితంలో పండి పైకుబికిన అనుభవజ్ఞులు తక్కువ. శాసన సభలోని ప్రతినిధులు కూడా వ్యవసాయ జీవితంతో సంబంధం లేనివారో, ఆ సంబంధం సన్నగిల్లినవారో హెచ్చుమంది. ఇక రైతు గోడు వినేవారెవరు! అతని మాట పాటించేవారెవరు.

"పారిశ్రామిక కార్మికులైతే"

అదే పారిశ్రామిక కార్మికులో, రైల్వే ఉద్యోగులో, నాన్‌గెజిటెడ్ ఉద్యోగులో అయితే–వారివారి కార్మిక సంస్థలున్నవి. వారి వారి సమాజాలు ఉన్నవి వారిలో హెచ్చుమంది పట్టణాల్లో కేంద్రీకరింపబడి వున్నారు. అందుచేత వారికి ఏ కొరత కలిగినా చాలా అలజడి చేయగలరు. ప్రభుత్వాలు, వారి అధికారులు ప్రధానంగా పట్టణాల్లోనే వుంటారు గనుక, వారి కంటబడేటట్లు, వారి మనసుకు ఎక్కేటట్లు ఈ కార్మికులు, ఉద్యోగులు ప్రదర్శనలు చేయగలరు. చాలావరకు పట్టణాల్లో మాత్రమే పనిచేసే ప్రజా ప్రతినిధుల ద్వారా ఈ గొడవంతా ప్రకటింపచేయగలరు. ఇంత శబ్దంతో కుయ్యోమని మొరపెట్టగలిగితే, అల వైకుంఠపురమ్ములో, నగరిలో, ఆమూల సౌధమ్ములో, హృదయేశ్వరితో సరస సల్లాపంలో ఉండే భగవానుడే దిగివస్తాడు క్రిందకు. ఇక మానవమాత్రులైన, మంత్రుల లెక్కేమిటి?

అందుచేత అలజడి చేసే అలవాటు లేని రైతులు సమావేశంకండి చర్యలు కొనసాగించండి. అభిప్రాయాలు నిర్దయగా ప్రకటించుదాం.

అన్యాయంగా రైతులగొడవ, భూముల సమస్య సంగతి పట్టించుకోని ప్రభుత్వం ఈనాడు రైతు లోకంమీద చల్లని చూపు ప్రసరిస్తున్నది. వ్యవసాయపు ఆస్తులపైన పరిమితి పెట్టబోతున్నది. అది చాలదని సహకార వ్యవసాయాన్ని ప్రవేశపెట్టాలని చూస్తున్నది. సహకార వ్యవసాయాన్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించిన ఆచార్య రంగా, వి. ఆర్ పరుచూరి గార్ల 'సహకార వ్యవసాయం', (ఆంగ్ల గ్రంథం) శ్రీ జగన్నాధంగారి తెలుగు అనువాద గ్రంథం మంచి తరుణంలో వచ్చాయి. వాస్తవిక పరిస్థితులను ఆధారంగా తీసుకొని సహకార వ్యవసాయం ఎలా సాధ్యం కాదో, ఎందుకు ఉపకరించదో, ఎందుచేత అరిష్టదాయకమో వారు విశదీకరించారు. అందుచేతనే సహకార వ్యవసాయాన్ని అమలు జరిపి




తీరాలనే కాంగ్రెస్ పార్టీ వారపత్రిక ఎకనమిక్ బులెటిన్ సైతం, ఈ గ్రంథస్థమైన వాదాన్ని ఎదుర్కొనుట దుస్సరమని అంగీకరించింది. ప్రభుత్వం వారి 'యోజన' పత్రిక, ఈ గ్రంథపు పాండిత్యాన్ని, శ్రీ రంగా అనుభవాన్ని, ఆలోచనలను గమనించక తప్పదు. అయితే అమూల్యమైన శ్రీ రంగా అనుభవాన్ని, ఆలోచనలను మన ప్రభుత్వ అధినేతలు ఎంత వరకు గమనిస్తున్నారో మనకు తెలుసు.

మనదేశాధినేతలు, నాయకమ్మన్యులు సహకార వ్యవసాయం అవసరాన్ని గురించి భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్లు ప్రచారం చేస్తున్నారు. వారు ఏ మాటచెప్పినా, దానిని విశ్వవ్యాప్తం చేయడానికి వార్తా

పత్రికలు సిద్ధంగా వున్నాయి. ఇక ఆకాశవాణి ప్రభుత్వం వారిదే కదా! అందుచేత వారి ప్రచారం మెండుగా, విరివిగా, ధాటీగా సాగుతున్నది. అయితే దాని స్వంతరూపమేమిటో, నైజం ఏమిటో ఇంతవరకు విశదీకరింపబడలేదు. అది అధికారులకే పూర్తిగా అవగాహన అయినట్టుగా కనిపించదు

## "సేవా సహకార సంస్థలు!"

ప్రభుత్వం చేయబోతున్నామని చెప్పే కార్యక్రమంలో మొదటిది "సర్వీస్ కోఆపరేటివ్స్". అనగా సేవాసహకార సంస్థలు. దీనిని బట్టి సామాన్యంగా అర్థం చేసుకొనేది – ఈ సహకార సంస్థలద్వారా వ్యవసాయానికి కావలసిన భారీ పనిముట్లు, ఎరువులు, విత్తనాలు, వస్తువుల కొనుగోలు, అమ్మకం, అవసరమైన శాస్త్రీయ విజ్ఞానం మొదలైనవి ఉమ్మడిగా రైతులు జరుపుకుంటారని. అయితే అధికారులనుంచి వచ్చే నిర్వచనాలు తికమకగా వున్నవి. ఒకదానికొకటి పొంతన లేకుండా వున్నవి.

ఇవిగాక వెంటనే జరగబోయే పని మరొకటి వున్నది. వ్యవసాయపు భూములమీద పరిమితులు పెట్టిన పిమ్మట అదనంగా మిగిలే భూమి పంచాయితీల పరం చేస్తారట. ఈ పంచాయితీలు గ్రామ పంచాయితీలు కావు. ఆ గ్రామంలోను, ఆ పరిసరాలలోను వుండే భూమిలేని పాటకపు జనం సభ్యులుగా ఈ పంచాయితీలను నిర్మిస్తారట. వీటికి అప్ప చెప్పబోయే అదనపు భూ వసతి, పంచాయితీ మొత్తానికి, ఆ పంచాయితీ సంస్థకు చెందుతుందిగాని వ్యక్తిగతంగా సభ్యులకు భూస్వామ్యమైన హక్కులేవీ వుండవు.

ఈ పై రెండు విషయాలు, మొదటి మూడు సంవత్సరాలలో ముందుగా అమలుజరుపుతారట. ఆ పిమ్మట రైతుల స్వాధీనంలో వున్న భూములకు కూడా సహకార వ్యవసాయ సంఘాలు ఏర్పాటు చేస్తారట. ఈ సంఘాలలో సభ్యులుగా చేరడం రైతుల యిష్టం, బలవంతపరచమని

యిప్పుడు అంటున్నారు. చేరిన తరువాత కూడా, వ్యక్తిగతమైన హక్కు-లను భంగపరచమని ఇప్పుడు చెబుతున్నారు.

మొన్నమొన్నే మన ప్రధాన మంత్రి ఒక విశదీకరణం చేశారు. వెంటనే నిర్మించబోయే సేవా సహకార సంస్థలు త్వరితగతిని రూపొందాలని.

ఎవరైనా ఒక సభ్యుడు తన సభ్యత్వాన్ని మానుకోదలచుకుంటే, తన భూమికి వచ్చే పరిహారాన్ని మాత్రమే తీసుకుని వెళ్ళాలిగాని, భూమి మాత్రం ఆ సహకార సంఘంలోనే వుంటుంది. ఇది పండిట్ నెహ్రూ చేసిన నిర్వచనం. అయినప్పుడు ప్రస్తుతం అమాయకంగా అగుపించే ఈ సేవా సహకార సంస్థలలో ఒకసారి జేరితే ఇక మళ్ళీ వారు తమ భూమితో బతికి బయటపడరన్నమాట.

సేవాసహకార సంస్థలకు, అదనపు భూమిని ఏర్పరచబోయే పంచాయితీలకు, ఆ తరువాత రాబోయే రైతుల సహకార వ్యవసాయ సంస్థలకు వుండే సంబంధం ఎట్టిది? ఒక గ్రామంలో ఆ మూల ఒక రైతు ఈ మూల మరొక రైతు సహకార సంస్థలలో జేరారనుకోండి. ఈ ముక్కలు చెక్కలుగా వుండే భూములనే ఆ సంఘం వ్యవసాయం చేస్తుందా? అలా అయితే సహకార వ్యవసాయంలో ఊడిపడుతుందనే ప్రయోజనం, అట్టి వ్యవసాయంలో ఎలా లభిస్తుంది? అదిన్నీ గాక, నా భూమి మధ్యలో వున్నదనుకోండి. అటు ప్రక్కరైతు, ఇటుప్రక్క రైతు సంఘంలో చేరుతారు. నేను జేరదలచను. అప్పుడు అధికారులు నన్ను బలవంతం చేస్తారా, చేయరా? దీనిలో చేరవలసిందిగా రైతుల్ని బలవంతపెట్టబోమని అంటున్నారు. అలా అయితే ప్రభుత్వం వ్యవసాయదారులకు అందించబోయే సహాయం సహకార సంస్థలకు, ఆ సంస్థలో జేర నిరాకరించిన రైతులకు పక్షపాతం లేకుండా జరుగుతాయా? ఇట్టివి ఇటువంటివి అనేకమైన సందేహాలు, భయాలు మనకందరకు వరద వెల్లువలాగ వస్తున్నవి. ఈ సందేహాలు, భయాలు, నివృత్తి చేయవలసిన బాధ్యత ప్రభుత్వంమీద వున్నది

అదిన్నీగాక, భయానికి దారితీసే విశేషం మరొకటి మనం మన్నిం చాలి. పరిమితులు పెట్టగా మిగిలే అదనపు భూమిని పంచాయితీలకు అప్ప జెపుతారు. ఈ భూమి పైన హక్కు పంచాయితీ సంస్థలకే గాని, వాటి లోని వ్యక్తిగత సభ్యులది కాదు. సహకార వ్యవసాయాన్ని బలపరిచే కమ్యూనిష్టు పార్టీ వారు సైతము ఈ ఏర్పాటుకు అంగీకరించడం లేదు. అదనపు భూమిని భూమిలేనివారికి ముందుగా పంచమని కమ్యూనిష్టు పార్టీ వారి వాదం. అట్టి వ్యక్తిగతమైన హక్కును అంగీకరించబోమని కాంగ్రెస్‌వారి మతం. సహకార వ్యవసాయంలో, పంచాయితీలలో సభ్యు లకు వ్యక్తిగతమైన హక్కులు లేనప్పుడు సహకార వ్యవసాయ సంస్థలలో రైతుల వ్యక్తిగతమైన హక్కులను ఎంతకాలం ఉంచుతారనేది మనం గట్టిగా ఆలోచించాలి.




దీనికి తోడు భూముల మధ్య గట్లు తీసివేస్తామనీ, అందువల్ల కొన్ని లక్షల ఎకరాలు అదనంగా సాగుకు వస్తుందనీ మరొక అధికార యుతమైన ప్రతిపాదన. ఎద్దు ఈనిందనగానే దూడను గాట కట్టివేయ మన్నట్లుగా వున్నది ఈ సూచన. గట్లు తీసివేస్తే పైరుకు కావలసిన నీరు ఎలా నిలవచేయాలన్న విషయం ఈ ప్రభువులకు పట్టలేదు. మహమ్మద్‌బిన్ తుగ్లక్ 14వ శతాబ్దంలో చనిపోయినా వారి ఆత్మ ఢిల్లీ రాజ్యాంగంలో చాలామందిని ప్రేరేపిస్తున్నదల్లే వుంది. హాస్యాస్పద మైన భావం అలా వుంచి, యీ భావాన్ని రేకెత్తించిన అంతరార్థం మనం గమనించాలి. గట్లు తీసివేసిన తరువాత సభ్యులుగా జేరిన రైతుల

భూములకు ప్రత్యేకత ఎక్కడ? వారివారి భూములలో రైతుల సొంత హక్కులు ఎక్కడ మిగిలి వుంటాయి?

అనుమానాస్పదమయిన విషయం మరొకటి వున్నది. మన జాతి పురోగమనానికి ఆశయంగా మనం నిర్మించుకొననున్న వ్యవస్థను పునాదిగా ఆదిలో కాంగ్రెస్‌వారు 'కోఆపరేటివ్ కామన్‌వెల్త్' (సహకార సహజీవనం) అని నిర్ణయించారు అయితే ప్రధాని నెహ్రూ ప్రభుత్వము చైనా మొదలైన కమ్యూనిష్టు రాజ్యాలలో తీర్థయాత్ర చేసిన పిమ్మట ఆవడి కాంగ్రెస్ సమావేశంలో దానిని 'సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీ' అనగా సోషలిష్టు తరహా సమాజంగా మనం రూపొందాలని మార్పు చేశారు. సహకార జీవన వ్యవస్థ అనే ఆదర్శానికి తిలోదకాలు యిచ్చారన్నమాట. దానికి, దీనికి వ్యత్యాసం లేదంటారా? లేదు. మార్చవలసిన అవసరం, మార్పుమనే వెర్రి పట్టుదల ఎందుకు చూపవలసి వచ్చింది? అయితే తిరిగి యిప్పుడు సహకార వ్యవసాయం పెడదామని కాంగ్రెస్ వారు నిర్ణయించారు. కాని సోషలిష్టు సమాజం అనే ఆదర్శంలో మార్పు లేదు కనుక కాంగ్రెస్ వారి ఆలోచన మీదటే సహకార వ్యవసాయం సోషలిష్టు సమాజంలో ఒక ప్రధాన భాగం కాబోతున్నదన్నమాట. అనగా రష్యా, చైనా మొదలైన సోషలిష్టు రాజ్యాలు వేసిన పుంతనే మనం కూడా నడవబోతున్నామన్నమాట. అలా కాదనడానికి ఆధారమేమిటి? ఆ మాట అన్నప్పుడు నాయకులు చూపే కోపం తప్ప మనకు వేరే సమాధానం లేదు

నాయకులు యీ విషయంలో చూపుతున్న కోపతాపాలే మన అనుమానాలకు మరింత దారి తీస్తున్నది. ఉపనాయకుల మాట అటుంచి సహకార వ్యవసాయవాదులకు మూలకందము, భారత రాజ్యాంగానికి మొదటి వారసుడు అయిన ప్రధాని నెహ్రూ స్వయంగా ఈ ఉద్యమ వ్యతిరేకుల్ని భూస్వాములని, స్వార్థపరులని తూలనాడుతున్నాడు. సహకార వ్యవసాయంకాక యింకో మార్గమేమిటని సవాలు చేస్తున్నాడు ఈ అసహనం దండశాసనత్వానికి దారి తీస్తుంది. మరోమార్గం లేదనే అహంభావం

ప్రజాస్వామ్యాన్ని మొదలంట కూలదోస్తుంది. నియంతృత్వాన్ని నెల కొల్పుతుంది. అప్పుడు నేతిబీరకాయలో నేయి లేనట్లే సహకార వ్యవ సాయంలో సహకారం వుండదు.

ఈ అనుమానాలకు, భయాలకు తోడు అసలు సహకార వ్యవ సాయం వల్ల దేశానికి ఉపయోగమేమిటి? ప్రజలు ఇందువల్ల బాగుపడే దేమిటి? అనే ప్రశ్నలకు రెండు మూడు సమాధానాలు చెప్పబడుతున్నవి. వాటిని కూడా పరిశీలిద్దాం.

ఒకటి సాంఘిక న్యాయం—అనగా ఏర్పాటు. వ్యవసాయపు ఆస్తులలో హెచ్చుతగ్గులు. ఆ స్థితిలో ఒక రకమైన ఆర్థిక సమగ్రతకు దారి తీస్తున్నది. సహకార వ్యవసాయం దానంతట అదిగా ఈ వ్యత్యాసాలు ఎలా తీరు స్తుందో బోధపడడం లేదు. ఇక్కడ మనం ఒక్క విషయం మనసులో వుంచుకోవాలి. భూముల మీద పరిమితులు నిర్ణయించడం, అదనపు భూములను రైతులనుంచి తీసుకోవడం అనేది ఒక ఏర్పాటు. ఆ పిమ్మట భూములన్నింటినీ సహకార వ్యవసాయం క్రింద తీసుకురావడం పరొక ఏర్పాటు. ఈ రెంటికీ సంబంధం లేదు. హెచ్చు తగ్గులు తగ్గించాలి అంటే పరిమితులు ఉపకరిస్తేగాని, సహకార వ్యవసాయం మనం కోరే సాంఘిక న్యాయాన్ని ఎలా తెచ్చిపెడుతుంది? కనక ఈ వాదం సక్రమంగా లేదు.

రెండవది, ముఖ్యమైనది సహకార వ్యవసాయంలో భూముల నుంచి ఉత్పత్తి పెరుగుతుందనే నమ్మకం. ఆ నమ్మకం దేనిమీద ఆధార పడి వున్నదో వారు వివరించడం లేదు. మానవ ప్రవృత్తిని బట్టి మనం చూడగలిగినంతలో పదిమంది కలసి చేసే వ్యవసాయం కుమ్ము, దుమ్ముగా వుంటుంది కాని రాణించదని తోస్తుంది. దానికి తార్కాణంగా సహకార వ్యవసాయం అమలు జరిపిన ఏ దేశంలో ఎక్కడా ఇది విజయ వంతం కాలేదు. రష్యా, చైనా, యుగోస్లోవియా మొదలైన కమ్యూనిష్టుల ప్రభుత్వాలు తమకు ఎదురులేని అధికారాన్నంతా ప్రయత్నించినా అవి సఫలం కాలేదు. వారు ఇతర మార్గాలను అవలంబించవలసివచ్చింది.

యుగోస్లోవియా తిరిగి వ్యక్తిగతమైన రైతాంగ వ్యవసాయాన్ని అసలు జరపవలసివచ్చింది. సహకార వ్యవసాయంకంటే రైతాంగపు వ్యవసాయం యుగోస్లోవియాలో నూటికి నలభై వంతులు వుత్పత్తి పెంచింది. సహకార వ్యవసాయంలో విపులమైన అనుభవాలు అన్నీ వుండగా ఫలించిన ఉపమానం ఒక్కటి కూడా కనిపించదు. కాకపోగా, సహకార వ్యవసాయంతో ఎట్టి నిమిత్తంలేని స్పెయిన్, జపాన్, ఈజిప్టు దేశాలు రైతాంగ వ్యవసాయపు పద్ధతిని సాగులో నూతన మార్గాలు అవలంబించి తమ పంటలను కొన్ని చోట్ల నూటికి నూరుపాళ్ళు పెంచుతున్నవి.

పోగా, మరొక ఉపయోగం కూడా సూచింపబడుతున్నది సహకార వ్యవసాయంలో యంత్రాల ఉపయోగం సాధ్యమవుతుంది. వ్యక్తిగతంగా




ఏ రైతూ ఈ వ్యవసాయపు యంత్రాంగం భరించలేడు అని యీ వాదం. అసలు యంత్రాల వల్ల ఎంత ఉత్పత్తి జరుగుతుందో ఎవరూ తేల్చి చెప్పలేరు. అదిన్నీగాక యంత్రాలను ఉపయోగించి తద్వారా కలిగే నిరుద్యోగాన్ని ఏ విధంగా సంబాళించుకొనడమో ఆలోచన జరగలేదు. పోతే యంత్రాలు వ్యవసాయానికి అవసరమని శాస్త్రజ్ఞులు అనుభవంమీద సిద్ధాంతీకరిస్తే సేవా సహకార సంస్థల ద్వారా ఆ పని చక్కగా జరుపుకోవచ్చునుగదా! ఆ సదుపాయం రైతులకు సమకూర్చలేకపోతే ఈ సేవా సహకార సంస్థలు ఎందుకు? ఈ రీతిగా సహకార వ్యవసాయానికి అనుకూలంగా వున్న ఏ వాదంలోను పసకు సబబు కనిపించదు. అందువల్ల

కాంగ్రెస్‌వారిలోనే చాలా మందికి ఇది ఇష్టంలేనట్లు స్పష్టంగా కనిపిస్తూనే వుంది లేకపోయినట్లయితే కాంగ్రెస్‌లో చాలామంది ప్రముఖులు మూగ నోము పట్టవలసిన అవసరం లేదు. ఒక్క నిమిషం ఆలోచించుకోండి. సహకార వ్యవసాయాన్ని పర్యవసానంలో అమలుజరుపవలసింది రాష్ట్ర ప్రభుత్వాలు కదా! ఇంతవరకు బాధ్యతగల ఏ రాష్ట్ర ప్రభుత్వ ప్రతి నిధైనా సహకార వ్యవసాయాన్ని గురించి స్పష్టంగా అభిప్రాయాన్ని వెలిబుచ్చాడేమో చూడండి.

అదిన్నీగాక ప్రజాస్వామ్యాన్ని పెంపొందించుకొనే మనిషికి సహ కార వ్యవసాయం గొడ్డలిపెట్టు కాగలదు. శ్రేయోరాజ్యం పేరిట ఇప్పటికే




ప్రభుత్వం ప్రజల నిత్యజీవితంలో అతిగా జోక్యం కలిగించుకుంటూ ప్రజల స్వేచ్ఛను అరికడుతున్నది. ఇంతవరకు వ్యవసాయ రంగం ప్రభుత్వ హస్తగతం కాలేదు. ఈ సహకార వ్యవసాయంతో అది కూడా ఈ బోనులో చిక్కుకుంటున్నది. మనచుట్టూ పనిచేసే సహకార సంఘాలు అధికారుల చేతిలో కీలుబొమ్మలలాగా ఎట్లా. ఆతలాకుతలమవుతున్నవో మనం చూడడంలేదా? వారు ఈ సంఘాల యెడల ఎంత చండశాసనంగా ప్రవర్తిస్తున్నారో మనం గమనించడం లేదా? ఈ వాతావరణంలో ఏర్పాటు కాబోయే సహకార సంఘాలు ఇందుకు భిన్నంగా వుంటవని ఆశించడానికి అవకాశం ఏమిటి? కాకపోతే, రాజ్యంలో ఎంతో ప్రాము

ఖ్యాన్ని పొందే ఒక అధికార వర్గం యిందుమూలంగా సృష్టింపబడు తుంది. తద్వారా ప్రభుత్వం నియంతృత్వపు రహదారులలో పయనిస్తుంది.

## "రైతులారా కదలండి"

కనుక ఈ సహకార వ్యవసాయంలో వుండే ప్రమాదాన్ని రైతాంగం వెంటనే గుర్తించాలి. ప్రజానీకం అభ్యంతరం చెప్పేది సహకార భావానికి కాదు. వ్యక్తిత్వాన్ని చంపే వ్యక్తిగతమైన ఉపజ్ఞను నాశనం చేసే సహకార సేద్యాన్ని మాత్రమే మనం వ్యతిరేకిస్తున్నాం. రైతు జీవితంలో కృషిలో సమానమైన ప్రతిపత్తితో సహకారాన్ని అనుభవించే అవకాశాలు చాలా వున్నవి. అందుకని రైతాంగం సహకార వ్యవసాయ మనే కత్తెర బోనులో ఇరుక్కోనక్కరలేదు.

రైతులు ఈ విషయాన్ని సావధానంగా పరిశీలించాలి. నిర్భయంగా ఆలోచించాలి. నాయకులు కోప్పడుతున్నారని భయపడకూడదు. మనకు దురభిప్రాయాలు అంటకడుతున్నారని, మనల్ని స్వార్థపరులని చెప్పు తున్నారని జంకకూడదు. మాటకు మాట అప్పచెప్పవలసివస్తే మనమూ అనగలుగుదుము. మాకు భూమి, పుట్ర లేదు కనకనా, మీ ఆస్తులన్నీ పట్టణాలలోనే వున్నవి కనకనా, ఈ ద్వారా ఎదురులేని అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే ఆశతోనా, మీరు ఈ ప్రయత్నాలు చేస్తున్నారని మనం విమర్శించవచ్చును కాని మనం అలా అనం. అనవలసిన అవసరం మనకు లేదు. కోపతాపాలు. వాదాలు పస లేనివారికి– మనకు కాదు.

కాంగ్రెస్ పార్టీ సహకార వ్యవసాయ తీర్మానాన్ని అంగీకరిస్తే దేశమంతటా దానికి ఆమోదం వచ్చిందని ప్రధాని నెహ్రూ భ్రమ పడుతున్నాడు ఆ దురభిప్రాయాన్ని తొలగించే బాధ్యత రైతులమీద వున్నది. పల్లెపల్లెలా, వాడ వాడలా, సభలు జరిపి తీర్మానాలు చెయ్యండి. ఆ తీర్మానాలను రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు అందచెయ్యండి. దీనిని

రైతాంగం ఒక మహోద్యమంగా నడవండి. రైతు స్వాతంత్ర్య పరిరక్షణకై జైత్రయాత్రకు పూనుకోండి. రైతాంగం విజయవంతం అగుగాక !.

(నవంబర్ 1964)

# స్థానిక సంస్థలలో కూడా పార్టీలేనా?

ఓటర్లను ఉద్రేకపరిచి తత్ఫలితంగా ఉత్పన్నమైన వాతావరణంలో వారి ఓట్లు కాజేయడమే రాజకీయ పార్టీల ప్రధానోద్దేశం.

నియంతృత్వ పోకడలలో నేటి నాయకులు రూపొందుతున్నారు. పైస్థాయిలో అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి మాత్రమే రాజకీయ పార్టీలు స్థానిక సంస్థలను వినియోగించుకుంటున్నాయి. అధికార వికేంద్రీకరణ లక్ష్యాన్నే దెబ్బతీస్తుంది.

స్థానిక సంస్థలలో రాజకీయ పార్టీలకు స్థానమున్నదా? అనే ప్రశ్న దేశంలో మాటిమాటికి ఉదయిస్తున్నది. ప్రజాస్వామిక వాదులకు ఈ ప్రశ్న ప్రాథమిక సమస్యగా కనిపిస్తుంది.

అసలు రాజకీయపార్టీలు అవసరమా? ప్రజాస్వామ్యానికి అవి దోహదాలా? నిరోధకాలా? అనే ఆలోచన చాలాకాలంనుంచి ఆలోచనా పరులను బాధిస్తున్నది. ఈనాడు దేశంలో సర్వోదయవాదులు పార్టీ రహిత ప్రజాస్వామ్య నినాదాన్ని అలవరచుకున్నప్పటికీ పార్టీల కుటిల ప్రభావాన్ని, వాటి ప్రజాస్వామిక స్వభావాన్ని మొదటిసారిగా దేశంలో ప్రతిపాదించి, నిరూపించి ఆచరణలో పెట్టినవాడు మానవేంద్రనాథ రాయ్.

## " పార్టీల పద్ధతి "

పార్టీ లేకుండా ప్రజాస్వామ్యం లేదు. వ్యతిరేకపక్షం లేనప్పుడు ప్రభుత్వపక్షం ఎలా శాసన ధోరణిని అవలంబిస్తుంది? అందుచేత పార్టీలు అవసరమనే వాద మొకటి తరచు వినవస్తుంది. ప్రభుత్వ పక్ష మొకటి ఉంటే ప్రతిపక్షము కూడా ఉండటం న్యాయమే, అవసరమే. అయితే ప్రభుత్వ పక్షమంటూ ఒకటి ఎందుకుండాలి? శాసనసభలో ఉత్తములు, శక్తిమంతులు అయినవారిని వ్యక్తిగతంగా, ప్రభుత్వసభ్యులుగా ఎందుకు ఎన్నుకోకూడదు? అంటే అట్టి ప్రభుత్వం చుక్కాని లేని నావలాగా ఉంటుంది. అట్టి శాసనసభ ఆదర్శరహితమైన, ప్రయోజన శూన్యమైన అల్లరి గుంపుకంటె భిన్నంగా ఉండదు అనే సమాధానం చెప్పబడుతూ ఉంది. ప్రతి పార్టీకి ఒక ప్రణాళిక ఉంటుంది. ఒక కార్యక్రమం ఉంటుంది. ప్రజలు ఒక పార్టీకి తమ ఓటు ఇస్తున్నారంటే, ఆ పార్టీ అధికారంలోకి వస్తే దాని ప్రణాళిక ప్రభుత్వానికి ఆదర్శమవుతుంది. మార్గదర్శక మవుతుంది. కనుక పార్టీ పద్ధతిపై ఎన్నికలు జరగటం, శాసన సభలు పనిచెయ్యడం, ప్రభుత్వాలు నిర్మాణం కావడం అవసరమని ఈ వాదన ప్రధాన భావం.

అయితే ఆచరణలో ఈ ఆశయం ఎంతవరకు నెరవేరుతున్నది? పార్టీల ప్రణాళికను పరిశీలించి, వాటి మంచిచెడులను పరీక్షించి, ప్రజలు ఎంతవరకు ఓటు వేస్తున్నారు? అదే సత్యమయితే, మహానాయకుల వ్యక్తి పూజలు ఎందుకవసరమయినవి? కుల, మత, ప్రాంతీయ వైషమ్యాలు ఎన్నికలలో, ప్రభుత్వరంగంలో ఎందుకని విలయతాండవం చేస్తున్నాయి? అమాయకులైన ప్రజలను రెచ్చగొట్టి, మభ్యపరచి, ఎన్నికల సమయాలలో ఉద్రేకపూరితుల్ని చేయవలసిన అవసరం ఎందువల్ల కలుగుతున్నది? ప్రశాంతంగా ప్రణాళికలను పరిశీలించవలసిన సమయం కదా, ఎన్నికల సమయం? పూనకం పూనిన గణాచారుల తీరుగా పార్టీ మనుషులు తయారయి, ప్రజలను కూడా అలా ఎందుకు తయారుచేస్తున్నారు?




" నేతిబీరకాయ ప్రజాస్వామ్యం "

కనుక ప్రణాళికలను గూర్చి ప్రశాంతంగా ప్రజానీకం ఆలోచించడం లేదు. పార్టీలకు కావలసిన మత్తుపదార్థాలిచ్చి, అనాలోచితమైన సంతకాలు తీసుకున్న తీరుగా ఓటర్లను ఉద్రేకపూరితుల్ని చేసి, అనాలోచితంగా వాళ్ళ ఓట్లు కాజేయడమే వారి ప్రధానోద్దేశ్యం. ఇందులో ప్రజాస్వామిక మేమున్నది?

అదిన్నీ కాక, అయిదేళ్ళ కొకసారి ఎన్నిక జరిపిన తరువాత, ఈ అయిదేళ్ళ మధ్యలో ప్రభుత్వ కార్యక్రమంలో ప్రజల ప్రమేయము సుతరామూ లేదుకదా!

ఆ పిమ్మట పార్టీ అధినేతలు ఏది నిర్ణయిస్తే అది జరిగిపోతున్నది. ఆ పార్టీ అధినేతలు కూడా ఒకరో, ఇద్దరో, లేక వేళ్ళమీద లెక్కబెట్ట గలిగిన కొద్దిమంది మాత్రమే ఉన్నారు. అన్ని నిర్ణయాలు వారే చేస్తు న్నారు. ఆఖరికి ప్రాథమిక చట్టమైన రాజ్యాంగ చట్టాన్ని కూడా తడవ తడవకు మారుస్తున్నారు ఈ మార్పుల కన్నిటికీ ప్రజలు అంగీకరించారా? నాయకులకు జడిసి, ఆయన కనుసన్నలలో మెలుగుతూ ఆయన చేతు లెత్తమన్నప్పుడల్లా పార్టీసభ్యులు, ఎన్నికైన శాసన సభ్యులు, చేతు లెత్తడం లేదా? జయజయధ్వానాలు చేయడం లేదా? మరి జరుగుతున్నది నాయకుల రాజ్యంగాక, ప్రజారాజ్యమా?




అవన్నీ కాక, ఉత్తములు, అర్హులు అయిన ప్రతినిధులను వ్యక్తి గతంగానే ఎన్నుకుంటే అట్టి ప్రతినిధులతో కూడిన శాసన సభ, దేశానికి, ప్రజలకు అవసరమైన, ఉపయోగకరమైన కార్యక్రమాన్ని నిర్ణయించి, దానిని అమలుజరప భయపడవలసిన అగత్యం ఏమిటి?

ఈ సత్యాన్ని మన అధికారులు గుర్తించినట్లే మాట్లాడుతారు. అందుకనే అధికార వికేంద్రీకరణ ప్రవేశపెట్టాలని ఆశపడుతున్నారు. అధికార వికేంద్రీకరణ ఒక్కసారిగా పైనుంచి క్రిందివరకు అసలు జరపలేము కనుక పంచాయితీలలో, స్థానిక సంస్థలలో దానిని ప్రయోగించి చూస్తామన్నారు. గ్రామ పంచాయితీలు, పంచాయితీ సమితులు, జిల్లా పరి షత్తులు ఈ వాగ్దానం నుంచి ఉద్భవించినాయి.

## "పంచాయితీలలో కూడా పార్టీలేనా !"

అయితే ఈ స్థానిక సంస్థలు కూడా పార్టీ సిద్ధాంతం మీద నడిస్తే అధికార వికేంద్రీకరణ ఎలా జరుగుతుంది? పార్టీ నియంతృత్వానికి భిన్నంగా అందులో ప్రవేశించిన పార్టీ ప్రతినిధులు ఎలా వ్యవహరించ గలుగుదురు? దురదృష్టవశాత్తు ఈ పంచాయితీ రాజ్యంలో కూడా, పార్టీ పద్ధతి మీదనే ఈ సంస్థల వ్యవహారాలు నిర్ణయింపబడుతున్నాయి.

శాసన సభల మాట ఎలావున్నా స్థానిక సంస్థలలో పార్టీల అవసర మేమిటి? వాటి విభిన్న దృక్పథాల ఉపయోగం స్థానిక సంస్థలలో ఎలా




ఉంటుంది. స్థానిక పరిపాలనలో విభిన్న దృక్పథాలు ఉండడానికి అవకాశ మేమిటి? స్థానిక పరిపాలనలో ఉండే పారిశుద్ధ్యము, ప్రాథమిక విద్య, రోడ్లు, మంచినీటి సౌకర్యాలలో అభిప్రాయ / విభేదాలు ఉండడానికి వీలు లేదుకదా? రాజకీయపార్టీలకు కలదనే ప్రయోజనం ఒక్కటి కూడా స్థానిక పరిపాలనకు వర్తించడానికి వీలుకానిది.

అయినప్పటికీ రాజకీయ పార్టీలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, స్థానిక సంస్థలలో జోక్యం కలిగించుకుంటున్నవంటే దాని భావం విదితమే. అధికారాన్ని పునాదులనుంచి నిర్మించుకోవడానికి, పార్టీ ప్రభావాన్ని సర్వవ్యాపకం చేసుకోడానికి, తద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి మాత్రమే రాజకీయ పార్టీలు ఈ ప్రయత్నాన్ని చేస్తున్నవి.

అధికార వికేంద్రీకరణ అని ఒక వైపు నినాదాలు చేస్తూ దానికి సరిగ్గా వ్యతిరేకంగా, అనగా అధికార కేంద్రీకరణకై ఈ తంత్రం జరుగుతున్నది. ఆలోచనాపరులైన పౌరులు ఈ తంత్రాన్ని ప్రతిఘటించాలి. స్థానిక సంస్థలలోనైనా పార్టీ ప్రభావాలు లేకుండా చూసుకోవాలి.

(అక్టోబరు 1963)

# పోటీలులేని పంచాయితీలు

గ్రామ పంచాయితీలు సక్రమంగా పనిచేయక నిస్తేజమయ్యాయి. అధికారంలో వున్న పక్షం దుర్వినియోగం చేస్తున్న ఈ పంచాయితీలు సక్రమంగా పనిచేసే పరిస్థితులు ప్రస్తుతం దేశంలో లేవు. పార్టీ స్పర్థలు పంచాయితీలను కలుషితం చేస్తున్నాయి.

ఈ పరిస్థితికి కారణమైన ప్రస్తుత పంచాయితీ ఎన్నికల విధానం స్థానే, ప్రజల మధ్య ఏకాభిప్రాయం ద్వారా బహిరంగంగా పంచాయితీ సభ్యుల ఎన్నిక జరగాలి.

గ్రామ పంచాయితీలు ఈనాటివి కావు మానవులు కలిసి జీవించడం మొదలుపెట్టినప్పటి నుంచి, జన పదాలు రూపొందిన నాటి నుంచి పంచాయితీ పరిపాలన ఏదో ఒక రూపంలో అమలుజరుగుతూనే వుంది.

ఆదిలో అది అవసరం కొద్దీ ఏర్పడింది. తొలుత మానవులు ఎవరికి వారుగా విచ్చలవిడిగా బ్రతికేవారు. పెరుగుదలతో వారికి కలిసి జీవించవలసిన అవసరాలు, ఉపయోగాలు తెలిసినవి. జనపదాలు ఉద్భవించాయి. కొంతమంది కలసి జీవిస్తున్నప్పుడు ఎవరికి ఇష్టమొచ్చినట్లు వారు బ్రతకలేరు కదా! వారిలో వారికి అనుషొందిక, సామరస్యం ఉండాలి. ఉమ్మడి అవసరాలు తీర్చుకోడానికి పద్ధతులు ఉండాలి. వాటిని అమలుజరుపుకోడానికి ఒక వ్యవస్థ, దానికి కొంతమంది నియమితులైన పెద్దలు ఉండాలి. ఈ తీరుగా పంచాయితీల పరిపాలన రూపొందాలి.

ఈ బీజం నుంచి, ఈ భావం నుంచి, ఈ వ్యవస్థ నుంచి రాజ్యాలు, సామ్రాజ్యాలు వెలిశాయి. ప్రభువులు, ప్రభుత్వాలు ఉద్భవించాయి. సంస్థలు, సమాజాలు పుట్టాయి. రాజ్యాంగాలు రూపొందాయి. విశ్వ విస్తృతంగా వున్న మానవాళి కంతటికు సాన్నిహిత్యం, సామరస్యం సమకూర్చనెంచిన సర్వరాజ్య సమితి కూడా ఏర్పడింది.

చరిత్రకు అందిన నాటినుంచి భారత దేశంలో గ్రామ పరిపాలన పంచాయితీల ద్వారానే జరుగుతూ వచ్చింది. మౌర్యుల కాలంలో, హర్ష వర్ధనుని రాజ్యంలో, విజయనగర సామ్రాజ్యంలో, తదితర ఆంధ్ర సామ్రాజ్యం విస్తరించివున్న రోజులలో గ్రామ పంచాయితీలు ప్రబలి వున్నాయి. అవి ఈనాటి వాటికంటె బలకరంగా, అధికారవంతంగా వుండేవట.

ఆ పిమ్మట గ్రామ పంచాయితీలు అడుగంటినవి. సాంఘిక విషయాలలో తప్ప పంచాయితీ పెత్తనం లేకుండా పోయింది. గ్రామీణ జీవితంలో, సాంఘిక విషయాలలో పంచాయితీ పెత్తనం ఈనాటికీ కనిపిస్తున్నది. ముఖ్యంగా కొన్ని తెగలలోను, కొన్ని కులాలలోను ప్రస్ఫుటంగా అది ఆచరణలో వున్నది.

"పంచాయితీ క్రమ పరిణామం"

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 1888 వ సంవత్సరంలో మద్రాసు గ్రామ కోర్టుల చట్టం క్రింద పంచాయితీ కోర్టులు ఏర్పాటు అయినవి.




గ్రామాధికారులతోను, ఎన్నికైన సభ్యులతోను నిర్మాణమైన ఈ కోర్టులకు కొన్ని సివిల్, క్రిమినల్ అధికారాలు ఇవ్వబడినవి. యాభై రూపాయల వరకు విలువగల సివిల్ చర్యలు, పదిరూపాయల వరకు విలువ గల ఆస్తులకు సంబంధించిన కొన్ని క్రిమినల్ చర్యలు ఈ కోర్టులో విచారింపబడతాయి. ఉభయ పక్షాలు అంగీకరిస్తే రెండు వందల రూపాయల వరకు కూడా సివిల్ వ్యవహారాలు ఈ పంచాయితీ కోర్టులు విచారించవచ్చును. అయితే ఈ కోర్టులు ఇప్పుడు నామమాత్రావశేషంగా వున్నవి. చాలా చోట్లఆపాటికూడా లేకుండా పోయినవి.

మొదటి యుద్ధం (ప్రపంచ) ముగిసిన తదుపరి మాంటేగ్ జేమ్సు ఫర్డ్ అభిప్రాయాలను పురస్కరించుకొని బ్రిటిషువారు స్వపరిపాలన

కొంత ప్రవేశ పెట్టారు. స్థానిక పరిపాలన అందులో ఒక అంశం. 1920 వ సంవత్సరంలో మద్రాసు రాష్ట్రంలో మద్రాసు లోకల్ బోర్డు చట్టం ఒకటి అమలులోకి వచ్చింది. దాని ప్రకారం జిల్లా బోర్డులు, గ్రామ పంచాయితీ బోర్డులు పుట్టుకు వచ్చాయి. ఆనాటి గ్రామ పంచాయితీలు ఒకవైపు జిల్లా బోర్డుల క్రింద, ఒకవైపు లోకల్ బోర్డు ఇన్‌స్పెక్టర్‌ల పెత్తనాల క్రింద అణిగి వుండేవి. ఈ ద్వంద పెత్తనాలు చాలా ఇబ్బందికరంగా తయారయ్యాయి.

అందుచేత సలహాదారుల హయాంలో గ్రామ పంచాయితీలను జిల్లా బోర్డులనుంచి విడదీసి, ఈ మద్రాసు గ్రామ పంచాయితీ చట్టం 1946 గా రూపొందించారు. ఇది గ్రామ పంచాయితీలకు మాత్రమే సంబంధించిన చట్టం. ఈ చట్టం క్రింద పంచాయితీలపై తనిఖీ అధికారం జిల్లా కలెక్టరులకు వుండేది.

ఆ పిమ్మట ఎన్నికలు జరిగి శాసన సభలు, ప్రజా ప్రభుత్వాలు ఏర్పడినవి. ప్రజా ప్రభుత్వాలకు ఎప్పుడూ మొదటి చూపు స్థానిక సంస్థలపైనే వుంటుంది. వారు 1950 వ సంవత్సరంలో 'మద్రాసు గ్రామ పంచాయితీల చట్టం' రూపొందించారు. కొన్ని మార్పులతో ఆ చట్టమే ఈనాటికీ తెలుగు దేశంలో పంచాయితీ పరిపాలనకు ప్రాతిపదిక. 1955 వ సంవత్సరంలో ఆంధ్ర శాసన సభ ఆ చట్టంలోని కొన్ని ముఖ్యమైన మార్పులు చేసింది.

ఇప్పుడు ఐదువందల జనాభాకు మించిన ప్రతి గ్రామానికి ఒక పంచాయితీ వుంటుంది. అంతకు తక్కువ జనాభా వున్న గ్రామాలను మరొక గ్రామంతో కలిపి ఒక పంచాయితీగా ఏర్పాటు చేయవచ్చును. ఈ గ్రామ పంచాయితీలో రెండు తరగతులున్నవి ఐదువేల జనాభా, పదివేల ఆదాయానికి మించిన పంచాయితీలన్నీ మొదటి తరగతికి చెందినవి. మిగిలినవి రెండవ తరగతి పంచాయితీలు. వయోజన వోటింగ్ పద్ధతిపై

పంచాయితీ సభ్యులను ఎన్నుకుంటారు ఆ ఎన్నికైన సభ్యులు ఒక మహిళను, తమతోపాటు సభ్యురాలిగా ఎన్నుకుంటారు. ప్రతి పంచాయితీలోను ఒక మహిళైనా వుండాలని దీని భావం. ఇలా ఎన్నికైన సభ్యులందరు కలసి తమలోనుంచి ఒక అధ్యక్షుని, ఒక ఉపాధ్యక్షుని ఎన్నుకుంటారు. పంచాయితీ సాధారణంగా మూడేళ్ళు అధికారంలో వుంటుంది. ఈ పంచాయితీలమీద పెత్తనం స్థానిక పరిపాలన ఇన్‌స్పెక్టర్ జనరల్‌పై వుంటుంది మొదటి తరగతి పంచాయితీలకు, అధికారులు వుచితమని భావించిన కొన్ని రెండవ తరగతి పంచాయితీలకు కార్యనిర్వహణాధికారులు ఉంటారు. మునిసిపాలిటీలలో కమీషనర్ వలె, పంచాయితీల నిర్ణయాలను వీరు అమలుజరుపుతారు. పంచాయితీలకు కార్యకర్తలు వీరే.




"పంచాయితీల విధులు"

గ్రామ పారిశుద్ధ్యం, ఆరోగ్యం, పారిశ్రామిక విద్య, రహదారులు, వగైరా గ్రామీణ సౌకర్యాలను పంచాయితీలు కలుగచేస్తాయి. పంచాయితీలకు వచ్చే ఆదాయాలు :— ఇళ్ళ పన్ను, వృత్తి పన్ను, బండ్ల పన్ను, భూమి మార్పిడీలపై విధించే రుసుము భూమి సెస్సులో వాటా, పోరంబోకులపై వచ్చేరాబడి వగైరా.

అయితే ఒక సత్యాన్ని మనం గమనించక తప్పదు. అంగీకరించక తప్పదు. అది ఏమిటంటే — ఏ కొద్దోతప్ప గ్రామ పంచాయితీలు సక్రమంగా పనిచేయడం లేదు. అవి, నిస్తేజంగా, నిరుపయోగంగా వుంటున్నాయి.

అందుకు కారణాలు మనకు చాలా కనిపిస్తాయి. పంచాయితీలు ఇంకా ప్రజల చిత్తంలో ప్రవేశించలేదు. ప్రజాహృదయాన్ని చూరగొనలేదు. కాకపోగా ఎన్నికలు ఆసన్నమయినప్పుడల్లా గ్రామంలో కక్షలు పెరిగి, ధనవ్యయం జరిగి, గ్రామ జీవితం సంక్షోభం చెందుతూ వుంటుంది. అందుచేత పెత్తనానికి ఆశించే కొద్దిమంది పెత్తందార్లు మినహా ప్రజాస్వామ్యానికి పంచాయితీల యెడ ఆసక్తి కలగడం లేదు. అట్టి ఆసక్తి, సాంఘిక విజ్ఞానం ప్రజలలో కలిగించే కృషి జరగడం లేదు.

తరువాత సంకల్పం కలిగినా పంచాయితీలు చేయగలిగిన పని స్వల్పం. అవసరమైన ఆర్థిక స్తోమత వాటికి లేదు. స్వేచ్ఛ తక్కువ. ప్రతి పనికీ అడుగడుగునా అధికారుల అనుమతుల కొరకు దేవిరించాలి. పంచాయితీల బ్రతుకులు పై అధికారుల చేతిలో కీలుబొమ్మలు. అధికారుల మూడవ నేత్రం పంచాయితీల మీద ఎప్పుడు పడుతుందో తెలియదు. పంచాయితీలను రద్దు చేయడం, అధ్యక్షులను తొలగించడం, తరచుగా వార్తా పత్రికలలో చదువుతూనే వున్నాము. కక్షలతో కలుషితమైన రాజకీయ వాతావరణం ఈ పరిస్థితిని మరింత ప్రమాదకరం చేసింది ఇట్టి పరిస్థితులలో ఏ పంచాయితీ అయినా అరమరిక లేకుండా పనిచేయగలదా?

ప్రజాస్వామ్యానికి పంచాయితీలు ప్రాతిపదికలని మనం గుర్తుంచుకోవాలి. పంచాయితీలే పటిష్ఠంగా లేకపోతే పై రాజ్యాంగమంతా పునాది సరిలేని భవనంలాగా బ్రద్దలవుతుంది. ప్రతి మానవుడినీ వ్యక్తిత్వం గల సంఘజీవిగా మనం గుర్తించాలి పంచాయితీ పాలనను, ఆ పై పరిపాలనను ఈ సూత్రం మీదనే మనం నడుపుకోవాలి. లేని పక్షంలో ప్రజా సముదాయం నుంచి కావలసిన, రావలసిన సహకారం రాదు. ఢిల్లీనుంచి, హైదరాబాదు నుంచి మాత్రమే జాతి నవజీవనాన్ని సృష్టించుకోలేము.

పంచాయితీలకు కావలసిన స్వాతంత్ర్యం, ఆర్థిక స్తోమతను నెలకొల్పాలి. ప్రజలకు వాటిలో ఆసక్తి, ఉత్సాహం కలిగించాలి. వారిలో సాంఘిక విజ్ఞానాన్ని ప్రేరేపించాలి. వాటిమీద అధికారుల ఆధిక్యము

కత్వంతో నడుపుకునే వాతావరణాన్ని కల్పించుకోవాలి. పౌరుణ్ణి నవ జీవనోన్ముఖునిగా, కార్యశూరునిగా, వికాసవంతునిగా చేయడానికి గ్రామ పంచాయితీలు రాజమార్గాలన్న సత్యాన్ని మనం విస్మరించకూడదు.

## " అధికార దుర్వినియోగం "

ఆసేతు హిమాచల పర్యంతం నెలకొల్పబడుతున్న ఈ పంచాయితీ విధానాన్ని, అధికారంలో వున్న పక్షం దుర్వినియోగం చేసుకుంటోంది. ఒక్క అధికార పక్షమేకాదు, రాజకీయ పక్షాలే దుర్వినియోగం చేస్తున్నవి.




ఈ పక్షాలు, తమ తమ బలాలను పెంపొందించుకోవడానికి ఈ పంచాయితీలలో, ఈ పంచాయితీ సమితులలో, ఈ జిల్లా పరిషత్తులలో పార్టీ తత్వాన్ని ప్రవేశపెట్టినవి. పార్టీ పద్ధతినే ఎన్నికలు జరుగుతున్నవి. పార్టీ సిద్ధాంతము మీదనే వాటి వ్యవహారాలు జరుగుతున్నవి. ఈ పార్టీ స్పర్థలు, ఈ పంచాయితీ సంస్థలను ఈ పంచాయితీ వ్యవస్థను కలుషితం చేస్తున్నవి. ఈ పంచాయితీ నెపంతో గ్రామ జీవితం కల్లోలమై పోయినది. ఈ ఎన్నికలకై గ్రామాలలో పార్టీలు ఏర్పడి ప్రజా సముదాయంలో చీలికలేర్పడి, కక్షలు పెంచుకొని అంతులేని ధనాన్ని వ్యయంచేస్తూ, గ్రామీణులు ఈ పంచాయితీ వ్యవస్థలో సతమతమవుతున్నారు. ఈ పంచాయితీ రాజ్యం గ్రామీణ ప్రజలకు

స్వతంత్ర్యం ఇవ్వక వారిని రాజకీయ పార్టీల చేతులలో కీలుబొమ్మలుగా రూపొందిస్తున్నది. గ్రామాలకు అనర్థం తెచ్చిపెట్టింది. ఇది ఒక విమర్శ.

ఈ విమర్శలో చాలా సత్యమున్నదని అందరూ అంగీకరించవలసిందే. గ్రామీణ జీవితంతో, పంచాయతి ఎన్నికలతో ఏపాటి పరిచయమున్న వ్యక్తి అయినా ఈ విమర్శను అంగీకరించక తప్పదు. అది యదార్థమైనదేనని ఒప్పుకోక తప్పదు.

అయితే ఆలోచించవలసింది ఒకటి. సిద్ధాంతరీత్యా పంచాయితీ రాజ్యం అవసరమని అనుకున్న తదుపరి, అమలుజరపడంలో లోటు వున్నదని దానిని మనం త్రోసివేయడమేనా? అలా కాకూడదు. లోటు తెచ్చిపెట్టిన ప్రమాదాలను తొలగించుకోవాలి. అమలులో వున్న పంచాయితీ విధానంలో తప్పును సరిదిద్దుకోవాలి.

ఆలోచిస్తే ఈ ప్రమాదానికంతటికి కారణం ఎన్నికలు ఈ ఎన్నికలు వున్నవి గనుకనే పంచాయితీలలో, రాజకీయ పార్టీలు ప్రవేశిస్తున్నవి. గ్రామాలలో కక్షలు బయలుదేరుతున్నవి. స్పర్థలు కలుగుతున్నవి. అమిత ధనవ్యయం జరుగుతున్నది. కనుక ప్రస్తుతానికి పంచాయితీ ఎన్నికలు లేకుండా చేస్తే సరి. ప్రమాదానికి ప్రధాన హేతువులేకుండా పోతుంది.

## "ప్రత్యామ్నాయ సూచన"

ఎన్నికల బదులు ప్రజల వ్యూహాలలో పరిపూర్ణత కలిగే వరకు ఎన్నుకోవడం పెట్టండి. అనగా పంచాయితీ సభ్యులు పదిమంది వుండాలి అనుకోండి. గ్రామస్థులు సమావేశమై ఎన్నిక లేకుండా, పోటీ లేకుండా, ప్రజాభిప్రాయంతో తమలోనుంచి పదిమందిని ఎన్నుకుంటే సరి. అయితే ఇప్పుడున్న పరిస్థితులలో అన్నిచోట్లా ఈ ఏకాభిప్రాయం కుదరదు. లభించదు. అప్పుడు పంచాయితీ సేవ చేయదలచుకున్న వారందరు నామినేషన్లు వేయగా వారిలోనుంచి వోట్లు వేసి ఎన్నిక లేకుండా పదిమంది

సభ్యులను ఏర్పరచవచ్చును. అప్పుడు పోటీలు లేకుండాపోతాయి. స్పర్థలు లేకుండా జరుగుతుంది.

అయితే ఎన్నిక లేకుండాపోతే ప్రజాస్వామ్య సూత్రానికి భంగం కలగదా అనే విమర్శ రావచ్చు. ఎన్నికతోనే ప్రజాభిప్రాయం వ్యక్తం చేయడానికి చాలా మార్గాలున్నవి.

ఈ పంచాయితీలలో సభ్యులను ఎన్నుకోవడం సంవత్సరానికి ఒకసారి పెట్టవచ్చును. లేక రెండు సంవత్సరాల కొకసారే పెట్టవచ్చును. ఒకసారి పనిచేసిన సభ్యులు తిరిగి అయిదేండ్లు, ఆరేండ్ల వరకు ఎన్నుకో




బడడానికి అర్హులు కారనే నియమం ఉండవచ్చును. ఆ విధంగా గ్రామంలో వున్న వోటర్లలో చాలామందికి పంచాయితీలలో పనిచేసే అవకాశం లభిస్తుంది. ఏ ఒక్కరో ఏ కొద్దిమందో వారికున్న సదవకాశాలను పురస్కరించుకొని, పదవిలో శాశ్వతంగా ఉండిపోయే ప్రమాదం వుండదు.

అయితే అర్హులైన వారికి మాత్రమే బాధ్యతను అప్పగించటం కుదరదు కదా అనే విమర్శ మరొకటి రావచ్చును. ప్రతి ఓటరుకు ప్రాథమిక శక్తి సామర్థ్యాలు ఉంటవి కదా? ఒకరిలో లోపించినా లభించిన అవకాశంద్వారా, ఆ వ్యక్తి బాగుపడతాడు. ప్రతి వ్యక్తికీ సదవకాశము లభించడమే కదా ప్రజాస్వామ్యం. అంతన్నిగాక, చేతగానివారు పది

మందిలో ఒకరో, ఇద్దరో అయినా ప్రమాదం లేదు. పని సక్రమంగా జరుగుతుంది.

దీనికి తోడు ఇంకొక ముఖ్య సూచన కూడా గమనార్హం, పంచాయితీ పరిపాలన, అనగా గ్రామ పరిపాలనలోని ముఖ్య విషయాలన్నీ సర్వసభ్య సమావేశంలోచర్చించితే మంచిది. అనగా గ్రామంలోని వోటర్లందరూ ఏడాదికి, మూడు లేక నాలుగు సార్లు సమావేశమై ముఖ్య విషయాలను బహిరంగంగా నిర్ణయాలను గైకొంటారు. ఇదే నిజమైన ప్రజాస్వామ్యం, అసలైన పంచాయితీ పరిపాలన కాదా ?

( మార్చి 1960 )

# బహుముఖ ప్రజ్ఞానిధి
# శ్రీ ఆవుల సాంబశివరావు

మూర్తీభవించిన మానవతావాది, జీవితానుభవం, తాత్విక చింతన ఆకళించుకున్న మేధావి, వ్యక్తిత్వ వికాసానికి నివాళులెత్తే హేతువాది, సునిశిత పరిశీలనా దృష్టిగల న్యాయమూర్తి, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రస్తుత ఉపాధ్యక్షులు శ్రీ ఆవుల సాంబశివరావు బహుముఖ ప్రజ్ఞా విశేషాలకు అద్దం పడుతూ విప్లవ కవి జ్వాలాముఖి జరిపిన ఇంటర్వ్యూ.

మానవ జీవితానికి సంబంధించిన అన్ని రంగాలలో వాస్తవిక జగత్తు ప్రతిబింబిస్తుంది. తద్భిన్నమైనది సాహిత్యంగా నిలువజాలదు. న్యాయశాస్త్రానికి, దాని అమలుకు, న్యాయ పరిపాలనకు, న్యాయమూర్తులు కాని, న్యాయవేత్తలు కాని వాస్తవిక జగత్తుకు దూరంగా వుండలేరు. వాస్తవిక జగత్తుకు సంబంధించిన సాహిత్యంతో సంపర్కం వుంటే న్యాయ శాస్త్రానికి నిండుతనం వస్తుంది. ఉదాహరణకు సెక్సు సమస్యలకు సంబంధించిన లైంగిక నేరాన్నే తీసుకుందాం. మొపాసాను, గుడిపాటి వెంకట చలాన్ని చదివితే న్యాయమూర్తుల దృక్పథం వాస్తవానికి దగ్గరగా ఉంటుంది - నిందితుని అర్థం చేసుకోవడానికి ఉపకరిస్తుంది - మంచి న్యాయవేత్త కావడానికి సాహిత్య సంపర్కం చాలా అవసరం.

"రాజ్యాధికారాన్ని మాత్రమే లక్షించే రాజ్యానికి
క్రాంతిదర్శియైన కవికి వైరుధ్యం"

వుండనక్కరలేదు - వుండవచ్చును - లేకపోవచ్చును - ఆనాటి రాజ్యాధికారాన్ననుభవించే వ్యవస్థను బట్టి అది నిర్ణయింపబడుతుంది చరిత్రలో భావుకత సమాజ పరిణామ క్రమానికి దోహదం చేస్తుంది. క్రాంతి'ని ఉపయోగించుకునే రాజ్యాధినేత వుంటే, కవికి, రాజ్యానికి వైరుధ్యం వుంటే కవికి, రాజ్యానికి వైరుధ్యం నివారింప బడుతుంది - కాకపోతే సంఘర్షణ తప్పదు - క్రాంతి దర్శియైన కవి చైతన్యాన్ని ఉపయోగించుకొని, రాజ్యం ఇంకా ఉజ్జ్వలం కావచ్చు. ఈ వైరుధ్యం వచ్చినప్పుడు న్యాయశాస్త్రం కవికీ, రాజ్యానికి సమన్వయం చేయవచ్చు కాళ్ళకూరి నారాయణరావుగారి 'వరవిక్రయం' గురజాడ వారి 'కన్యా శుల్కం' రాజ్యం ఉజ్జ్వలం కావడానికి ఉపకరించి సామాజిక రుగ్మతల్ని నయం చేశాయి. కవికి, రాజ్యానికి మధ్య సమన్వయ వ్యాఖ్యాత న్యాయ శాస్త్రం ప్రగతిపథాన్ని నిర్దేశించే క్రొత్తభావం వచ్చినప్పుడు న్యాయమూర్తి

ప్రేరితుడై లేక ప్రభావితుడై వున్నట్లయితే పార్లమెంటువారి కొత్త చట్టానికి యుగధర్మాన్ని ప్రతిబింబించే కొత్త భాష్యాన్ని చెప్పవచ్చు. సాహిత్య పరిజ్ఞానం రాజ్యానికి, న్యాయశాస్త్రానికి కనువిప్పులా ఉపకరించ వచ్చు. విజ్ఞతతో వైరుధ్యాలు పరిష్కృతమవుతాయి.

"నైతాళిక పాత్రను నిర్వహించే రచయిత
రాజకీయాలకు అతీతంగా"

మానవ జీవితంలో రాజనీతి ఒక భాగం - అలాంటి రాజకీయాల కతీతంగా కవి ఉండలేడు - ఎన్నికల్లో పాల్గొనడం శాసన సభ్యులుగా ఉండడం లాంటి పదవీ రాజకీయాల కతీతంగా రచయిత ఉండగలడు. రచయితకు సంఘ జీవితంలో ఒక భాగమైన రాజకీయ దృక్పథంతో సంబంధం ఉండవచ్చు, కాని పదవులతో కాదు - రచయిత వైతాళికు డైనప్పుడు 'భావన'లో జాతిని ముందుకు నడుపుతాడు. దాని అర్థం భౌతికంగా ముందు నడవడం కాదు. ఆ పని రాజకీయవేత్తది ఫ్రెంచి విప్లవానికి రూసో, రష్యన్ విప్లవానికి గోర్కీ మున్నగు రచయితలు ఆ విప్లవాల్లో పాల్గొనకుండానే వాటిని ప్రభావితం చేశారు రచయితలుగా గాంధీ, నెహ్రూలు స్వాతంత్ర్యోద్యమానికి మొదట పునాదులు వేశారు. ఆ తర్వాత రాజకీయవేత్తలై పాల్గొన్నారు.

"కవులు నిరంకుశులా?"

కవికి అంకుశం ఉన్నట్లయితే కవిత్వం అభివృద్ధిలోకి రాదు. కొంతవరకు కట్టడిలేని విధానం అవసరం ఈ పద్ధతిలోనే రాయాలి అంటే పొసగదు - మంచి రచన రాదు - అయితే సమాజ కల్యాణం దృష్ట్యా ఒక పరిధి మాత్రం అవసరం. పిల్లల్ని రెచ్చగొట్టే పెర్రి మొర్రి సెక్సు రచనలు లాంటి వాటికి ఒక హద్దు ఉండితీరాలి - కట్టడి వుంటే భావుకత పెరగాల్సినంతగా పెరగదు - భావనా లోకం స్వేచ్ఛగా ఆరోగ్యవంతంగా పెరుగుతూ మానవ కల్యాణాన్ని తీర్చిదిద్దాలి.

"సామాజిక పురోగమనానికి తోడ్పడే సాహిత్యం రాజకీయ విధానంగానే అభివృద్ధి చెందితే..."

అలాగయితే సాహిత్య పురోగమనం కుంటుపడుతుంది - పురోగమనం అంటే రాజకీయ, సాంఘిక, ఆర్థిక రంగాలకు సంబంధించిన విస్తృతాంశం అన్నమాట - అప్పుడే సమగ్ర ప్రగతి సమాజానికి సాధ్యం. ఇందులో వైయక్తిక పురోగమనం చాలా ముఖ్యం - ఒకదాని కొకటి విరోధం కాదు, దోహదం. సాహిత్యం అన్నివిధాలా సమగ్రంగా ఉండాలి. అదే జీవిత విధానం.

"భారతీయ సాహిత్యంలో దృష్టి నాకర్షించిన ప్రాచీన ఆధునిక రచయితలు"

దార్శనికుల్లో: కణాదుడు: సంస్కృతంలో కాళిదాసు, భాసుడు, తెలుగులో కవిత్రయం, పోతన, వేమన, ఆధునికుల్లో కందుకూరి, గురజాడ, తిరుపతి వేంకట కవులు, చలం, శ్రీశ్రీ, బాలగంగాధర తిలక్, నార్ల వెంకటేశ్వరరావు, త్రిపురనేని రామస్వామి, గోపీచంద్, రచయిత్రులలో రంగనాయకమ్మగారు.

"రవీంద్రుడు, శరత్ బాబు, ప్రేమ్‌చంద్ లాగా చెప్పుకోదగ్గ రచయితలు"

నిస్సందేహంగా ఉన్నారు - అంతటి పేరు రాకున్నా అలాంటి భావుకతను, సృజనాత్మక శక్తిని ప్రదర్శించిన రచయితలున్నారు. శరత్ బాబులాగ కథ నడిపినవారు గోపీచంద్, బుచ్చిబాబు. చలం దృక్పథం వేరు కావచ్చు.

ఉన్నవవారి "మాలపల్లి" తెలుగువారి "సమగ్రమైన జాతీయ నవల"

అని అనడానికి వీల్లేదుకాని, మొట్టమొదటిసారిగా సామాజిక దృష్టిని తెచ్చిన తెలుగు నవల "మాలపల్లి."

## "తెలుగులో తాత్విక చింతనగల నవలలు"

ప్రత్యేకంగా దానికోసం రాసినవి లేకపోవచ్చుకాని 'మాలపల్లి'లో రామదాసు పాత్ర -మనిషి మనస్సు ప్రకృతి సంబంధం జీవిత అన్వేషణ లాంటివే తాత్విక చింతనను గుర్తు చేస్తాయి - గోపీచంద్ రచనలు ఈ అన్వేషణ సాగించాయి - అతని 'మెరుపుల మరకలు'లో కేవలం శరీర సుఖం కోసం బ్రతికిన పాత్ర ఆధ్యాత్మికంగా పైకి ఎదిగినట్టుగా ఉంది.

## "ఇంతవరకు కన్యాశుల్కం వంటి మరో మంచి నాటకం"

లేకపోవడానికి కారణం ప్రచారం లేక వస్తున్న కొత్త నాటకాలు వెనుకబడుతున్నాయి. సినిమాకు, నాటక రంగానికి పోటీలేని ప్రోత్సాహం ఉండాలి-నాటక ప్రయోజనం అంతరించిపోలేదు. సమాజం మీద గాఢమైన ముద్రవేయగలిగే దృశ్యకావ్యమే నాటకం-అది సినిమాలకన్నా బలమైంది-దాని అవసరం చాలా ఉంది.

## "తెలుగువారి సాహిత్యం [illegible] అనుకరణను అధిగమించడం"

కేవలం అరిష్టం అనుకోను .. ఇది స్వతంత్ర రచనలో కూడా బీజప్రాయంగా ఉండి మొగ్గతొడిగి పుష్పించి ఫలిస్తుంది - కవిత్రయంతో ప్రారంభమైన అనుకరణ ఇంకా తెలుగు సాహిత్యంలో మోతాదును మించే ఉందనవచ్చు.

## "ఆడవారు సమగ్రమైన నవలలు రాయలేదని నోబెల్ బహుమతి గ్రహీత అయిన రష్యన్ రచయిత షోలఖోవ్ ఓ మారు అన్నమాట"

అంగీకరించను - ప్రతి సమాజం కూడా స్త్రీని అణచి వుంచింది. ఏ దేశంలోనైన స్త్రీకుండే అంతస్తు అలా తొక్కివేయబడింది - వాస్తవానికి జీవితాన్ని పరిశీలించే అవకాశం స్త్రీ కెక్కువవుంది - బిడ్డను కనే

అనుభూతి పురుషుడి కెక్కడిది? స్త్రీ కవకాశం లభిస్తే కవిత్వం వగైరా సాహిత్య ప్రక్రియలలో కూడా అద్భుతంగా రచనలు చేయగలదు.

"అన్నప్రాశన ఎరుగని తెలుగు సమాజానికి ఆవకాయ ఘాటు నందించిన"

చలంగారిది షాక్ ట్రీట్‌మెంట్ - అది ఘాటైనదే కాని నెగటివ్ ధోరణి కాదు - స్త్రీ పురుష సంబంధాల్ని లైంగికంగా మాత్రమే తీసుకున్నాడు - పురుష ప్రధానమైన సమాజంలో ఆడవాళ్ళ కోరికలు, వాంఛలు కూడా అంతే ప్రబలంగా ఉంటాయని ఎత్తి చూపాడు - అవి స్త్రీ పురుషులలో సమపాళంగా ఉంచేనే సమాజం ఆరోగ్యవంతం కాగలదని, స్త్రీ స్వేచ్ఛాప్రవృత్తిని చూపడం ద్వారా పురుషుని నిరంకుశ అరాజక కామ ప్రకోపం అరికట్టబడగలదని చలం లక్షించాడు. ఇది పాజిటివ్ ధోరణేకాని నెగటివ్ ధోరణి కాదు

"గోపీచంద్ గారి 'అసమర్థుని జీవయాత్ర' చివరకు నిరాశా వాదానికే దారి యిస్తుంది"

అని నేననుకోను - సీతారామారావు పాత్ర చివరికి చితికిపోయి అది మధ్యతరగతి కుటుంబ జీవితానికి ఒక హెచ్చరిక.

"తెలుగు సినిమాలు ఇటు కౌటుంబిక సెంటిమెంట్లను, అటు సామాజిక మూఢనమ్మకాలను గ్లోరిఫై చేసేదాకా పతనం కావడం"

భావ దారిద్ర్యం కాదండి - నిర్మాతలకు రూపాయి అణా పైసలు కావాలి. ప్రజల్లో సెంటిమెంట్లు, మూఢ నమ్మకాలు మాత్రమే ఉన్నవను కొని అలా సినిమాలు తీస్తున్నారు-సినిమాల గురించి మీరన్నది మాత్రం నిజం - అది రచయితల భావ దారిద్ర్యం కాదు, కేవలం వ్యాపార దృష్టి

నారినలా పతనోన్ముఖం చేస్తున్నది - చూసే ప్రజలుకూడా మారాలి
నిర్మాల్యం" 'చమ్మీన్ (మళయాళం) లాంటి సినిమాలు రావాలి. 'నిర్మా
ల్యం' పెట్టుబడి కేవలం లక్షా డెబ్భైవేలు. నిర్మాల్యం హీరో తీసుకున్నది
ఐదువేలు మాత్రమే. మన తెలుగు సినిమాలు అందుకు పూర్తిగా విరుద్ధం.
తారలకు చెల్లించే సొమ్మే సినిమా దృక్పథాన్ని మార్చివేస్తున్నది - ఇదే
పలాయన వాదానికి దారి తీ స్తున్నది - ఈ పద్ధతి మారాలి.

"రచయితలకు వుండే"

ఈ సంఘాలు ట్రేడ్ యూనియన్లలాగా కాక రైటర్స్ వర్క్‌షాప్
లాగా ఉండాలి. రచనలకు సంబంధించిన ముద్రణ అమ్మకాల సదుపాయాల
కోసం పనిచేయాలి - జన కల్యాణానికి భంగం కలగనంతవరకు రచనా
స్వాతంత్ర్యం ఉండాలి ఆ హక్కు కోసం కృషి చేయాలి.

"బుచ్చిబాబు హృదయ దౌర్బల్యానికి ప్రతిబింబమైతే,
గోపీచంద్ ఆలోచనల సంకెళ్ళకు బందీ అయ్యాడు"

సామాజిక పరిణామాన్నివారు వస్తువుగా స్వీకరించలేదు - సమా
జంలో మనుషులు ఏవిధంగా బందీలవుతున్నారు, దృఢనిశ్చయం లేకుంటే
వ్యక్తిత్వం నశిస్తే కోరికల్ని అణిస్తే ప్రతిఘటన లేకపోతే ఎలా పతనమై
పోతారు అనేది వారు ప్రముఖంగా చూపారు.

"ఇంకా తెలుగునవల దత్తపుత్రికేగాని, కన్నబిడ్డ కాదు -
దాన్నింకా రచయితలు అవినీతి బిడ్డగా మలుస్తున్నారు"

అంతేమరి - ఇది ఒక్క తెలుగుకే కాదు అన్ని భాషలకు వర్తి
చాలామంది కాలక్షేపం కోసం రాస్తున్నారు-సినిమాలకోసం సినిమా
గా రాస్తున్నారు - లోతుపాతుల్లేవు - గుండె తడిలేదు
చూసే దృష్టి లేదు - ఆవేదన కనిపించదు.

న ప భా వ స

"జన జీవితాన్ని ప్రతిబింబించే తెలుగు సాహిత్యం మధ్యతరగతి రాగద్వేషాల స్థాయిని దాటలేదవడం"

నిజమే-రాచకొండ విశ్వనాథశాస్త్రి లాంటి వాళ్లు తప్పితే పాటకజనపు కష్టసుఖాలు ప్రతిబింబించే నవలలు రాసేవారు లేరు అలా రాసినవి చాలా కొద్దిగానే ఉన్నాయి. శాస్త్రిగారుకూడ పరిమితంగానే ఉన్నారు. అట్టడుగున పడివున్న వారి బాధల గురించి చెప్పే సాహిత్యం ఉండాల్సినంతగా ఉండడం లేదు. వచన కవిత్వంలో ఇప్పుడిప్పుడే సామాన్య మానవుడి కష్టసుఖాలు ప్రతిబింబిస్తున్నాయి - కాని వైవిధ్యం లేక దృష్టి నాకర్షించడం లేదు.

[తాత్త్విక చింతనగల సాంబశివరావుగారు సాహిత్య ప్రపంచం నుంచి ఆలోచనా క్రమాన్ని సంపుటీకరిస్తూ వాస్తవ పరిస్థితుల కనుగుణంగా వ్యాఖ్యానం సాగించారు.]

భావనాశక్తిని ప్రతిబింబించే సాహిత్య ప్రపంచానికే కావలసిన ఆత్మానుభూతిని వారెంతగా అర్థం చేసుకున్నారో, అంతగా తాత్త్విక లోకానికి సంబంధించిన తార్కిక దృక్పథాన్ని సొంతం చేసుకున్నారు – కాబట్టి–వారి సమాధానాలు జ్ఞాన దీపికలు.

"మత ప్రాబల్యం గల భారత సమాజంలో నాస్తికత్వం అభివృద్ధి చెందడం"

చాలా కష్టం. కాని నాస్తికోద్యమం వల్ల మతం పేరిట, దేవుని పేరిట కొనసాగుతున్న పిచ్చిపనులు, కొట్లాటలు మున్నగు అరిష్టాల పట్ల విరక్తిభావం ఏర్పడగలదు. ఈ సందర్భంలో మేధావులు జాగ్రత్తగా ఆలోచించి పరిస్థితుల్ని, పరిణామాల్ని సద్వినియోగం చేసుకోవాలి. మతానికీ, సంఘజీవితానికీ ఏమాత్రం సంబంధం ఉండకూడదు – లౌకిక రాజ్యం లక్ష్యంకూడా ఇదే. దీన్ని చాలామంది పొరబాటుగా అర్థం చేసుకుంటున్నారు. వివేకం ఉన్నవాళ్ళే దీన్ని సక్రమంగా ఆదరిస్తారు. అందుకే స్వర్ణసింగ్ కమిటీకూడా దేశానికి సెక్యులర్ అనేదాన్ని

జోడించాలని సూచించింది. దేవుడితో నిమిత్తంలేకుండా తన జీవితాన్ని తానే నిర్మించుకునే స్వయంశక్తి సంపన్నుడు మానవుడు. స్వయం సమృద్ధికి అతీతశక్తి ప్రమేయం లేదు. ఇదే నాస్తికోద్యమం నిర్దిష్టమైన పాత్ర. ఇలా ఈ సమాజంలో క్రమంగా అభివృద్ధి చెందడానికి అవకాశం వుంది.

"దేవునిభావన" "మతవిశ్వాసం" మున్నగు పరిమితులకు మూలం "శ్రమదోపిడి" అనడం"

మొదట ఏమోకాని ఇప్పుడు మాత్రం అవి అంధ విశ్వాసానికి దారితీస్తున్నాయి. ఎవరు ఏ వ్యవస్థను పరిరక్షించుకోదలచుకున్నా వారు దేవుణ్ణి – మతాన్ని తెచ్చి పెడుతున్నారు. దోపిడీ చేయదలుచుకున్నవారికి ఈ విశ్వాసాలు ఉపయోగకరంగా, లాభసాటిగా ఉన్నాయి. దేవుని భావన దోపిడికి దారితీస్తుందనికాదు, కాని అది ఆధారం కావచ్చు.

"నేటి సమాజంలో ఇంటా బయటా బహుళంగా కన్నిటికి కారణం"

టూకీగా చెప్పాలంటే–విలువలు మారాలి. అభిప్రాయాలు మారాలి, అప్పుడు సమాజం మారుతు-ది. ప్రతిబంధకమైన పాత విలువల్ని కూల దోసి కొత్తవిలువల్ని ప్రతిష్ఠించాలి. వీరేశలింగంపంతులుగారు బాల్య వివాహాల్ని కాదన్నారు. వితంతు వివాహాల్ని ప్రవేశపెట్టారు. కుల నిర్మూలన మతం, దేవుడు విషయంలో అలాంటి కొత్తప్రమాణాలు రావాలి.

"సంస్కరణ వాదానికి కాలం చెల్లిపోయిందనడం"

నేనలా అనుకోను. సంస్కరణ విప్లవానికి భిన్నంకాదు. సంస్కరణ ఒక మెట్టు. సమూలంగా మారడానికి విప్లవం, సంస్కరణ ఒక్కొక్క మెట్టు లాంటివి. బలప్రయోగం లేకుండా మనిషి మారితే ఆ మార్పు చిరకాలం నిలుస్తుంది ఇది మౌలికమైన మార్పు. ఇది విప్లవాత్మకంకూడా. దీనికి

కాలం చెల్లలేదు. వీరేశలింగంపంతులుగారు దేవుడు, మతం, మూఢ నమ్మకాలు, మున్నగు వాటిని హేతువాదంతో పరిశీలించేటట్లు చేశాడు. వీటిని ప్రశ్నించేటట్లు చేసింది సంస్కరణవాదం. మనిషిలో వ్యక్తిత్వానికి పునాదులు పడ్డాయి. ఇదే లేకుంటే విప్లవం లేదు. సమాజంలో వ్యక్తి బేసిక్ యూనిట్ మారాలి. దాన్ని సూచించేదే సంస్కరణవాదం. సంస్కరణవాదం మూఢనమ్మకాల్ని ప్రశ్నార్థకము చేసే విజ్ఞత

"మనల్ని నిత్యం ముంచివేస్తున్న అన్యాయము, అక్రమము,
దోపిడి, దౌర్జన్యము వగైరా సాంఘిక దుర్మార్గాలకు
కారణము పూర్వజన్మ ప్రారబ్ధము"




కానేకాదండి – నాల్గురూపాయలు రావలసినచోట రూపాయి వస్తున్నందుకు ఆ అన్యాయానికి గురైనవాడు, ప్రారబ్ధము కాదనీ ఎదుటి వాడి మోసమనీ గుర్తిస్తున్నాడు. మూఢనమ్మకము పోతున్నది సామాన్యుడిలో. స్వార్థపరుడైనవాడు మూఢనమ్మకాన్ని ఆలంబనగా చేసుకొని తన స్వార్థాన్ని కొనసాగించదలిచాడు. దానికి కాలదోషము వచ్చింది.

"మన సమాజాన్ని మౌలికంగా మార్చగలిగే తాత్విక
ధోరణిగల భావవిప్లవము రాజకీయ విప్లవానికి"

'భిన్నమైనది' భావ విప్లవము. ప్రతి పౌరుణ్ని ఆవరించి వుంటుంది. దీని ఫలితమూ, పరిణామమే రాజకీయ విప్లవము.

"కుటుంబ జీవితంలో కూడా మానవ సంబంధాలు సంక్షోభానికి గురికావడానికిగల కారణం నేటి"

ఆర్థిక వ్యవస్థే కాదు. స్త్రీ పురుషుల మధ్య వున్న ఆస్తి ఎక్కువ తక్కువలు కొంతకారణం అయితే సంక్షోభానికి కారణం చాలా వరకు మనిషికుండే సాంఘిక విలువల్ని బట్టి ప్రతిబింబిస్తూంది. మగస్వేచ్ఛ ఆడ స్వేచ్ఛను హరించి వేస్తున్నది.

"శీలం అమ్ముకొని బతకాల్సిన దుస్థితికి నెట్టబడ్డ సమాజానికి నాగరికతా స్థాయి"

సుతరామూ రాలేదు-పురుషుడు కూడా ఈ నాటి నవీన సమాజంలో సెల్ఫ్‌ని అమ్ముకొంటున్నాడు - నమ్మకం వున్నా లేకున్నా ఉద్యోగధర్మం అని శీలాన్ని పణం పెడ్తున్నాడు - క్యారక్టరు అమ్ముకొనడం క్షమించ రాని సాంఘిక నేరం.

"మన సమాజం (స్త్రీ) వ్యభిచారానికి ఒక కులాన్ని కేటాయించడం దుర్మార్గం"

ఇది పురుష ప్రాధాన్యతగల సమాజం - ఆడ బోగంవాళ్ళున్నట్టు మగ బోగంవాళ్ళెందుకు లేరు - సాహిత్యంకూడా పురుష ప్రధానమైనదే- ప్రతి స్త్రీ పురుషుడు చేసేది శృంగారమైనది. స్త్రీ పురుషుడితో జరిపేది శృంగారం కింద రాక వ్యభిచారం కింద జమకట్టబడింది.

"ఒక స్త్రీని మరొక స్త్రీ ద్వేషించినంతగా పురుషుడు కూడా ద్వేషించడు అనే రవీంద్రుని వ్యాఖ్య"

నేనొప్పుకోను - పురుషుడూ అంతే - స్త్రీ అంతే-

## "ఆత్మహత్యలు, హత్యలు జరిగే సమాజం ఇంకా అమానుషం"

ఆర్థికంగా, సామాజికంగా, లైంగికంగా, అసమానతలు ఉన్నంత కాలం, మానవ విలువలు గుర్తింపబడనంతకాలం హత్యలు, ఆత్మహత్యలు అమానుషంగా జరుగుతాయి. అలాంటి సమాజాన్ని అమానుషమనే భావించాలి. హత్యల ఆత్మహత్యల సంఖ్య తగ్గితే నాగరికత పెరిగినట్లు గుర్తించాలి.

## "రేపెట్లా" అనే భయం ఈనాటి మానవుణ్ణి పతనోన్ముఖం చేస్తూ వుంది"

రేపటిభయం ఒకటే కాదు నేటి భయంకూడా. అసలు ఇవ్వాళ గడిచేది ఎట్లా–అనేదే ప్రమాదకరంగా తయారైంది. ఎవరి శక్తికి తగ్గట్లు వారు కృషి చేసి అనుభవించేటట్లు, అవకాశం అందరికీ కలిగేట్లు ప్రభుత్వం చూడాలి. దానితో అందరి సహజశక్తులూ వికసిస్తాయి. లేకపోతే నేడు, రేపులమధ్య సతమతమవుతూ మానవుడు గుర్తుపట్టనంతగా మారిపోయి పతన మవుతాడు–జాతి నిర్వీర్యమవుతుంది – మనిషే చికిత్సకి దొరకని వ్యాధిగా మారే ప్రమాదం వుంది.

## "మాతృభాషగా పరిగణింపబడే సంస్కృత భాష"

వాడుకలో లేదు కాబట్టి మృతభాషే. ఎవరైనా సంస్కృతాన్ని గ్రీకు చదివినట్లు చదువుకోదలిస్తే అభ్యంతరం లేదు. సంస్కృతాన్ని రాజభాషగా, బోధనాభాషగా చేస్తానంటేనే కాదనాల్సివస్తుంది. సంస్కృతం సాహిత్యంగా చదువుకునేవాడితో పేచీలేదు. ఆకాశవాణివాళ్ళు ఉచ్ఛరించి నట్లుగా ఔత్తరాహులు ఉచ్ఛరించలేరు – సంస్కృతంపట్ల భక్తి గౌరవాలు వున్న వారిని సంతృప్తిపరచడానికి కాబోలు ఆకాశవాణి వార్తలు సంస్కృతంలో కూడా వస్తున్నాయి.

"భగవద్గీత ఇంకా సమాధానం తేలని శేషప్రశ్నే కాని,
సంక్షుభిత మానవాళికి విముక్తి కాదనేది"

కష్టమైనప్రశ్నే. హిందూమత ప్రాబల్యాన్ని తెలియచేస్తుంది భగవద్గీత. పోతనగారన్నట్లు, పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట. ఇలాగా ప్రతిచోట అతీతశక్తి తానున్నానని మనిషి తార్కికశక్తిని దెబ్బ తీస్తుంది – కాని లోకమాన్య బాలగంగాధరతిలక్ గారు 'కర్మయోగి' వ్యాఖ్యానాన్ని చేశారు. చేయి లేక చాపు అన్నారు. డా-ఆర్ వై. మానవ శక్తిని పరిమితంచేయడానికి భగవద్గీత ఎక్కువ ఉపయోగపడుతుంది– అలాగే ఉపయోగిస్తున్నారు ఆస్తికులు.

"ఈనాటి మేధావి పలాయనవాది"

బి. ఎ., యం. ఎ. చదివినంతమాత్రాన లాయరు, డాక్టరు, ఇంజనీరు అయినంతమాత్రాన మేధావి అని గుర్తించజాలం .. చదువుకున్న (బాగా) ప్రతివాడూ మేధావి కాలేడు. స్వతంత్రంగా ఆలోచించుకొని చర్చించి, నిగ్గు తేల్చగలిగినవాడే మేధావి మన మొదటి ప్రధాని గొప్పమేధావి. కాని అలాంటి దేశంలో మేధావులు జనానికి దూరమై తమలోకి తాము కుంచించుకపోతున్నారు. మేధావుల్ని కలుపుకోగలిగే ఉద్యమాలు కూడా లేవు. ఇక్కడ డాక్టరు డాక్టరుగానే చూడబడతాడు రాజ్యం కూడా మేధావుల్ని వినియోగించుకోవాలి ఆధునికసమాజంలో మేధావుల పాత్ర తప్పనిసరిగా వుండాలి

"విద్యాలయాల పాఠ్యాంశాలలో హేతువాదం,
నాస్తికత్వం తప్పనిసరి॥"

మన సత్వ శాస్త్రం వగైరా లాగానే సాంఘిక శాస్త్రంలోకూడా నాస్తికత్వాన్ని, హేతువాదాన్ని నిష్పక్షపాతంగా చెప్పాలి. ఈ చెప్పడాన్ని నిషేధించకూడదు. విద్యార్థుల అభిప్రాయాలు పెరిగేటట్లు చూడాలి – కవి

రాజాగారి 'ఖూనీ' 'సూతపురాణం' లాంటివి పాఠ్యాంశాలు కావాలి. మనిషిని ప్రభావితంచేసే అన్నిరకాల రచనల్ని ఆచరణబద్ధమైన పాఠ్య గ్రంథాలుగా పెట్టుకొనడం చాలా అవసరం. ఆర్థిక శాస్త్రంతో పాటు కమ్యూనిస్టు ఆర్థికశాస్త్రం, ఆస్తికత్వంతోపాటు విద్యార్థులకు నాస్తికత్వంకూడా చెప్పాలి. అందుకు తగిన ఓపెన్ మైండ్ విద్యావేత్తలలో వుండాలి. అన్ని రకాల దృక్పథాలూ తెలిస్తే విద్యార్థుల మానసిక వికాసం జరుగుతుంది.

### "మన పండుగల్లో ఎక్కడో సామాన్యుడి ప్రమేయం గుర్తింపు"




సంక్రాంతి, దసరా పండుగల్లో కనిపిస్తుంది. ఆ వేడుకల్లో సామాన్యుడిని మిథ్యపరుస్తున్నారు

### "రాజ్యాంగంలో సామాన్యుడికి, సగటు జీవితానికి ఎలాంటి రక్షణలు"

ఆదేశిక సూత్రాలు అందరికీ పని వుండేటట్లు, పసిపిల్లలు గనుల్లో పని చేయకుండా వుండేటట్లు నిర్దేశిస్తున్నాయి. ఆదేశిక సూత్రాల లక్ష్యాన్ని అమల్లో సాధించేట్లు చూడాలి. సగటు జీవితానికి రక్షణ ఆదేశిక సూత్రాల్లో వుంది. ఇతర రక్షణలు ప్రాథమిక హక్కుల్లో వున్నాయి.

"కోర్టులో గెలిచినవాడు అయిన ఖర్చుకు ఏడుస్తాడు.
ఓడినవాడు ఖర్చుకు, ఓటమికి ఏడుస్తాడు"

కోర్టు ఫీజు విపరీతంగా వుంది. లిటిగేషన్ కాలం కూడా చాల వుంది. ఖర్చు, కాలయాపన తగ్గాలి. ప్రొసీజర్ కూడా తగ్గాలి. ప్రామిసరీ నోట్ల విషయం ఇరవై రోజుల్లో పూర్తయేట్లు చూడాలి. అలాంటప్పుడు న్యాయవాదులతో నిమిత్తం లేకుండా పని జరుపుకోవచ్చు.

"ఉన్నత న్యాయస్థానాలుకూడా ప్రాంతీయభాషలలోనే"

దిగువ న్యాయస్థానాలు సాక్షుల విచారణలాంటి వాటిని తెలుగులోనే నిర్వహిస్తున్నాయి. దేశంలో ఇప్పుడు సీలింగు చట్టం (కొద్ది తేడాతో) సుమారు ఒకటే తీర్పులు భిన్నమైన భాషల్లో వస్తే ఇతర ప్రాంతాలు అర్థం చేసుకోవడం చాలా కష్టం. ఇప్పటికీ భారీ ఖర్చులతో నిర్వహింప బడుతున్న కోర్టులు అనువాదాన్ని భరించలేవు. ఏదైనా ఒకటి లింకుభాషగా నిర్ణయమైతే (హిందీకాని, మరేదైనా కాని) 15, 20 సంవత్సరాల కాలంలో మిగతా న్యాయస్థానాలు ప్రాంతీయ భాషల్లో తీర్పులు చెప్పవచ్చు. ముఖ్యమైన విషయం మాత్రం, ఉన్నత న్యాయస్థానాల్లో ఒకే భాష ఉండా లన్నది.

"అతి పవిత్రమైనదిగా చెప్పబడే భార్యాభర్తల సంబంధాలు,
తండ్రీ కొడుకుల వాత్సల్యాలు, తల్లిదండ్రుల అనుబంధాలు,
అన్నదమ్ముల ఆప్యాయతలు చివరకు మతపరమైన
విశ్వాసాలు కూడా కోర్టుదాకా వెళ్ళడం"

సందేహం లేదు. 'వ్యక్తి-ఆస్తి' ఒక్కటే కారణం కాదు. అన్ని రకాల తగాదాలకు ఎలిమెంటరీ ఆఫ్ ప్రాపర్టీ కారణం కావచ్చు. ఆస్తి సమాజపరం అయినంత మాత్రాన అన్ని సమస్యలూ పోవు, తగ్గుతాయి. వైయక్తికమైన తగాదాలు ఎప్పుడూ ఉంటాయి.

"అభిప్రాయాల సంఘర్షణకు తావీయని రాజ్యాంగం
పరిణత సమాజాన్ని ఆవిష్కరింప"

చేయగలదని నేననుకోను. అభిప్రాయాల స్వేచ్ఛకు అవకాశం వుండాలి. సంఘర్షణ, వైవిధ్యం వున్న సమాజం ముందుకు నడుస్తున్నట్లు లెక్క. ఆలోచనలకు హద్దులు వస్తే సమాజానికి సంకెళ్ళు పడ్తాయి సాంఘిక జీవితం అభివృద్ధి చెందక వికాసానికి భారంగా వుంటుంది.

"ఎన్నికలద్వారా న్యాయమూర్తుల్ని నిర్ణయించాలని"

నేననుకోను. అలా వుంటే న్యాయమూర్తి నిష్పక్షపాతంగా వుండలేదు. సుస్పష్టంగా నిర్వచించబడిన ఒక సంఘం లాంటిది న్యాయమూర్తుల్ని నిర్ణయించవచ్చు.

"స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయస్థానాలు ప్రజలకు బాధ్యత
వహించాలిగాని పార్లమెంటుకు కాదని కొందరి"

వాదన సరైనది కాదు రాజ్యాంగం పార్లమెంటుకు శాసనాధికారాన్నిచ్చింది. దాన్నమలుచేసే బాధ్యత పరిపాలనా వ్యవస్థపై వుంది. పార్లమెంటు శాసనాల పరిధిలో న్యాయస్థానాలు ప్రజల హక్కుల్ని రక్షిస్తాయి. ఇక్కడ రెంటికీ వైరుధ్యం లేదు. పార్లమెంటు, న్యాయస్థానాలు పరస్పరం సహాయకారులు.

"ధర్మాసనంపై కూర్చున్నప్పుడు ఆనాటి అనుభవాల
ప్రభావం వైయక్తిక ఇష్టాయిష్టాలు -ప్రత్యక్షంగానో,
పరోక్షంగానో ఆ న్యాయమూర్తిపై"

ఉండవనడం హిపోక్రసీ. ఆనాటి ప్రభావాలు కొంత కొంత పని చేస్తాయి. న్యాయమూర్తి కూడా మానవ మాత్రుడే కదా! న్యాయశాస్త్ర

బద్ధమైన శిక్షణవల్ల వ్యక్తిగత అభిమానాలు పోతాయి. ఒక పరిపాలనాధి కారి జారీచేసిన ఆజ్ఞాపత్రానికి, న్యాయమూర్తి ఇచ్చిన తీర్పుకి స్పష్టంగా భేదం కన్పిస్తుంది. నిజమైన జడ్జి వ్యక్తిగతమైన ప్రభావాల కతీతంగా వుంటూ ధర్మాసన పవిత్ర బాధ్యతను నిర్వర్తిస్తాడు. జుడీషియల్ ట్రైనింగ్ అతణ్ణి దురావేశ రహితుడిగా మార్చగలదు.

"ఉరిశిక్ష వేస్తున్నప్పుడు జడ్జి మానసికంగా గురి అవడం"

తప్పకుండా వుంటుంది. నేను కూడా వేశాను. నాకా రాత్రి నిద్ర పట్టలేదు. 'ఉరిశిక్ష' తీసివేయాలని నా వ్యక్తిగతాభిప్రాయం.




"రోగిని కాపాడి రోగాన్ని నిర్మూలించాలనే న్యాయ శాస్త్రం, ఉరిశిక్ష విషయంలో నిర్లిప్తంగా వుండడం పరస్పర విరుద్ధం"

చేసిన చట్టాల్ని అమలుజరపాలి. సామాజిక పరిస్థితికి, నేరానికి సంబంధం చూసేది పార్లమెంటు. ఆర్థిక నేరాలు తీవ్రమైనవిగా పరిగణి స్తున్నాం. ఎకనామిక్ అఫెండర్స్‌ను తీవ్రంగా శిక్షించాలని కోరుతున్నాం. ఆకలికి సంబంధించిన దొంగతనాలకు న్యాయస్థానాలు మందలింపు చర్య ల్లాంటి తీర్పులిస్తాయి ఆర్థిక నేరాలకు కఠిన శిక్షలు విధిస్తాయి. పార్లమెంటు కోరేదీ అదే.

“మనం సమాజాన్ని మార్చకుండా రాజ్యాంగాన్ని
మారిస్తే మిగిలేది రూపభేదమే”

రాజ్యాంగం సమాజానికి ప్రతిబింబం అయి తీరాలి. లేకుంటే రాజ్యాంగం నిలవదు. రెంటికీ అవినాభావ సంబంధం వుంది. సాంఘికావసరాల్నిబట్టి రాజ్యాంగం మారాలి. మారుతూ వుంది కూడా.

“ధర్మాసనం మీద కూర్చున్న మొట్ట మొదటి రోజు”

నాలో చాలా గురుతరమైన బాధ్యత ఏర్పడిందని, ప్రజల జీవితానికి సంబంధించిన సౌభాగ్యాన్ని నిర్వహించే అవకాశం వచ్చిందని, దాన్ని




నిర్వర్తించడానికి నిర్మలమైన దీక్ష కావాలని భావించాను (ఈ అభిప్రాయం వెలిబుచ్చుతున్నప్పుడు ఆనాటి అనుభూతి శకలాన్ని పరిమళింపచేశారు. ఉచ్చారణా గాంభీర్యంలో ఉజ్వల నయనాల నిర్మాల్యంలో.)

“వచ్చిన న్యాయశాస్త్రవేత్త-
ప్రధానంగా డాక్టర్ అంబేద్కర్”

(ప్రాపంచిక విషయాలపై నుంచి వ్యక్తిగత విషయాలవైపు దృష్టిని మళ్ళించాను. అరమరికలు, దాపరికాలు లేని నిర్మల హృదయం ప్రత్యక్షమైంది.)

"హేతువాదులు కావడానికి కారణం"

నా చుట్టూ వున్న మూఢనమ్మకాల్ని చూసి, గుడ్డి నమ్మకాలు తెచ్చి పెట్టే ప్రమాదాల్ని పరిశీలించి ఇటువైపు వచ్చాను. కవిరాజు, రసెల్, ఎంగర్సాల్, యం. యన్. రాయ్ రచనలు చదివాక బీజరూపంలో వున్న నాలోని హేతువాదం దృఢపడింది.

"న్యాయశాస్త్రం వైపు"

స్వాతంత్ర్యోద్యమ కాలంలో నాయకత్వంలో కనిపించినవారు న్యాయవేత్తలు. ప్రజల హక్కుల్ని పదిలపరచగలిగేది న్యాయశాస్త్రం అని ఆకర్షింపబడ్డాను.

"భారతం అభూతకల్పన అనే డాక్టర్ సంకాలియా వాదన"

దాన్ని ఒక కావ్యం కింద సాంఘిక, రాజకీయ జీవితాన్ని మానవ ప్రవృత్తిని అద్దంలో చూపెట్టే రచనగానే భారతాన్ని అర్థం చేసుకుంటాగాని, వాస్తవా వాస్తవ వివాదాల జోలికి పోను.

"రామాయణ విషవృక్షం లాంటి పుస్తకాలు"

ఖూనీ, సూత పురాణాల్లాగా ఆలోచనల్ని రేకెత్తించగలవు.

"జీవితంలో మరుపురాని సంఘటనలు"

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజు, గాంధిగారి హత్య, స్వాతంత్ర్యం వచ్చిందనే సంబరాన్ని నాశనం చేసిన హిందూ ముస్లిం కల్లోలాలు

"నచ్చిన తెలుగు పుస్తకాలు"

చాలా వస్తున్నాయి. మాలపల్లి, కన్యాశుల్కం, సూత పురాణం ఖూనీ, భగవద్గీత, భాగవతం, ఆముక్తమాల్యద, మహాప్రస్థానం, తిలక్ అమృతం కురిసిన రాత్రి.

"ఆదర్శ వివాహాలు, వర్ణాంతర వివాహాలు"

మిగతా వివాహాలు విజయం, అపజయం పొందినట్లుగానే ఇవీ పొందగలవు వీటికి ప్రత్యేక మినహాయింపులు లేవు వివాహం చేసుకునే వారి సంస్కారం పైన అన్నీ ఆధారపడి వుండగలవు. పరిణామాలకు పద్ధతులు కావు. కారణం—విశ్వాసాలు, విలువలు, సంస్కారం, ముఖ్యంగా పరిస్థితులు

"కర్మకాండ మీద"

మా అమ్మగారు పోతే ఏమీ చేయలేము. పేపలతో కలిసి ధోంచేశాను.




"మీ రచనలు"

ప్రజలు, రాజ్యాంగం—30 నాటికలు, ఎన్నో విషయాలపై ఐదు పందల దాకా వ్యాసాలు, వంద దాకా రేడియో ప్రసంగాలు, రెండువందల దాకా గ్రంథ పరిచయాలు.

(ఏప్రిల్ 1973